ఆంధ్రవిజ్ఞానసమితి. నెం ౫ రు.

# రుక్మవతీపరిణయము.

రేకపల్లి సోమనాథకవి.



ప్రకాశకులు:
ఆంధ్రవిజ్ఞానసమితి,
విజయనగరము.

వేంకటకవి

# విజ్ఞప్తి.

---

అప్పా రేకపలీ సో
మప్పా విబుధాళిపాళి యమృతపులప్పా
ఒప్పాలు నీకవితలు వె
న్నప్పాలకు సాటివచ్చునా! భళిరుచులన్.

అను పొగడ్తనుగనిన రేకపల్లి సోమప్పకవిచే రచింపఁబడిన యీ రుక్మవతీపరిణయ గ్రంథరాజము, మా ఆంధ్రవిజ్ఞానసమితి మొదవ గ్రంథముగ ముద్రించి ప్రకటించినారము.

ఈ గ్రంథరాజమును, శ్రీ యేలూరిపాటి రామభద్రచయనులుగారు గోదావరీమండలమున వ్యయప్రయాసలకోర్చి సంచారముచేసి, సంపాదించి చక్కని ప్రతినిదయారుచేసి ముద్రింపఁ దలఁచిరి. కాని కొన్నియవాంతరకారణముల వా రాపనికి పూనుకొనలేకపోయిరి. ఈ ప్రబంధరాజమునుగూర్చియు, యీ కవిశేఖరునిగూర్చియు, కీ. శే. బ్రహ్మశ్రీ బులుసు పాపయ్యశాస్త్రులుగారు 1916 సంవత్సరమున నాంధ్రపత్రికలోఁ గొంత వివరించిరి. తద్విషయమును బీఠికలో పాఠకులు గ్రహింపఁగలరు.

తర్కవ్యాకరణపండితుఁడును, సాంగవేదాధ్యేతయుఁ ఆంధ్రగీర్వాణభాషామహోదధియు అడిదము సూరకవీంద్రునకు ప్రతిపదమునను బ్రతిస్పర్థియు నగు నీ రేకపల్లి సోమనాథకవి,

యాంధ్రభాషాపాండిత్యము, సంస్కృతపదజటిలత్వము, భావగాంభీర్యము, రసప్రసారము, కథావిధానము మున్నగు వానిని దెలుపుటకు మా లేఖినికన్న, గ్రంథమే ముందంజవేయుచున్నది.

ఇంతదనుక ముద్రణభాగ్యమునుబొందని యీ ప్రబంధరాజము నచ్చుకు సిద్ధపఱిచి, మా సమితికి నొసంగిన శ్రీరామభద్రచయనులుగారికి నాంధ్రభాషాభిమానులతోపాటు మేమును వారికిఁ గృతజ్ఞతను జూపుచు, అముద్రితమగు నిట్టి ప్రౌఢప్రబంధము నాంధ్రలోకమునకు సమర్పించు భాగ్యము మాకుఁ జేకూరినందులకు సంతసించుచున్నారము.

పాండితీవయోవృద్ధులును, ఆంధ్రగీర్వాణములయం దసమానకవితాధోరణిగలిగి, యసంఖ్యాకములగు పొత్తములను రచించి యాంధ్రభారతికి సమర్పించిన విద్వత్కవులును, మహోపాధ్యాయ బిరుదాంకితులును నగు శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు మా ప్రార్థన నంగీకరించి దీనికిఁ బీఠికను వ్రాసి యిచ్చినందుకు వారికి మే మెంతయు కృతజ్ఞులము.

ఇట్లు,

విక్రమ కార్తికము,
28-11-40.

వేపకొమ్మ గురువేంకటసుబ్బయ్య,
అధ్యక్షుఁడు.

# పీఠిక.

ఈ కవిశిఖామణి వ్యవహారనామము సోమప్పశాస్త్రి. ఇతఁడు వైదికబ్రాహ్మణుఁడు. ఇతని తండ్రిపేరు సూర్యనారాయణసోమయాజి. ఇతని జన్మభూమి గోదావరీమండలములోని తాళ్ళపూడి. ఇతఁడు ముప్పదిసంవత్సరములవాఁడై యుండఁగా, నీయనతండ్రిగారు స్వగ్రామమగు తాళ్ళపూడిలో దారిద్ర్యపీడచేఁ గుటుంబభరణము చేయనోపక, స్వగ్రామమును వదలి సత్యవరమను గ్రామమును జేరుకొనిరి. సత్యవరము విశాఖపట్టణమండలములో తాండవనదీతీరమందున్న తునికి సమీపములోనున్నది. సోమప్పశాస్త్రికాలమున నా సత్యవరగ్రామము శ్రీ కాకర్లపూడివారికి రాజధానియై యుండెను. ఆదినములలో కాకర్లపూడివారిలో నొకకుటుంబము సత్యవరములోను మఱియొకకుటుంబము అనకాపల్లికి దగ్గఱగానున్న మెళుపాకలోను వేఱొకకుటుంబము అనకాపల్లిలోను రాజ్యము చేయుచున్నట్లు లేఖనప్రమాణములవలన స్పష్టమగుచున్నది. సోమప్పకవి కాలము సులభముగా నిర్ణయింపవచ్చును, ఎట్లనఁగా, ఇతఁడా కాలమందు శ్రీ విజయనగర సంస్థానమందు ఆస్థానకవియగు అడిదము సూరకవికి సమకాలికుఁడై యుండెను. అనఁగా (క్రీ. శ. 1720—1790) ఈయుభయులకు కవితాగర్వ ప్రయుక్తమైన స్పర్ధ మెండుగానుండెను. ఆనాఁడు సత్యవరములో రాజ్యము చేయుచున్న శ్రీ కాకర్లపూడి గోపాలరాయపాయకరావు (పాయకరావు అనఁగా, యుద్ధమందున్నవాఁడని అర్థము.) గారు సోమప్పకవిని అత్యాదరముతోఁ దనయాస్థానకవిగాఁజేసి సకలవిధములఁ బోషించుచు మాన్యములనొసంగి సత్యవరమందే నిల్పెను.

ఈ సోమప్పశాస్త్రి తర్కవ్యాకరణాదిశాస్త్రముల యందు మిక్కిలినిష్ణాతుఁడు. సాంగసశిరస్కవేదాధ్యేత. కనుకనే ఇతఁడు కృత్యాదిలో "ఉ॥ ఆదరమొప్ప పాణినికి నానతిచేసి తదీయశాస్త్ర మిమ్మేదిని భాతిజెంద నెలమిన్ బ్రకటాత్మ సహస్రవక్త్రసంవాదము చేసి, వాణి కనవద్యవిలాసము గల్గఁజేయ వృత్త్యాదితశబ్దమంజరిఁ బతంజలి నంజలిసేసి మ్రొక్కెదన్" అని పాణిని పతంజలులను బేర్కొనెను. ఇట్లితఁడు మహాపాండితీ విరాజమానుఁడై వావదూకశిఖామణియై యున్ననూ, ఆకాలమందు ముఖ్యముగా రాజులకు హృదయాకర్షకమగు కవనముఁజెప్పు శక్తిలేనివాఁడై యుండెను. కవితాలక్షణముకూడ నెఱుంగఁడు. అందుచే నతఁడు తన కిది గొప్పలోపముగదాయని తలంచి వెలివెల గౌతమరాజను నొక యాంధ్రపండితకవి నాశ్రయించి యతనియొద్ద నాంధ్రఛందశ్శాస్త్రముఁజదివి కొలఁదికాలములో కవనశక్తి నలవడఁజేసికొనెను. శాస్త్రప్రతిభావంతుఁడు గావున నల్పకాలములోనే నిరర్గళనిరవద్యకవితాధోరణీసంతర్పితసర్వపండితకవిలోకహృదయాంతరంగుఁ డయ్యెను. శాస్త్రజ్ఞాన పరిష్కృతకవిత, శ్లాఘ్యతమము కాదె! ఇతఁడాస్థానపండితుఁడుగానున్న కాలమున శానంపూడి తిమ్మకవియను నాతఁడాస్థానకవిగానుండెను. గోపాలరాయణింగారితనికి దోసలపాడను నగ్రహారమునిచ్చి గౌరవించుచు వచ్చిరి. సోమప్పకవి పండితుఁడుగాఁ బ్రవేశించిన కొలదికాలముననే తిమ్మకవి దేవభూయము నొందెను. అంత నాకవికుటుంబములో నెవ్వఁ డావదవి నధిష్టింపఁగల

యహఀతగలవాఁడు లేనందున, రాజుగారు సోమప్పకవిని దమ యాస్థానకవిగాఁజేసి యొక యగ్రహారమును దయచేసిరి.

ఈ కాకర్లపూడివారి వంశమందు జనించినవారు కవుల నాదరించి, వారివలనఁ గృతుల రచింపఁజేసి ఘనతనొందుటయే గాక స్వయముగాఁ గవులై కృతులను రచించినట్లు ఈ ప్రబంధ కృత్యాదియందున్న యీ క్రిందిపద్యమువలన తెలియవచ్చు చున్నది.

సీ. పద్మినీపరిణయ ప్రథితసత్కృతిఁజేసె
ప్రతిభాను భావసమ్మతముగాఁగ
రతినీలగిరినాథ శతకంబు గావించె
సుప్రసాదమహత్త్వదీప్రముగను
నవలేఖనీలేఖ్య కవితానవద్యత
వెలయించె ననురూపవృత్తి దనర
సతత చాటునిబంధసరసోక్తు లలరించె
సహృదయ హృదయైక సరణిమీఱ
నచుచుఁ గవులు నుతింతు రెవ్వని నతండు
సంగరాభీలకరజాలశమితవిమత
దవహుతాశుఁడు రామభద్రక్షితీశ
ఘనుఁడు భువనధురంధరఖ్యాతిఁ దనరె. (ప్ర. ఆ. వ. 62)

ఈ రాజవంశములోనివారు విజయనగరసంస్థానములోఁ జేరిన భోగాపురగ్రామములో నిప్పటికిని నివసించుచున్నారు.

పద్మినీపరిణయాదికృతులు తద్వంశజులగు శ్రీ కాకర్లపూడి సత్యనారాయణపాయకరావుగారి సాహాయ్యమున వానిని వెలు వరింప సమితివారు ప్రయత్నింతురుగాక.

## ప్రబంధప్రతిపాద్యవిషయము.

కవి శ్రీమద్భాగవతదశమస్కంధమునుండి ఈకథను సంగ్రహించి ప్రబంధరూపముగ నొనర్చెను. కథానాయకుఁడు ప్రద్యుమ్నుఁడు. ఇతఁడు శ్రీ నందనందన నందనుండు. ఇతఁడు తొలి బాముల రుద్రనేత్రాగ్ని శిఖాకలాప భస్మీకృతాంగుఁడగు మన్మథుఁడే, మరల రుక్మిణీగర్భమునం దుదయించెను. ఇతఁడు తల్లికడుపునఁబుట్టినపుడే శంబరాసురుఁడను నొకఘోరదానవుఁడు శిశువు నపహరించి సముద్రమందుఁబడవైచెను. ఆశిశువు నొక మహామత్స్యము మ్రింగెను. ధీవరు లొకనాఁ డాచేపను వలతోఁ బట్టుకొని తమ యెకిమీఁడైన శంబరునికి నుపాయనముగా నొసం గిరి. ఇంతకుముందే పూర్వజన్మమందు మన్మథుని కళత్రమగు రతీదేవి తనభర్తకు భావికాలమున వాటిల్లు విపత్తును నారద మహర్షి వలనఁ దెలిసికొని, శంబరాసురుని మహానసమందు నివ సించియుండెను. అచ్చటనంతు సాచికు లాచేపను ఖండింపఁగా, దాని గర్భమందు జగన్మోహనమూర్తియగు నొకశిశువు కాన్పిం చెను. ఆరతి యాసూదకులను మంచిమాటలతో ననునయించి, ఆపిల్లవానిని తనసంరక్షణలో నిడికొని పూర్వజన్మవృత్తాంత మంతయు నతనికెఱింగించి మహామాయావంతుఁడగు నాశంబరుని

బరిమార్పఁగల సకలమాయల నతనికి గఱపి వానిని నిహతుని జేయించెను.

ఈ ప్రద్యుమ్నుఁడు తన మేనమామయగు రుక్మియను వాని కుమార్తెను స్వయంవరమునందు రాజుల నందఱిని తన బాహు పరాక్రమముచే నోడించి స్వయంవర వధువైన రుక్మవతియను కన్యారత్నమును దమరాజధానియగు ద్వారకాపట్టణమునకుఁ గొనిపోయి విధ్యుక్తముగాఁ బెండ్లియాడెను. ఈ ప్రబంధమం దితరకథాంశములున్నను రుక్మవతీపరిణయమే ప్రధానప్రతి పాద్యవిషయము.

ప్రబంధమున కుండవలసిన పురచాతుర్వర్ణ్యోద్యాన, సలిలక్రీడా ఋతుపానగోష్ఠీ, సూర్యోదయ చంద్రోదయాత్మ జోత్పత్త్యాది వర్ణనములలో నీప్రబంధమందుఁ గొన్ని గానవచ్చు చున్నవి. ఈ ప్రబంధము అయిదు ఆశ్వాసములతోఁ గూడినదియై ప్రాచీనప్రబంధలక్షణోపేతమై యున్నది.

ఇందలి ప్రథమాశ్వాసమం దిష్టదేవతానుతి, ప్రాచీనాంధ్రసంస్కృతకవిస్తుతి, కుకవి నిరాకరణము, కృతినాయకుని వంశ వర్ణనము, ద్వారకాపురవర్ణనము, పురపాలకుఁడగు శ్రీకృష్ణుని వర్ణనము మొదలగు విషయములున్నవి.

ద్వితీయాశ్వాసమందు, రుక్మిణీగర్భమందు ప్రద్యుమ్నుఁడు జనించుట, శంబరాసురుఁడాశిశువును సముద్రములోఁ బడవైచుట, ఆశిశువును మ్రింగినచేపను జాలర్లుపట్టితెచ్చి శంబరాసురుని కుప

దగా సమర్పించుట, పాచికలాఱుపోదరమును వ్రచ్చిచూడఁగా, బాలార్కసమతేజుఁడగు నొకశిశువును గాంచుట, ఇంతకుము న్నె ప్రద్యుమ్నుని పూర్వ భార్యయైన రతీదేవి నారదునివలనఁ దానెరింగిన వృత్తాంతమును ప్రద్యుమ్నునకుఁ జెప్పి మాయలఁ గఱపి శంబరుని జంపించెను.

తృతీయాశ్వాసమందు, రుక్మిరాజపురమైన కుండినపట్టణమును వర్ణించుట, రుక్మవతీప్రద్యుమ్నుల యవ్వనప్రాదుర్భావ వర్ణనము, అన్యోన్యసౌందర్యలావణ్యగుణగణాకృష్టహృదయులైన రుక్మవతీప్రద్యుమ్నులకుఁ బరస్పరానురాగోదయ వర్ణనము ప్రతిపాదింపఁబడినది:—

చతుర్థాశ్వాసమందు, ప్రద్యుమ్నుని కామయ మానావస్థావర్ణనము. రైవతకాద్రి హాలాపాన జలక్రీడాదివర్ణనము, మొదలగు విషయములు వర్ణింపఁబడినవి.

పంచమాశ్వాసమునందు రుక్మవతీ స్వయంవరార్థమై నానాదేశాగతులైన రాజులవర్ణనము, సపరివారుఁడైన ప్రద్యుమ్నుఁడుకూడ కుండినపురమున కేఁగుట, స్వయంవరమందు రుక్మవతి ప్రద్యుమ్నుని వరింపఁగాఁ బ్రకుపితులైన రాజులందఱు ప్రద్యుమ్నునిపై యుద్ధసన్నద్ధులగుట, ప్రద్యుమ్నుఁడు వారినందఱిని దన కోదండపాండిత్యముచేఁ బరాజితులఁ జేసి స్వయంవరవధువగు రుక్మవతిని దన రాజధానియగు ద్వారావతీనగరమునకుఁ గొనితెచ్చి యచట మహావైభవముతో నా కన్నియను బెండ్లియాడుట, మొదలగు విషయములు ప్రతిపాదింపఁబడెను.

## కవినిగుఱించి.

ఈ కవిశేఖరుఁడు, ఇటీవలఁ బ్రబంధములను రచించిన మధ్యకాలపుఁ గవులవలె, నుభయభాషాపాండిత్యవిశారదుఁడై యుండుటయేకాక, శాస్త్రజ్ఞానభాసురుఁడై యుండుటచే, నీతని కవనము సంస్కృతపదభూయిష్ఠమై ప్రకాశించుచున్నది. ఈకవి శైలి ఉత్తరరామాయణమును రచించిన కంకంటిపాపరాజు, సమీరకుమారవిజయప్రణేతయగు పుష్పగిరి తిమ్మన్న, రాజవాహనవిజయప్రబంధకర్తయగు కాకమాని రాయఁడు మొదలగు వారి శైలిని బోలియున్నది. ప్రబంధమం దెచ్చటఁజూచినను ఓజస్సు, ప్రసాదము, మొదలగు కావ్యగుణములే కానవచ్చుచున్నవి. ప్రబంధమందు నానావిధవృత్తములను గవి రచించి యుంచెను. వర్ణనలయం దుత్ప్రేక్ష, అతిశయోక్తి, ఉదాత్తము మొదలగు నలంకారములు మెండు. కవనము వెదికినను గ్లిష్టముతోఁగూడియుండలేదు. వైదర్భీవృత్తియే గానవచ్చుచున్నది.

ఈకవికి, సమకాలికుఁడగు అడిదము సూరకవికి, బహుళముగాఁ బ్రవర్తిల్లిన స్పర్ధనుగుఱించి మా ప్రియమిత్రులు, మహారాజావారి ఆంగ్లేయకళాశాలయందుఁ జిరకాల మాంధ్రపండితులుగానున్న అడిదము రామారావుపంతులుగారు వ్రాసిన "విస్మృతకళింగాంధ్రకవులు" అను గ్రంథములో సవిస్తరముగా వ్రాసియున్నారుగాన, మరల నేనిచ్చట వ్రాయుట చర్వితచర్వణమనియు, గ్రంథవిస్తరహేతువనియు, దలంచి విడిచితిని.

స్వయముగాఁ బండితులు, గ్రంథవిమర్శనకళాధురీణులును, ఆంధ్రభాషాభిమానులు, కవిజనాశ్రయులు, నగు మహారాజశ్రీ రావుసాహేబు, వేపకొమ్మ గురువేంకటసుబ్బయ్య, బి. ఇ., సి. ఇ., యం. ఐ. ఇ., గారివంటి శ్లాఘ్యచరిత్రు లీకాలమందు ప్రాతస్తన తారకలవలె మృగ్యులు. వీరు నిర్వహించుచున్న యుద్యోగపు కార్యధూర్వహనమును సులభముగా నెఱవేర్చుచు, ఆంధ్రవిజ్ఞాన సమితి యను నొకసంఘము నేర్పఱిచి, అముద్రితప్రాచీనాంధ్ర గ్రంథములను నానాదేశములనుండి యెంతో శ్రమతో సంపాదించి, వాని నచ్చొత్తించి, దేశమందు వ్యాపింపఁజేయువారు మరెవ్వరున్నారు. ఆహా! వీరి చరిత్ర ముదాహరణపాత్రము, అనుకరణీయమును.

మందీభూతదృక్ఛక్తిగల నాకు గ్రంథపఠనలేఖనాదిక యందు సహాయమొనరించిన శ్రీమాన్ బృందావనం శేషాచార్యులుగారికి, నాపౌత్రియైన మేడేపల్లి ఆండాళ్ళమ్మకును నేను మిక్కిలి కృతజ్ఞుఁడనై యున్నాను.

ఇట్లు విన్నవించు విబుధవిధేయుఁడు,

మహోపాధ్యాయ: మేడేపల్లి వేంకటరమణాచార్యుఁడు,

Retired Senior Sanskrit Pandit,

Maharaja's College, Vijayanagaram.

శ్రీరస్తు.

# రుక్మవతీపరిణయము.





## ప్రథమాశ్వాసము.





వైదేహీశుభావహాలకభర
శ్రీకృష్ణవేణీక్ ఘన
ప్రావీణ్యాత్మ కరారవిందకలనన్
బద్మాక్ష్యాఁ జేసి సం
భావోల్లాసము పూను పుష్పగిరి రా
మబ్రహ్మ ముద్వేల శో
భావిద్యావిభవంబు లీవుతను గో
పాలక్ష్మాజానికిన్.

సీ. వసుమతీగర్భ భాస్వత్ క్షీరవారాశి
సంతానవల్లి యేసాధ్వమూర్తి
జనకావనీనాథ ఘనతపఃపుంజ పుం
జిమ మే లసన్నీల చికురమహిమ
దశరథాధీశ్వర ధన్యవంశాంబుజా
కరలక్ష్మి యే తన్వి సరసకీర్తి
రావణగర్వాంధ భావసంతమస ప్ర
దీప మే లలితాంగి దివ్యచరిత

గీ. మట్టి లోకైకజనని నిత్యాభియుక్త
పాలనోద్వేల కారుణ్య భవకటాక్ష
లీల శ్రీరాముఁ రాణి గోపాలరాయ
మణికి నొడఁగూర్చు శుభపరంపరల నెలమి. 2

శా. నీలామంగళ మంగళాస్పదములన్ శృంగారభావోదయో
ద్వేలాపాంగ సమావలోక సరణిన్ వీక్షింపుచుం దక్షిణుం
డై లీలందగు వేంకటేశుఁ డుపమా కాహార్యనాథుండు వ
క్షోలక్ష్మ్యందిరుఁ డాదరించు సిరులంగోపాలరాయాగ్రణిన్.

శా. శ్రీవత్సద్యుతి, హారకౌస్తుభమణిశ్రీయుం బ్రియోరస్థలిన్
భావింపంగఁ బరస్పరావరణ మందం జందనాలేప లీ
లావష్టంభము చేతఁ దమ్మిని కభిఖ్యంగూర్చు నాపద్మ ధీ
ప్రావీణ్యంబున నిచ్చు వైభవము గోపాలక్షమా భర్తకున్.

శా. లీలం బల్కు వెలంది నవ్వదనపాళిం జేర్చి రాజ ప్రసో
ద్వేలాశేషకళాకలాపకలనన్ విఖ్యాతఁగాఁ జేయుచున్
మేలొందింపుచు లోకమేలు నలవాణీజాని చేకూర్చు గో
పాలక్ష్మాతలభర్త కాదృతిని శుంభత్సౌఖ్య దీర్ఘాయువుల్.

ఉ. సారతరాక్షరధ్వనితశబ్ద జగత్పరిణామకారణా
కారికయై విలాసపరికల్పితదివ్యమనోజ్ఞమూర్తియై
సారసభూముఖాంబురుహషట్పదియైముఖరాయమానయా
భారతి మత్కృతీశుఁ బ్రతిభావిభవోజ్జ్వలుఁ జేయుఁ గావుతన్.

మ. ప్రమదంబొప్పనగాధిరాజతనయాపాణిగ్రహోత్సాహమిం
పమరన్ దత్కరపల్లవారుణకరుండై త త్సమగ్రానురా
గము హస్తాగ్రగతంబుగాఁ దలఁచు శ్రీకంఠుండు గోపాలరా
యమహీవల్లభుఁ బ్రోచుఁ గావుతసమస్తైశ్వర్యసంధాయియై.

సీ. బాలయై నిలసనోద్వేలయై కరుణాల
వాలయై పావనశీల యగుచుఁ
త్రిపురయై భక్తావనపరయై సకల స
జ్జపరయై మూర్తి త్రయపర యగుచు
లలితయై లావణ్య కలితయై శివతపః
ఫలితయై ప్రజ్ఞాన మిళిత యగుచు
విద్యయై యోగీశ హృద్యయై సుగుణవై
శద్యయై బ్రహ్మాది వేద్య యగుచు

గీ. నలరు నేధన్య, సకలలోకైకమాన్య,
యీప్సితవదాన్య, యా నగాధీశుకన్య
పూజ్య సామ్రాజ్యవైభవస్ఫురణగలుఁగఁ
జేయు నెలమిని గోపాల రాయమణికి. 8

చ. అనఘ మదీయకావ్యరచనావసరప్రసరద్ఘనాంతరా
యనిచయ దుస్తమోపహృతికైతగుభక్తి జగత్ప్రభాస్వరం
బు, నిఖిలసేవ్యమానము వపుర్నరమానన కుంజరంబునై
యనుపమమానోకానోకమహత్తర తేజముఁ బ్రస్తుతించెదన్.

చ. తలఁతు, సుశిక్షితాక్షముఖ దైత్యనికాయుని, జానకీమనో
వలితక్ర పారసక్షపిత వాలగతజ్వలనాంతరాయు, ను
జ్జ్వలతరవజ్రకాయు, మునిసంతతిగేయు, నిరస్తసంస్మర
త్కలుషఘనాంధకారసముదాయు, నజేయుని, నాంజనేయునిన్.

మ. అనిశంబున్ వితతంబులై యలరుబ్రహ్మాండంబులంగుక్షియం
దునయుం బారవహింపుమనట్టిపరమాత్మున్ భూరిసత్త్వాఢ్యునిన్.
దనపక్షంబుల లీలఁదాల్చి వినతానందానుసంధాయియౌ
వినతానందనుఁ బ్రస్తుతించెద శుభావిర్భావముల్ గోరుచున్.

మ. మహిమాంచద్విబుధావళీష్టఫలశుంభత్కీర్తిపుష్పౌఘముల్
మహనీయప్రతివాది భీకర కులాలంకార సద్వేద రా
శిహిత శ్రీవరదార్య వార్ధి వరజాశీర్వాద మందారముల్
రహిఁగోపాల నృపాలచంద్రునిసమర్థచ్ఛాయలన్ బ్రోవుతన్.

చ. సిరిదనరార న్యాయమువిశేషము సత్క్రియ బ్రహ్మతత్త్వమున్
సరస తరోక్తులందెలుపు శాస్త్రిచతుష్కపు హారవల్లికిన్
సరసతసూత్రకర్తలయి సన్నుతికెక్కిన వారినెంతు దృ
క్చరణమునిం, గణాదమునిజైమిని, వ్యాసమహామునీశ్వరున్.

ఉ. ఆదరమొప్ప పాణినికి నానతిచేసి తదీయ శాస్త్ర మి
మ్మేదిని భాతిఁజెంద నెలమిన్ బ్రకటాత్మ సహస్రవక్త్రసం
వాదము చేసి, వాణి కన వద్యవిలాసముఁగల్గఁజేయ వ్యా
ఖ్యాదిత శబ్దమంజరిఁ బతంజలి నంజలిసేసి మ్రొక్కెదన్.

చ. ధరణిఁ జతుష్పదీపరిమితంబగు వాక్సరభిప్రచార మిం
పరయఁగఁ దెల్పఁగాంచి భువిఖ్యాతిఘటించఁగ రామసత్కథా
భరితముగాఁ జతుష్పద నిబంధము చేసి కృతార్థుఁడౌ మునీ
శ్వరవరు వామలూరుభవు సన్నుతి సేతు నభీష్టసిద్ధికిన్. 15

చ. ఘనతఁ గవీంద్రకోటికి శిఖామణులై తగువారిఁ గాళిదా
సుని భవభూతిదండికవిఁ జోరుని బాణుమయూరు భారవిన్
వినుత శుభాఘు మాఘు జన విశ్రుతు మల్హణుబిల్హణుం బ్రశ
స్తిని సముపాస్తి చేసెద మదీయకృతిప్రతిభావిభాతికిన్. 16

గీ. ఆంధ్రసువచః ప్రపంచ వాగధిపు నన్న
యార్యు నెఱ్ఱప్రగ్గడ నుభయకవి మిత్ర
కవివరేణ్యు హుళిక్కి భాస్కరుని వేక్క
సహజపాండిత్యకవివర్యు సంస్మరింతు 17

క. ఎలమి నిదానింతనులగు
విలసిత వాణీవిహార విద్వత్కవులన్
దలఁచెద మామక కవితా
కల నలఁ బరిశీలనంబు గైకొను కోర్కెన్. 18

చ. సరసమహాకవీశ్వరుల చాయలఁ జెప్పుట యుత్తమంబు, త
ద్విరచిత యుక్తి కన్యపదవిందగఁ గూర్చుట మధ్యరీతి, యా
సరణులుమాని సాహసిత సత్కృతి చౌర్యకృతిప్రయుక్తిచేఁ
బరగెడునిస్త్రపాత్మకులఁ బాడియె నెమ్మది సంస్మరింపఁగన్.

మ. ఘనవృత్తుల్గుణముల్గణింపఁక నలంకారంబులుఁ రీతులున్
ఘనవాక్యార్థపదార్థసంగతు లెఱుంగన్నేరకే యూర కిం
పునఁ బ్రాబంధికులైరికొందఱుకవుల్ "పుణ్యైర్యశోలభ్యతే"
యనువాక్యంబు ప్రమాణమయ్యెనిపుడాహా! చిత్రమిద్ధారుణిన్

చ. వరకవులంచుఁ గొందరఁట! వారలు సాహితి లేకయే కవీ
శ్వరులఁట! వాగ్ఝరీకలన చాలఁగఁగల్దఁట! చిత్రమయ్యెడిన్
వరములొసంగుదైవములు వాగ్ఝరినిచ్చుచుశాస్త్రసంగతిన్
వరమిడలేవె, సిగ్గడలు వాదులుగాక కవిత్వరీతులే ? 21

వ. అనియిట్లు మచ్చికీర్షితప్రబంధనిరంతరాయ పరిసమాప్తి సంప్రదాయావిచ్ఛేద లక్షణ ఫలకారణ శిష్టాచారానుమిత శ్రుతి బోధిత కర్తవ్యతా కవిశిష్టేష్ట దేవతాప్రార్థనారూప మంగళాచరణంబును, శాస్త్రప్రవర్తకమహర్షి స్మరణంబును, ప్రాచీనాద్యతనమహాకవిజన నమస్కరణంబునుం, గుకవి తిరస్కరణంబునుం గావించి, సకల విద్వత్కవిజనానుగ్రహంబున నొక్క మహాకావ్యంబు నిర్మింపందలంచియున్న సమయంబున. 22

సీ. తన సుదర్శనలీల ఘనపుణ్యజనులకుఁ
బ్రతిదిన జీవనప్రదముగాఁగఁ
దన మహోదర రీతి దాక్షిణ్యకలితమై
విజయమంగళఘోష వృత్తినెఱయఁ

జనవంశ భరణంబు దార తరానురా
గమున సాధుహృదయంగమతఁ దనరఁ
దన సత్యభామాహిత ప్రఖ్యవిబుధాగ
మానంద కలనచే నతిశయిల్లఁ

గీ. ధరణి విశ్వంభరాధరోద్ధరణ విస్ఫు
రద్భుజామండలాగ్ర విరాజమాన
భూరి సామ్రాజ్యలక్ష్మి విహారుఁడగుచు
రమణఁ జెలువొందు గోపాలరాయవిభుఁడు. 23

వ. మఱియు నుదారతరాత్మీయ యశోవిశద పట్టాంబర సంభావిత ధరణీ తరుణీసోత్కంఠ కంఠాశ్లేషోపలక్షకచ్ఛాయామండల లక్ష్యమాణ గ్రైవేయక తరళ హీర పరిశోభిత సహజ వత్సలాంఛన సమాసాదిత శ్రీవత్సాంక సారూప్య దేదీప్యమానుండును, మానవతీ జనాభినవసుమనః కోదండుండును, దండవ దానమన్నిఖిలభూపాలక మకుట తటఘటిత వివిధ రత్న ప్రభానికర విరహాసహాన సమాకృతి సువర్ణచిత్ర కుధాస్తరణ విచిత్ర మహాస్థానభవన ప్రదేశుండును, దేశాంతర మహీరమోపారమణ ప్రేషిత ప్రధాన జన సవినయ విజ్ఞాపిత తచ్చరణ వర్ణనాకర్ణ నాదరణుండును, రణరంగ భైరవోదగ్ర బిరుదవర్ణ ఘటితోర్జిత విజయధ్వజాగ్ర సమగ్ర పరిస్ఫుర త్పురు మాయి వినీలపట సముద్ధూత వాతూల సముతూలిత నానాయవనసైనికాధీశయవనుండును, వస

బిరుదర గండాంకుండును, శ్రీ సాతోడా బేహారామహాపాత్ర విఖ్యాత జైత్రబిరుద వినుత చరిత్రుండును, శ్రీ వసిష్ఠగోత్ర పవిత్ర కాకర్లపూడి వంశాంబుధి కైరవమిత్రుండును, శ్రీ కృష్ణలీలా సుధారస సరసకృతిప్రముఖ సప్తసంతాన నిరంతరీకృత సంతోషస్వాంతుండును, ఆశ్రిత జనవన వసంతుండును, శ్రీ జగన్నాథరాజ సంచిత సమంచిత పుంజీకృతానేక పుణ్యఫలుండును, చంద్రమాంబా గర్భశుక్తి ముక్తాఫలుండును, నగు శ్రీగోపాలరాయ మహీమండలాఖండలుం డొక్కనాఁడు తనసుందర వదనారవిందం బిందుబింబంబగుట నిటలస్థలకలిత కస్తూరీతిలకంబు నియతకళంక రేఖావిలాస సంపద సొంపు సంపాదింప, నింపలరు దరహాసప్రసారంబు తదనుగత చంద్రికాసారప్రచారంబులం బచరింప, గండస్థలంబుల రుచులం దనరు హురుమంజి ముత్తియంబుల కుండలంబు లిరుగడల నెనతెగనిప్రేమ నర్మక్రీడలం గేరు తారకల తీరు సైరింప నాత్మగళంబు కంధరాంకంబుగావున ధగద్ధగిత కనక కంఠాభరణంబులు విలసిత విద్యుద్వలయంబుల లీలఁ దెలుప, నిజభుజాయుగళంబు భూరి ధరాధురంధరంబుగావున మణిమయ కటకాంచిత శ్రీలవెలయింప, రాజపరమేశ్వరుండు గావున సర్వమంగళాలంకార విగ్రహుండై స్వకీయ దైనందినావిచ్ఛిన్న దానధారాప్రవాహంబులఁ దనుపంబడి, కడలి కడఁగనని వేడుకఁగానుకగా నొసంగిన పగడఁపు తరులఁదరి

చిన పలకల కలప సలరి యనల్ప శిల్పిక చాతుర్య విరచితంబు లగు ముకుళిత వికసిత జలజకైరవాది వివిధ సుమనోవితా నంబుల వాటంబులగు వజ్రకీలిత కవాటంబులును, హంస కాది విరాజిత చిత్రబంధంబులగు జలజోపలద్వారబంధం బులును, భ్రమర విభ్రమ భ్రమకర బలభిన్నీలజాలక పరం పరాభిరామ కరి మకరికాకార రేఖావిభాగంబులగు మరకత కుడ్యభాగంబులునుం జెలంగ, నంతటం గలువల చెలి రాక ట్టునం బట్టగు నడుగు మట్టి మెరుంగుల రంగు తరంగిత విమ లవారి తీరు నెఱప, నకలంకంబగు కెందమ్మి కొలఁకునఁగం జాలు జలజ సదనానివాసంబున నర్ఘ్య హేమ మయమణి ప్రభావిభాసితసింహాసనాసీనుండై, సకల విద్వత్కవిబృం దంబులతో నమంద చాతురి ననవద్య హృద్యప్రబంధ కథా ప్రసంగ సంగతి నంగీకరింపుచు, 24

మ. తన కత్యంతము నవ్యసారకృతి నందన్ వాంఛ డెందంబునం
దనరన్ మామకసాహితీరససముద్యత్ప్రౌఢ వాగ్గుంభనం
బు, నిరాఘాటముగా నెఱింగినను సామ్ముఖ్యంబునం జేరరా
ననుమోదింపుచుసోమనాథసుకవీంద్రా రమ్మటంచుందయన్‌॥

చ. ప్రతిభ దలిర్ప నీహృదయ భాసురసీమ జనించినట్టి స
న్నుత కవితాలతావళు లనూన విభావిత సాహితీ రస
ప్రతతులఁ బోషితంబులయి బాగుగనేర్పువహించె దానికిన్
జతురత నీవొనర్చు కృతి సత్ఫలమై రుచి సంఘటింపదే?

వ. అని రసాదితాలంకారచమత్కారబంధురప్రబంధనిర్మాణ నియోగ నిబంధంబుగా నానతిచ్చి, కారుణ్యకటాక్షవీక్షణామృత ధారావర్షంబుల నభిషేకంబొనరించి, సముంచిత కాంచన దివ్యాంబరాభరణంబుల నలంకరించి, సుప్రసాదంబునం బరితృప్తుం జేసిన, నేనును నిరతిశయానందరసనిష్యందకందళిత హృదయారవిందుండనై, ప్రభుమతంబును మదభిమతంబును, బింబ ప్రతిబింబభావంబునం దాదాత్మ్యంబునం జెందెఁ గావున మత్కావ్య శ్రీనాయకుండు మహాకులీనుండగుటం దదీయవంశాభ్యుదయం బభివర్ణించెద. 27

చ. సిరిమెఱయంగ లోకములఁ జేయఁగఁ బ్రోవ హరింపఁ గోరి తామరసదళాక్షుఁ డప్రకృతి మానిత సత్త్వరజస్తమంబులన్ బరిణతిఁ జెందఁబూని నిజ నాభిసరోరుహ మధ్యసీమఁదానె, రజమునం జనించె నలసీరజసూతియన న్విధాతయై. 28

గీ. మహిమఁ జెన్నొందునట్టి తామరసభవుని
పొలుపుగాంచిన మానసపుత్త్రుఁడగుచు
గశ్యపబ్రహ్మ లోక విఖ్యాతిగాంచె
నతని కుదయించె మిత్రుఁ డాహ్లాదమెసఁగ. 29

శా. ఆత్రేయానలముఖ్య తైజసకళాధ్యస్తాకృతిం దాల్చి శశ్వత్త్రియ్యాత్మక మైత్రిమూర్తితను వైచైతన్యనిర్వాహమై సత్త్రాణార్థ నిజోదయాస్తమయ భాస్వల్లీలమై పొల్చు న మ్మిత్త్రిబ్రహ్మము కర్మసాక్షి జగదున్మేషావహస్ఫూర్తియై.

క. ఆమిత్త్రి బ్రహ్మమునకు
ధీమహితుఁడు గలిగె మనువు తెలివిని విశ్వ
క్షేమంకరసుగుణస్థితి
నామను విక్ష్వాకుఁగాంచె నధిక ప్రథితున్. 31

సీ. తగియె నిక్ష్వాకు వంశగరిష్ఠుఁడై నట్టి
సత్యసంధుఁడు హరిశ్చంద్రనృపతి
యా హరిశ్చంద్రుని యన్వయంబునను మాం
ధాత తేజమునొందెఁ దత్కులమున
సగరుండు జనియించె నగణిత సత్త్వాఢ్యుఁ
డతని గోత్రమున నున్నతివహించె
ఘనుఁడు భగీరథక్ష్మాపతి యతని సం
తతినిఁ దిలీపుఁ డుద్భవమునొందె

గీ. నతనికి సుదక్షిణాదేవి యందుఁగలిగె
నకలుషుండగు రఘువు విఖ్యాతచరితుఁ
డతని కాత్మజుఁడై యొప్పె నజుఁ డతనికి
దశరథక్షోణిపాలుండు తనయుఁడయ్యె. 32

గీ. ఆ దశరథావనీ భర్త కఖిల భువన
రక్షణార్థైక లీలాభిరాముఁడగుచు
రాముఁ డుదయించె నిజచరితామృతంబు
కమలహిత వంశవర్ధన కరముగాఁగ. 33

సీ. ఏ మనోహరు తను కోమలసౌందర్య
మఖిలసన్మునుల మోహాబ్ధిముంచె
నే వీరవరు నేత్ర జావంధ్యరోష శో
ణిమ సముద్రుని శరాగ్రమున నిల్పె
నే కృపాళు కటాక్షవీక్షణం బరిసహాబా
దరుని సామ్రాజ్య విస్ఫురితుఁజేసె
నే పుణ్యపాదాబ్జ హిత ధూళి కఠిన పా
షాణ మేణీవిలోచనగఁజేసె

గీ. నతఁడు జగదసాధారణఖ్యాతమహిత
రూపవైభవ శౌర్యకారుణ్యపావ
నతల నుతిఁగాంచె; దశరథానందవార్ధి
చంద్రుఁడైనట్టి శ్రీరామ చంద్రవిభుఁడు. 34

క. ఆరామునికభిరామ య
శోరమ్యుఁడు కుశుఁడు గలిగె శుభకరమగు త
ద్ధారుణిపతి వంశమునన్
మీఱె బృహద్బలుఁడు ధామనిధి తేజుండై. 35

క. ఆవంశంబునఁ గలియుగ
భూవరమణిమకుటఘటిత భువనజరత్న
శ్రీవర ణారుణకమల వి
భావిత చరణుండు కసవపార్థివుఁ డలరెన్. 36

మ. వసుమత్వంశ మలంకరించె మనువిక్ష్వాకుంగకుత్థ్సునన్ రఘున్
వెసరామున్ మఱిపూర్వరాజుల మహావిఖ్యాతచారిత్రులన్
స్వసముద్యద్ఘనకీర్తిసంతతుల నంతర్భావమొందింపుచున్
గసవత్క్ష్మావరచక్రవర్తి జగదేకప్రాభవస్ఫూర్తియై. 37

క. దేవన విభు కసవేంద్రుఁడు
భావింప బలాప్తుఁడై యప విపక్షతిగా
త్రావన లీలా లాలితుఁ
డై వెలయ సపూర్వ మహిమ నద్భుతమొదవన్. 38

ఉ. ఇంద్రునికన్న నెక్కుఁగసవేంద్రుఁడు శ్లాఘ్యుఁ డదెట్లనంగ, న
య్యింద్రుఁడు పక్షపాత మొనయించిననాగతినిర్గతుల్ చెడున్
సాంద్రత నట్లు సేయఁగనె సద్గతిగల్గుటఁ దారతమ్య ని
స్తంద్రవిచారముల్ సలుపసాక్షులుతద్రిపుభూభృదావళుల్.

క. ఆ కసవక్ష్మాతలపతి
యేకచ్ఛత్రంబుగాఁగ నేలుచు జగతిన్
గాకరలపూడి యనుపురిఁ
జేకొని నిజరాజధానిఁ జేయఁగఁదానన్. 40

క. కాకరలపూడి కులము ది.
వాకరవరవంశ సంభవంబై ధరణిన్
శ్రీకరముగ సద్వంశం
బై కరమొప్పు నృపమణుల కాశ్రయ మగుచున్. 41

శా. తద్రాజాన్వయకర్త్రయా కసవగో త్రాభర్తమాదాంబ, నా
దభ్రద్రాజాననబింబ, కైశిక భరవ్యాధూత రోలంబ, స
ద్భద్రశ్రీపరిణాహ మొప్పఁగ నమంద ప్రేమ నుద్వాహమై
సద్రూపాఖ్య కుమారసప్తకము నంచల్లీలఁగాంచెన్ రహిన్.

సీ. లసదనంతాకల్ప లాలిత శ్రీకళా
రాజితుం డప్పలరాజమౌళి
నిజదర్శనైక సన్నిహిత భాస్వద్రాజ
తేజుండు దేవనరాజ శౌరి
తుంగ భూభృచ్ఛృంగ భంగదస్వరుచిర
హేతి సాంద్రుఁడు జగ్గభూతలేంద్రుఁ
డత్యంత సౌమ్య గుణైక ప్రకాశన
ప్రవణుండు వేంకటరాజచంద్రుఁ

గీ. డతి సరసమూర్తి నరస భూపతి ఘనుండు
నవ్యగుణహారి కోన భూనాయకుండు
భూరిధాముండు మల్లపభూభృ దినుఁడు
నలరుచుందురు గాంభీర్యజలధులగుచు. 43

ఉ. వారలలోన నగ్రజుఁ, డవారిత సత్కరుణావిశాలుఁ, డు
ర్వీరమణీయశోవిశద విశ్రుతహార సరోజరత్న వి
స్ఫార మహామహుం, డఖిల పార్థివకోటికిరీట లాంఛ నో
దారపదారవిందయుగుఁ డప్పలరాజు నుతింప శక్యమే! 44

శా. ఆదిత్యోజ్జ్వల తేజుఁ డప్పలధరాధ్యక్షానుజన్ముండు దా
శ్రీదేవప్రభుఁడాటఁ దెల్పె విబుధక్షేమంకరోద్యోగియై
మోదాపాది గజేంద్ర భూప్రథిత సంపూజ్యాధిరాజోన్నత
శ్రీదప్రాభవుఁడై సమాశ్రిత మహాశేషస్ఫురద్భోగుఁడై.

క. ఆయన యనుజాతుం డన
పాయ సమద్భూమినాయకార్పిత వివిధో
పాయన విధి యసమ చతు రు
పాయనయుఁడు జగ్గ ధరణిపాలకుఁ డలరెన్. 46

ఉ. ఆయతకీర్తి వేంకటనృపాగ్రణి దాన పయస్సుధాంబుధిన్
బాయకతోఁచుకీర్తి హిమభానుల నాత్మశిరోవతంసులన్
జేయుచుఁ దత్కృపాణమయ చిత్రవిషానలకీలనంటి స్వ
శ్రేయమె పొందఁజాలుదురుసిద్ధము శాత్రవరాజభూషణుల్.

చ. అనినఖరాయుధస్ఫురణ నర్భకుఁ బ్రోచిన యర్థపౌరుషం
బనువగునే సమస్త శరణాగతపాలన శాలినైన నా
కనుచును విగ్రహాంతరయుతైకసమాఖ్యనృసింహుఁ డాతఁడ
య్యె నిశిత సాయకస్ఫుర దహీన పరాక్రమలీలఁ దెల్పుచున్.

క. సాహసగతిఁ గోనప్రభు
బాహాతిబలంబు వైరి పార్థివఘన సం
దోహములను దెరలిచి త
ద్వాహినులం గలఁచె భంగ వశ్యతఁ జెందన్. 49

క. మల్లపరాజితఁ డర్జున
మల్ల పరాజితుఁడు దన సమానుఁడై బాహో
ద్వేలిత శౌర్యముచే నని
యుల్లమునన్ మీఱునెపుడు నగ్రగునినైనన్. 50

మ. వినయానూన యశోభిమాన ధన వద్వీరాధిపత్సప్తకం
బునఁ దేజఃకళ నద్వితీయుఁడగుచున్ భూపాలనప్రక్రియం
జనమాన్యుండగు దేవనేంద్రుఁడు గనెన్ సత్పుత్త్రిలన్ ముప్పురిన్
గనదగ్ని త్రితయంబుఁగాంచిన శమీగర్భంబుచందంబునన్.

ఉ. ఆహవనీయ తేజమున నగ్రజుఁడై కననేర్పుగాఁ జొప్పి, నా
నాహవనీయమాన సుమహః కనదాయత వీతిహోత్రకీ
లాహవనీయ వైరి సమిధావళియై వరకీర్తివైభవే
హాహవనీయమాన విబుధాగమ సంస్తవనీయమానుఁడై.

చ. అతని సహోదరుండు కలితాత్మ భుజాధిపసద్వసుంధరుం
డతులిత ధర్మసార చరితాది యుగంధరుఁ డిద్ధశౌర్యసం
తత జితనీలకంధరుఁ డుదార ధరాసుర పోషణక్రియా
యతన ధురంధరుం డలరె నప్పుల పాపకరాముఁ డిద్ధరన్.

శా. ఆరాజప్రతిబింబలీల ననమన్యాపారుఁడై శాశ్వత
శ్రీరాజత్కళుఁడై యనేకవిలసత్పృథ్వీశ చూడాంతరో
దారాలంకరణాయమాన నిజపాద ద్యోతమానాంశుఁడై
సారోద్ధారతరాజిలెన్ మహిజనాశ్చర్యంబుఁ గావింపుచున్.

సీ. ఘనతరా నీరవాహినులకు జీవన
ప్రదమయ్యె నెవ్వాని భవ్య శరధి
హీర వజీరు తేజోరాజికి సహాయ
మై యొప్పె నెవ్వాని యాశుగంబు
తతనిజామాభీల చతురంగబలసము
ద్ధారకం బెవ్వాని భూరిశక్తి
ఖానసంగత రణక్రమ సాహసస్థితిఁ
దనరిన దెవ్వాని ధర్మకలన

తే. మామహమ్మదు కుతుబు శాహాశ్వపతికిఁ
బ్రాణధారణ మెవని కృపాణధార
యతని నుతియింపఁదరమె మాధ్యమికలోక
రక్షు నప్పలపాయక రాయఘనుని. 55

ఉ. కుంతిపురాంతికప్రథిత ఘోరమహారణరంగ సీమఁగో
నంతకవైరి తేజుఁడగు నప్పలపాయకరాయశౌరిచే
నంతము నొందియున్ రిపులనంతతమీఁదు మనస్స్థలైమదిన్
సంతసమందిరి తత్ప్రబల శౌర్యము నెన్నుదురద్భుతంబుగన్.

సీ. ధైర్యమందరమెత్తి తగఁహీరవసుం క్రి
యాజృంభణంబు నొయ్యన ఘటించి
నిఖిలభూపాలక నిర్జరస్తోమంబు
లుకువిక్రమస్ఫూర్తి నుత్సహింపఁ

బటుభేరికావీర భటకాహళధ్వనుల్
మథనజనిర్ఘోష మహిమఁ దెలుప
ద్వీపనాయక ముకుందదేవ దుగ్ధపయోధి
మథియించి విజయరమను గ్రహించి

గీ. యవని నవసుధనశ్వరాజాఖ్యుఁ డగుచుఁ
దనరు కుదుపుశాహాసుర త్రాణుసకు నొ
సంగె నేమేటి యతఁడు శశ్వత్ప్రతాప
గేయుఁ డప్పలపాయకరాయమౌళి. 57

చ. అనుపమకీర్తిశాలియగు నప్పలపాయకరావు సోదరుం
డన విలసిల్లు వేంకట ధరాధిపుఁ డుద్ధతయుద్ధసింహాసం
హననుఁడు గాఁడె యెంచఁగటకాంచితగంధ గజాధిరాడ్విమ
ర్దనపరిలబ్ధమౌక్తికకలాపవిభిన్న ఖరాసిధారతన్. 58

గీ. లీల నాధైర్య జలధి గోపాలరాయ
రామభద్రాఖ్య పాయక రాయరాజ
మణులఁగాంచెను భూమిసుకుమార సుతుల
జనకులెంతయుఁ గని వేడుకను వహింప. 59

సీ. ఆరాజతో సాటి యేరాజుకలఁ [illegible]ంచ
సతతంబు కువలయోన్నతి యొనర్ప
నామహాఘనుపోల్కి నేమహాఘనుఁ డయ్యెఁ
దిరమగు సుఖవృత్తి గరిమ నెఱప

నాథరాధిపునితో నేధరాధిపుఁడైన
సుగమహైమాలయ స్ఫురణఁ జెంద
నాయినుప్రతిమాన మేయినుండగుఁ గమ
లామోదకలన నిత్యత ఘటింప

గీ. ననుచు రాజాధిరాజులు వినుతి సేయఁ
దనరె రణరంగభైరవోదగ్రబిరుద
వర్ణఘటితోర్జితవిజయధ్వజ సముద్ధ
రణుఁడు గోపాలపాయకరాయఘనుఁడు. 60

చ. అతని యనుంగుఁ దమ్ముఁడు మహాద్భుతవిక్రమదానకేళి న
ప్రతినిధి రామభద్రఘనపాయకరాయనృపావతంసుఁ డు
న్నతిఁ దగెఁ దారహారసురనాగహిమాగపటీరహీర స
త్కృతిగిరిజేశకాశహరిపారదనారదకీర్తి సాంద్రుఁడై. 61

సీ. పద్మినీపరిణయ ప్రథితసత్కృతిఁ జేసెఁ
బ్రతిభానుభావ సమ్మతముగాఁగ
రతినీలగిరినాథ శతకంబుఁ గావించె
సుప్రసాద మహత్త్వదీప్రముగను
నవలేఖినీలేఖ్య కవితానవద్యత
వెలయించె ననురూపవృత్తి దనర
సతతచాటునిబంధసరసోక్తు లలరించె
సహృదయహృదయైక సరణి మీఱ

గీ. ననుచుఁ గవులు నుతింతు రెవ్వని సతంబు
సంగరాభీలకరజాలశమితవిమత
దవహుతాశుఁడు రామభద్రక్షితీశ
ఘనుఁడు భువన ధురంధరఖ్యాతిఁ దనరె. 62

క. కోనమహీతలనాథుఁ డ
నూన మహాస్తపనతేజు నుగ్రాహవ భీ
మాను కరణుఁ జతురానన
ధీనిధి రామావనీశ ధీరునిఁ గాంచెన్.	63

శా. శ్రీనవ్య స్పృహణీయ దివ్యధరణీ భృద్ధర్మ సంగ్రాహియా
కోనాధీశ్వరు రామభూవిభుని యత్యుగ్రాసి శేషాహియే
నూనంబెట్లన వైరిభూరమణ సందోహాంతరాళస్ఫుర
త్ప్రాణానీకముఁగ్రోలుజాతిహితధర్మంబాటఁబాటించుచున్.

మ. జ్వలనోదగ్రమహుండు రామధరణీసామ్రాజ్యధౌరేయుఁడు
ల్లలితాకారమనోజ్ఞఁ జిట్టెమసతిన్ లక్ష్మీవధూటిన్ ముదం
బలరన్ గైకొనె శౌరి వారినిధి రాజాత్మోద్భవన్ భూమినిం
బలెఁదద్దివ్య చరిత్ర మాత్మ కనురూపప్రేమ దీపింపఁగన్.

గీ. పెద జగన్నాథరాజును బేర్మితోడఁ
జిన జగన్నాథ నృపతిని జిట్టెమాంబ
యుంపు లక్ష్మి వధూటియం దనుపమాన
ధాముఁ గోనేంద్రుఁ గాంచె నా రామవిభుఁడు.	66

గీ. అలరె నారాజమూర్తి త్రయంబునందు
నగ్రగణ్యుండు విబుధ హృద్యప్రశస్త
సర్వకలితుండు భువనరక్షాకరుండు
నవ్య గుణహారి పెదజగన్నాథశౌరి. 67

క. కనఁగఁ జిన జగన్నాథా
వనిప ఘనుండనితరార్థి వరకల్ప తెలమిన్
మునుకొని తను నెపు డర్థిం
చినఁ గంకణవితరణంబు చే నలరించున్. 68

క. శ్రీరామ విభుని కోన
క్ష్మారమణుఁడు తాను లక్ష్మి సఁతతి యగుటన్
సారంగ మహితగుణసుమ
నోరాజిత ధర్ముఁడగుచు నుతిఁగాంచె మహిన్. 69

గీ. పిన జగన్నాథనృపతికిఁ దనయు లగుచు
రమణ రామన రాయ రామ
భద్రపాయకరాయ భూపాలు రలరి
రాత్మ తేజో యశోంత ర్గ్రహి తార్క్యవిధులు. 70

శా. రామన్నాఖ్యనృపాలచంద్రుసుగుణా రామాంతరాసీమదా
నామందక్షితి కల్పకంబు దిశల న్వ్యాపించి భాస్వద్యశ
స్తోమానేకలతాంత వాసనలచే శోభిల్లి భూమీ సుర
గ్రామాభీష్ట ఫలప్రదంబగుచుశ్లాఘుంగాంచుఁజిత్రంబుగన్.

శా. ఆరామక్షితిపాలమౌళి కనుజుం డై రామభద్రప్రభున్
రారాజ ద్విమతేంద్ర జిద్విహరణ ప్రాంచద్భుజావిక్రమో
దారుం జాగర వీక్షణార్చిత సముద్యత్పార్థివ శ్రీను వి
స్ఫారప్రాభవు లక్ష్మణాంకితు నుతింపన్ శక్యమే యేరికిన్.

గీ. రమణ రామనపాయకరాయఘనుఁడు
గాంచెఁ బెద జగన్నాథ భూకాంతు నెలమి
రామ భద్రాఖ్య పాయకరాయమౌళి
పిన జగన్నాథ రాజును బ్రేమఁగనియె. 73

శా. ఆరాజద్వితయంబులోనఁ బెదజ గ్గాధీశ రాజగ్రణి
దారాంభోనిధి రాజునంనుఁ దగ దివ్యత్కీర్తిచంద్రుండు తా
నారూఢిం జననంబుఁ గొందివిబుధ వ్యాహార యోగ్యుండగున్
సారోదంచిత నిత్యపూర్ణ రుచి నాశ్చర్యంబుఁ గావింపుచున్.

గీ. పినజగన్నాధరాజుతో నినుఁడు సాటి
గాఁగ నెట్లోపుఁ దత్కర ఖర కృపాణ
ధారచే భిన్నతనులైన వారిచేత
భిన్నతనుఁడౌట నెద సిగ్గు పెంపువూన. 75

క. కోనాధిపసుత రామధ
రానాయక పెద్ద జగ్గరాజేంద్రుఁడు దా
సూనుల నార్వురఁ గనియెన్
భానుప్రతిమాన భావ భాసుర మహులన్. 76

సీ. లోలశాత్రవ వధూ లోచనాంజన తమ
స్తపనుండు వేంకటక్ష్మావిభుండు
దశ దిగ్వధూటికా ధౌతలసత్కీర్తి
రాజితుం డుద్దండ రామనృపతి
వాణీ విహార భాస్వచ్చతు రాస్యవి
భ్రమశాలి రఘునాధ రాజమౌళి
ధరణీ రమాస్థానశరణ హేమ స్తంభ
బాహుండు లక్ష్మణ పార్థివుండు
గీ. రమ్యగుణహారి గోపాలరాయశౌరి
నవ్యవైభవ నిధి జగన్నాథ ఘనుఁడు
నమరుచుందురు షడ్దర్శనముల కరణి
ధీమదావళి వాచావిధేయులగుచు. 77

క. వేంకటపతిరాజు నిరా
తంకస్ఫురణంబుచేతఁ దనరెను తేజః
కుంకుమచర్చాంకిత ది
క్పంకజవదనోపకంఠ భాగుం డగుచున్. 78

గీ. ధామనిధి యాట నుద్దండ రామశౌరి
యధిక పరవాహినీజీవనాళి సంగ్ర
హించి, తత్పద్మలసదాస్థ నంచితముగ
నాత్మకరలీల నలరించె నసమ మహిమ. 79

మ. మహిమా సంగమహర్షితన్మహి చరన్మత్తారులంద్రుంచి దా
సహజానూన బలాను షక్తిని జనాశ్చర్యంబుఁ గావింపుచున్
విహరించున్ రఘునాథభూమివిభుఁ డుర్వీజన్యలక్ష్మీకర
గ్రహణంబందియయోధ్యసారమునవేడ్కన్ భూమి బాలింపుచున్.

క. అరయఁగ లక్ష్మణభూపతి
ధరణిం బద్మాధివాసతను విలసిల్లెన్
(శిరిమొదగల హరివలె వి)
స్ఫురదురు వీక్షాభిరామ శోభావహుఁడై. 81

క. గోపాలరాయశేఖరుఁ
డాపాల్కడలిని హసించు నాత్మభవయశో
దీపిత చంద్రమహాభ్యుద
యాపాదిత నిత్యకువలయానందకుఁడై. 82

సీ. తన మిత్రభావంబు తగనాత్మ సహవాస
రాజవర్యులకెల్లఁ దేజ మొసఁగఁ
దన రాజభావంబు తతసత్కళోన్నేష
గరిమఁ జక్రానందకరము గాఁగఁ
దన ఘనభావంబు ఁ తగ మరుత్కలనచే
నిశ్చల శ్రీఁబూని నివ్వటిల్లఁ
దనభోగవద్భావ మొసరఁగా నతి హరి
పదవాసమె లీలఁ బరగుచుండ

గీ. నలరె ననురూప సరసవిహారణ శరణ
ధరణి తరుణీ మనోహరోదారతార
హార దుజ్జ్వలకీర్తివిహారుఁ డగుచు
నవ్యగుణహారి శ్రీజగన్నాథశౌరి. 83

క. అనుపమ సుగుణోన్నతి స
ద్వినుతమతిన్ మాంబికయగు తిమ్మాంబిక ను
ద్వినయ సుభద్రయగు సుభ
ద్రను గైకొనె వేంకటపతిరాజు ముదమునన్. 84

క. ఆ తిమ్మాంబికయం ద
బ్జాతశరోపములఁ ద్రితను జాతులను సుభ
ద్రాతరుణియందు నొకసుతు
ఖ్యాతి దనర వేంకటాధిపాగ్రణి గనియెన్. 85

గీ. ధరణిఁ బెదరాజు పెద జగన్నాథరాజు
చినజగన్నాథరాజేంద్రు లనఁగ సరస
వినయుఁడౌ రామచంద్రభూవిభుఁ డనంగ
నలరి రారాజతనయు లాఖ్యాతనయులు. 86

క. భూవర వినుతులసుతులం
భావసుతుల నొగ్రమహుల భాసురతరశో
భావహులఁ గాంచె నిరువుర
శ్రీవెలయఁగఁ బెద్దరాజశేఖరుఁడెలమిన్. 87

క. ఆతనుజులు లావణ్యక
ళాతనుజులు దనరి రధికలక్ష్మియుతులై
సీతారామనృసింహ
క్ష్మాతల పతులనఁగ ధరణి ఖ్యాతి దలిర్పన్. 88

గీ. పెదజగన్నాధరాజున కుదితు లగుచు
గోపభూపతి వేంకటక్ష్మాపమౌళి
రహిఁ జగన్నాధరాజు నారాయణ క్ష
మాధిపుఁ డనంగఁ దనుజాతు లలరి రవని. 89

గీ. పిన జగన్నాధవిభుఁడును గనియెఁ దనయ
పంచకంబును వారాశి పతి సురద్రు
పంచకమునట్లు విబుధ సంభరణ నిపుణ
మగుచు నానందనవ్యాప్తి నతిశయిల్ల. 90

ఉ. వేంకటరామరాజు పర వీరహరుండగు గోపశౌరియున్
బంకజబాంధవోపమ విభానిధి రంగవిభుండు రామభూ
పంకజలోచనాహితుఁడు భవ్యుఁడు రాయనృపాలమౌళియున్
శంకర వక్త్రపంచకము సాటి యనంగఁ దలిర్తు రున్నతిన్.

మ. తరణిఁ జన్యహతారి వీరవసుధాధ్యక్షాళి నిర్భిన్నుఁడై
సరవిఁ వ్యాప్తమహాబిలుండని తిరస్కారంబుగావింపుచున్
ధరణి న్వేంకటరామభూవిభుసముద్యద్విక్రమార్కుండు దా
భరియించుం జగమంతయుఁ బరదురాపస్ఫూర్తిసీరంధ్రతన్.

క. ఆ వేంకటరామనృపతి
భావజలీలాకలాపపరిభావక శో
భావహుఁడగు వేంకటపతి
భూవరుఁగనె నఖిలభువనపూరితకీర్తిన్. 93

ఉ. వేంకటకృష్ణ భూవిభుని వేంకటపత్యధిపార్యు రామభ
ద్రాంకితరాజవర్యు సముదగ్రయశస్కుని భాస్కరేంద్రునిన్
బంకజసూతివేదముల బాగుగఁగాంచిన పోల్కఁగాంచె ని
శ్శంకుఁడురామచంద్రనృపచంద్రుఁడుపుత్రులఁగీర్తిసాంద్రులన్.

ఉ. పంకజబాంధవుండు హిమభానుఁడు భూధరపక్షభేదియున్
శంకరుఁడున్నిజాంశములఁ జక్కగనొక్కటమేళవించి యీ
వేంకటకృష్ణభూవరుని వేడ్కనలర్పఁగఁ గల్గెనా నిరా
తంకపుఁదేజ మాకళల ధన్యతలా సిరులా విభూతియున్.

క. ఆరాజమణిసహోదరుఁ
డారూఢిఁ ధరణిఁ జంద్రుఁడౌ నితఁ డనగా
శ్రీరాజిల వేంకటవిభుఁ
డారయ సర్వజ్ఞమౌళియై విలసిల్లెన్. 96

క. ఆవేంకటపతిభూవిభు
భావంబగు నమృతఘుటిక భావింపఁగఁ ద
త్సేవాపర భూదేవత
లేవేళం దృప్తిగాంతు రెలమి దలిర్పన్. 97

క. వేంకటపతి విభుసోదరుఁ
డంకాగత పార్థివేందిరాంచితమతి ని
శ్శంక ఖరాహితభిద్బల
సంకీర్ణుఁడు రామభద్ర జనపతి యలరున్. 98

క. ధర రామభద్రనృప శే
ఖరచంద్రునికీర్తి చంద్రికాఘురి కుముదా
దరణంబు మాని పద్మో
త్కరములఁ బోషించు నద్భుతంబుగ నెపుడున్. 99

గీ. రామభద్రావనీనాథ రమణు సహజుఁ
డైన భాస్కరవిభుసద్గుణాళు లెల్ల
సొరిది నిశ్శేషముగ నెన్నఁ జోఁ దలంప
శేషునకునైన జిహ్వలు చెదరకున్నె. 100

క. విపరీత వర్తనునితో
నెపుడును నొక మార్గమునఁ జరించెడు నా క
శ్యపసుతుఁడగు భాస్కరుఁ డీ
నృపమణియగు భాస్కర ధరణీపతి కెనయే. 101

గీ. అలరె నుద్దండ రామక్షమాధినాథ
తనయుఁడై రామభద్రాఖ్య ధారుణీంద్రుఁ
డఖిలరాజన్యమకుటరత్నాంశు దీప
రాజినీరాజితాంఘ్రి పీఠాజిరుండు. 102

మ. ఉరుశౌర్యప్రథమాన బాహుబలుఁడై నుద్దండరామావనీ
శ్వరు సూనుండగు రామభద్రవిభు తేజఃకేలి, తానౌర్వమై
ధరవీరాహితవాహినీశ్వరసముద్యజ్జీవనానీకవి
స్ఫురణల్ గ్రోలుచు దావమైయల మెఁడదూభభృద్వరశ్రేణులన్.

సీ. ఆరామభద్రపాయకరాయభూపాల
మౌళి లక్ష్మీదేవి మహితశీల
నంభోధినాథుఁ డబ్ధాపగఁగైకొన్న
కరణి పాణిగ్రహస్ఫురణఁ జెంది
ఘనరామకృష్ణవేంకటరామపాయక
రాయరాజముఖుల రమ్యలీలఁ
గాంచెఁ దత్ప్రథితవిక్రమకీర్తు లరుణాబ్జ
పరిభావకస్ఫూర్తిఁ బరిఢవిల్ల

గీ. నఖిలలోకాంతరాళ తమోపహరణ
శాశ్వత శ్రీకళాపూర్తి సత్కవీంద్ర
తత నుతులఁగాంచె దిగ్వధూదశనవసన
రాగముఖహాసశోభాకరంబులగుచు. 104

ఉ. రఘునాథక్షితినాథపుంగవుఁడు సాంద్రశ్రీకళారాజితా
నఘచారిత్రులఁగాంచె నప్పలనుసీనాథాగ్రణిన్ వేంకటా
ద్రిఘనున్ రామనృపాలచంద్రుని ధరిత్రీనాథకోటీరర
త్నఘృణిభ్రాజితపాదపద్ము బలభద్రక్ష్మాసతీవల్లభున్.

ఉ. అందు ఘనుండు రామజనపాగ్రణి సీతమయందు వేడ్క శే
వందగధీరులన్ గుశలవద్ద్వితనూజులఁగాంచె నుద్యశం
బందుచు మున్ను రామ జనపాగ్రణి సీతమయందు వేడ్క శే
వం దగధీరులఙ్ గుశలవద్వితనూజులఁగన్న చాడ్పునన్.

క. ఆయిరువురలోపల నరి
రాయవధూజన భుజంగురణకలనాకౌం
తేయ తృతీయుని వితరణ
ధీయుత రఘునాథవిభు నుతింపఁగఁ దరమే. 107

క. ఆతని యనుజుఁడు సుగుణ వి
భాతిందగె రామభద్రపాయకరాయం
డాతత నిజకరదీపిత
శాతాసి వినిర్జితారి సముదయుఁ డగుచున్. 108

సీ. ఏరాజమార్తాండు భూరిప్రకాశంబు
సకలచక్రాభి రక్షణకరంబు
ఏరాజచంద్రు సమీహితాభ్యుదయంబు
ద్విజపోషణక్రియా విలసితంబు
ఏరాజదేవేంద్రు సారవైభవలీల
విబుధాళి కామధుగ్విశ్రుతంబు
ఏరాజకందర్పు హారిసౌందర్యంబు
జనమానసైక మోహనకరంబు

గీ. నగుచు విలసిల్లు నతఁడు దివ్యప్రతాప
కీలికీలాను కీలితాభీల సకల
వీరభూపాళి యల రామధారుణీంద్రు
రామభద్రాఖ్య పాయకరాయమౌళి. 109

క. బలభద్ర నృపతిగని యెను
విలసిత బలభద్ర దానవిశ్రుతవిభవో
జ్జ్వలుఁడగు వేంకటధరణీ
తలనాథుని సరసగుణవితాన సనాథున్. 110

మ. నరనాథస్తుతకీర్తిసాంద్రుఁడు జగన్నాథక్షితీశేంద్రుఁ డా
దరమొప్ప న్వరియించె నర్సమవధూత్తంసంబు నుద్యద్గుణో
త్కరసంశోభితఁ జంద్రమాంబను శుభోదగ్రస్థితిన్ మీఱఁ ద
ద్వరచారిత్రములాత్మమోదరస సంధానంబువాటింపఁగన్.

గీ ఆజగన్నాథభూపాలు నగ్రమహిషి
యుభయకులపావనాచార విభవకీర్తి
నోజమెఱయంగ నుతిఁగాంచె నుర్వియందు
నవ్యసద్గుణనికురుంబ నరసమాంబ. 112

సీ. మోహించినంతనె ముదముతోఁ దనజొమ్ముఁ
ద్రొక్కి నిల్చు టదెంత దొడ్డతనము
చేపట్టునాఁడె రా రాపున వరునర్థ
మంగీకరించు టే సంగతంబు

దయచేసినంతనె తనపాటివారిఁ గా
  న నటంచుఁ బతిశిరం బెనయుటెంత
ప్రేమఁ గైకొనినంతఁ బ్రియుని సమ్ముఖమునఁ
  జాలఁబల్కుట దెంత సరసకలన
గీ. మంచు సిరి గౌరి గంగ వాక్పంచలాక్షి
నపహసింపుచుఁ బతికి సౌఖ్యానురాగ
వినయమితభాషణములచే వేడ్కఁ గూర్చు
భవ్యగుణధామ చంద్రమాంబాలలామ. 113

క. అనఘుఁడు జగ్గమహీధవుఁ
డనుపమ సౌభాగ్యగరిమ నానందితుఁడై
తన యగ్రమహిషియందును
దనుభవు నుద్దండరాము ధరణిపుఁ గాంచెన్. 114

సీ. రెండవసతియందు చండాంశుతేజుఁడౌ
  గోపాలరాయక్షమాపమణిని
బల్లాభిరామ భూపాలునిఁ గోదండ
  రామావనీనాథ రఘురాజ
గోపాల భూవిభు గుణనిధి బాలము
  కుందావనీంద్రు నమంద యశుని
బలరామ నరనాథు భవ్యచరిత్రుని
  దశరథరామచంద్రక్షితీశ

గీ. ఘనుని సత్కీర్తి కలనచేఁ గాంచె వార
లష్టదిగ్రాజలీలావిహారులగుచు
నమితసౌజన్యమాన్యవిఖ్యాతిఁగొనుచు
నఖిలరాజన్యమూర్ధన్యు లయిరి ధరణి. 115

క. ఈరాజసుతుల కగ్రజుఁ
డై రాజితకీర్తికలన నభినుతిఁగాఁ చెన్
సారసబాంధవసుతదో
స్సారుం డుద్దండ రామ జనపతి ప్రతిభన్. 116

సీ. ఆరాజమౌళికి నారాజమౌళియే
సాటియౌ విస్తారశౌర్యగరిమ
నావాహినీభర్త కావాహినీభర్త
యే యెన గాంభీర్యహితగుణాప్తి
నాధరాధిపతికి నాధరాధిపతియే
తరమెన్న సమధికస్థైర్యకలన
నామహాఘనునకు నామహాఘనుఁడె సా
ధర్మ్యంబుఁగాంచు నౌదార్యమహిమ

గీ. నచుచు నిఖిలావనీనాథు లభినుతింప
మహిత నిజభుజ మందర మథిత విమత
కుల కలశవార్ధి లక్ష్మిఁ జేకొనియె నతఁడు
రమణ నుద్దండపాయక రామశౌరి. 117

క. ఆరాజమణికి ననుజుం
డై రాజిలె దశదిశాచ్ఛహారాయిత శో
భారమణీయయశోవి
స్తారుఁడు గోపాలరాయ ధరణిపుఁ డవనిన్. 118

సీ. లోకబాంధవకుల శ్రీకర కాకర్ల
పూడి వంశాబ్ధి సంపూర్ణవిధుఁడు
శ్రీ జగన్నాధ ధాత్రీపాల మూర్ధన్య
పుంజీకృతానేక పుణ్యఫలము
చంద్రమాంబాగర్భ సద్రత్నఖని భవ
ప్రాంచ దిష్టార్థ దానార్ఘ్యరత్న
మవలి ప్తనిఖిల శాత్రవరాజ కాహార్య
షండ విఖండ నాఖండలుండు

గీ. మిత్రబాంధవ కవిజనామేయభాగ
ధేయమై యొప్పె భువన దీపాయమాన
దివ్యతేజుండు నృపగేయ ధీయుతుండు
రమ్యగుణహారి గోపాలరాయశౌరి. 119

గీ. తెలివి గోపాలరాయ పృథ్వీకళత్ర
సహజుఁడై యొప్పె దాన దీక్షావిధాన
లోకపూజ్యుండు సుగుణరత్నాకరుండు
ప్రభువతంసుండు పట్టాభిరామవిభుఁడు. 120

క. అతని సహోదరుఁడు గుణో
న్నతుఁడగు కోదండరామనరపతి తేజః
ప్రతిబింబాయిత జలరుహ
పతిమండలదీప్తియగుచుఁ బ్రతిభఁ దలిర్చెన్. 121

క. కోదండరామనరపతి
సోదరు నుతియింపఁ దరమె సురకరి దరకా
కోదరవిభునిభకీర్తి వి
భాదీప్తుని రాజగోపపార్థివచంద్రున్. 122

క. ఆవిభుమణికి సహా వి
ర్భావ్యుం డభినుతులుగాంచె బాలముకుంద
క్ష్మావరుఁ డతులభుజాసం
భావితనిరవద్యభూమి భామామణియై. 123

మ. ప్రతిపక్షక్షితిపాహి సంహతి సుపర్ణద్దివ్య తేజోమహో
ద్ధతుఁడౌ బాలముకుందభూవరుఁ డనంతశ్రీకలాపోర్జితుం
డతులాహీనగుణస్ఫురద్విబుధవాసానూనధర్మప్రథో
న్నతుఁ డౌటంధరరాజశేఖరుఁడగుఁ భవ్యప్రభావంబునన్.

సీ. ఆంధ్రపురంధ్రీకుచాగ్రముక్తాహార
తళతళచ్ఛాయతో దళముఁగాంచి
చోళాంగనాలసచ్చూచాళావిచకిలాళి
చకచక ద్యుతులతో చౌకళించి

లాటవధూటీలలాటహీరకలాప
ధగధగప్రభలతోఁ బ్రస్తరించి
పాంచాలభామినీభాసురదరహాస
నిగనిగచ్ఛవితోడ నివ్వటించి

గీ. భాతిఁ గనుపట్టె దశదిశాభ్యంతరముల
నే విభునికీర్తి యతఁ డసద్యావనబల
గహనదహనాయమానవిఖ్యాతమహుఁడు
గుణమహోన్నతి బాలముకుంద నృపతి. 125

గీ. గుణగరిష్ఠుండు బాలముకుందశౌరి
కనుజుఁడై యొప్పె బలరామజనవిభుండు
సారతరనైజకీర్తి కర్పూరరజము
సకలదిగ్భాములమీఁదఁ జల్లుకొనుచు. 126

సీ. ప్రతిఘాత హతవైరి భటులతోడనె దివిఁ
దనరె నెవ్వని బలోద్ధతరజంబు
లతిభీత రిపురాజతతితోనె గిరిగుహల్
దూరె నెవ్వని జయభేరి రవము
వీరారిరక్తధారలతోడనె
ఫురియించు నెవ్వాని కరకృపాణి
దుస్తరాహితరాజమస్తకంబులతోనె
ధరఁ జెందె నెవ్వాని శరచయంబు

గీ. అతఁడు నుతియింపఁదగు సమరతల సవ్య
సాచి పరవీరభూపాల చటులసైన్య
యామునాశయ భేదనోద్దామకోప
రాజితాటోపుఁ డగు బలరామవిభుఁడు. 127

గీ. ప్రబలతరశౌర్యకీర్తి శుంభద్వివేక
విలసనుండగు బలరామవిభుని యనుజుఁ
డలరె దశరథరామచంద్రావనీంద్రుఁ
డఖిల వసుధాధివాస బాహార్గళుండు. 128

చ. దశరథరామచంద్ర వసుధావరు నాజి నెదుర్చు శాత్రవుల్
విశకలితంబులౌ తనులు వెల్వడి యుల్లసదప్సరోరతిన్
వశత భజించు టెంత యని వారితభీతిని జీవితాత్ములై
వశత భజింతు రెప్పుడును వారక యుల్లసదప్సరోరతిన్.

క. ఆ సహజులు ఘనశౌర్యక
ళాసహజులు వేడ్కఁ గొల్వ లక్ష్మీరమణ
శ్రీ సరసకటాక్షంబుల
భాసిలు గోపాలరాయపార్థివుఁ డెలమిన్. 130

పదమాశూన్యముచూపు వేఁడిగుణముల్ భాసింపమాయావశం
వదముల్ రూపమయోగ్యదృశ్యమని భూపార్థీంద్రకన్యల్ హరిన్
మదిలో రోసివరించి రున్నతపదున్ సౌమ్యేక్షణున్ సత్యర
తు దశత్కంజదళేక్షణాముదను నాగోపాలరాయప్రభున్.

ఉ. కాకరపూడి జగ్గమహికాంతుని గోపనృపాలుఁ డుగ్రతఁ
జేకొని రుస్తుమాత్మజ వజీరబలంబులఁ ద్రుంప శోణితో
ద్రేక నదీ రయాగత తదీయ విభూషణరత్నరాజి ర
త్నాకరనామ మింపలరె నాహవరంగ సమీపవార్ధికిన్. 132

ఉ. వైరస్ఫూర్తి మనంబునం గెరల దుర్వారోగ్ర రుస్తుంబహా
దూరాత్మోద్భవుఁడైన కాలయవనుం దోర్విక్రమశ్లాఘిచే
బోర న్వెండియు సంహరించి నలసద్భూరిప్రభావాఢ్యు న
క్రూరక్షేమకరున్ నుతింపఁ దరమే గోపాలభూనాయకున్.

సీ. యవనాశ్వ నొకని మాయాశ్లాఘిఁ బోకార్చె
యవనాశ్వవరసమూహములఁ దునిమె
నవిభిన్న నరకసంహారణంబుఁ గావించె
వివిధాహితనరకసంవితతి ద్రుంచె
సరవి నేకోద్ధవాశ్రయుఁడై విరాజిల్లె
సతత నైకోద్ధవాశ్రయత మెఱసెఁ
బ్రజలెన్నఁగా నేకబలయోగమున హెచ్చె
బహుబలావాప్తిచేఁ బరిఢవిల్లె

గీ. నౌర నానాటి కవతారతారతమ్య
మనుచు నిఖిలావనీనాథు లభినుతింప
నభినవస్ఫూర్తి నాది దేవాంశభవుఁడు
రమణఁ దళుకొత్తె గోపాలరాయవిభుఁడు. 134

సీ. మారుతాశనవృత్తి మసలకజీవించు
భోగిపుంగవుఁ డిచ్చు భోగమెంత
మోముఁ జూపక వనంబున నీఁగియుండెడు
కూర్మనాథుఁ డలర్చు కూర్మియెంత
సతత దారకవృత్తి సాగించి బ్రతుకు సూ
కరపతిసేయు సౌకర్యమెంత
అనిశంబు మలినత నాశలఁ జరియించు
దాని సంఘ మొసంగు దానమెంత

గీ. యనుచు వారల మదిరోసి యవనికాంత
చెందె సరసోపభోగరాజితముఖప్ర
సారసామ్రాజ్యలక్ష్మీవిహారకారి
రాజదేవేంద్రుఁ గోపాలరాయచంద్రు. 135

గీ. వెలయు నారాజవిభుదేవి వేంకమాంబ
పావనాత్మీయచరిత్రప్రభావగరిమ
వర్ణనము సత్కవీంద్ర సువర్ణరాశి
కలితరామోదకలనల నావహింప. 136

సీ. ఏ సాధ్వీచారిత్ర మాసేతు శీతాద్రి
భాసుర భూసురోల్లాసకరము
ఏరామసత్కీర్తి తారకాహారమం
దార కైరవహితోదారకాంతి

ఏ పుణ్యసతిబుద్ధి గోపాల భూపాను
రూపాంతరంగ ప్రదీపశోభ
ఏ రాజముఖమూర్తి భారతీ మారతీ
చారుతాసర్వస్వసముదయంబు

గీ. లీలఁ దగునట్టి భాగ్యవతీలలామ
సరస భూపతిరాజు వంశ ప్రసిద్ధ
గోపరాట్కన్య సుచరిత్ర కులపవిత్ర
భవ్యగుణపేటి వేంకమాంబావధూటి. 137

గీ. పరమపావన వరహితాచరణయైన
వేంకమాంబికయందు సద్విమలచరిత
భరితులైనట్టి సుతుల గోపాలరాయ
విభుఁడు గాంచెను వంశాభివృద్ధి వెలయ. 138

క. ఆ రాజసుతులలో నరి
వీరాంతకతేజులగుచు వేంకటకృష్ణో
దారతరరామభద్ర
ప్స్మారమణోద్దండరాయ మహితఖ్యాతిన్. 139

గీ. వెలయు గోపాలరాయపృథ్వీకళత్ర
తనయుఁడైనట్టి రామభద్రక్షమాధి
నాథచంద్రుఁడు నిఖిల భూనాయకావ
తంసితాత్మీయచరణ పద్మద్వయుండు. 140

మ. అతఁడింపొందును రామభద్రవిభుఁడా శాంతావధిక్ష్మాతల
ప్రతిరాజన్యకిరీటకోటివిలసద్రత్నాంశుదీపావళీ
కృతనీరాజనపాదపద్ముఁడయి లక్ష్మీనాథకారుణ్యవ
ర్ధితసాంతత్యశుభావహద్విభవసద్ధీచీరుఁడై ధారుణిన్.

క. ఏతాదృశ సుతకలిత
శ్రీతత నిజవంశవృద్ధి సీతారమణ
ఖ్యాతికి జోడగు కీర్తి వి
భాతిన్ గోపాలరాయపార్థివుఁ డలరున్. 142

క. ఏవంవిధ సుగుణమణి
శ్రీవిలసితభావునకు వశీకృత సుమనో
గ్రావాధిదేవునకును ధ
రావరమకుటస్పృగంఘ్రి రాజీవునకున్. 143

క. వ్యాహృత వాగ్విసరునకు స
మాహృతపరవాహినీశ్వరాపోశన విం
ధ్యాహార్య గురున కప్ర
త్యాహార్యాజ్ఞాభృదఖిలధరణిపరునకున్. 144

క. స్వ ర్ధరణీ మధ్యాసం
త ర్ధరణోద్ధతబలోద్ధధావద్ధూళీ
దుర్ధర లోకచ్యుతిభయ
నిర్ధైర్యామర వరాను నీతాదృతికిన్. 145

క. అనవరతో పాయనదా
వనిపకులానీత గంధవారణ దానా
ఘనిరంతరసంగత వా
సన నైజాస్థాన భవన చత్వరమహికిన్. 146

క. ఆసుకవి పాళికాశ్యఫ
లాశయ సహకార బాంధవాయతమతికిన్
ధీశతధృతికిన్ దపనహు
తాశన విస్మయర మహామహస్సంహతికిన్. 147

క. వసబిరుదర గండాంకున
కసదృశరణరంగభైరవాయత బిరుద
ప్రసరోద్దండునకును దా
మస రిపు తిమిరాపహరణ మార్తాండునకున్. 148

క. ధామనిధి వంశరాజ
గ్రామణికిన్ సకలసుజన రక్షామణికిన్
క్షేమ నిరూఢావని రో
హామణికిని రూపవిజితస్త్రామణికిన్. 149

క. స్ఫురదురుకరవాలవిజ
ర్ఘరితాహితమండలునకు జయగోపాలాం
కరణమహాభేరీ భాం
కరణవినిర్భిన్న జలజగర్భాండునకున్. 150

క. సురుచిర వసిష్ఠగోత్రా
భరణిత కాకర్ల పూడి భవ్యాన్వయ సా
గర వరహిమ ఘృణికిఁ సువి
తరణికి గోపాలరాయ ధరణిప మణికిన్. 151

వ. అభ్యుదయపరంపరాభివృద్ధికరంబుగ నఖిలవిద్వత్కవిజనా
కల్పంబుగాఁ గల్పనీయంబగు మదీయ రుక్మవతీపరిణయాభి
ధాన మహాప్రబంధంబునకుం గథానుసంధానం బెట్టిదనిన.

చ. శుభతరనైమిశాఖ్య వనశోభిత శౌనకముఖ్య సన్ముని
ప్రభులకు సూతుఁ డింపలరఁ బ్రాజ్ఞతఁ జెల్పినరీతి మాధవా
త్మభవకథాసుధారసపు మాధురి శ్రీశుకమౌని మౌళియుఁ
విభుమణియౌ పరీక్షిదవనీతలనేతకుఁ జెల్పినట్లుగన్. 153

సీ. కనకగోపురఘనాకారకల్పితపయో
జాత బాంధవకాంతి హేతువునను
బలవైరిమణిహర్మ్యబంధురచ్ఛవితిర స్కృ
తాంధకార స్ఫురద్వ్యాప్యమునను
పద్మరాగగ్రావ బద్ధసౌధప్రభా
కలితసంధ్యారాగకరణమునను
సకలగృహారామ సంతతభాసుర
సుమపల్లవఫలాళి గమకమునను

గీ. శశ్వదనుమేయ యుగపత్ప్రసక్తి యలర
దినతమీసంధ్య లఖిలర్తులును జెలంగి
యెలమి గొలువంగ నిత్యసమేత నవ ని
ధానమై పొల్చు ద్వారకాఖ్యాననగరి. 154

మ. అలదైత్యేంద్రుఁడు వేఁడఁ దద్ధితము సేయంగోరి వృత్రారితోఁ
గలహింపంజని మిన్నుముట్టిన భుజంగస్వామి యుద్యత్ఫణా
వళి గోసాలశిఖాళి నెంచి బలిమి న్వారాశిమధ్యస్థుఁడై
యలరం గౌఁగిట నానియుండెనన ఖేయంబొప్పు నవ్వీటికిన్.

చ. జలదము తత్పురీకనకసౌధసతీ తను విచ్చఁ జూచి చం
చలలని యేఁగ వారలు కచంబులతోఁ గలహించునంచు మే
డలఁ బడవైవఁ గేకులకటా యని ఱెక్కలగాలి సూర్పఁగాఁ
దొలఁగెనొ నాఁగనయ్యగురుధూపము వెల్వడు జాలకంబులన్.

సీ. తులలేని సీలంపుఁ బలక తొల్పరువులు
జలధరమండలచ్ఛాయలీన
నామీఁది కెంపురాయందంపు టంతరం
బులు భానుమండలకలనఁ దోఁపఁ
దదనంతరేందు కాంతగ్రావకూటముల్
చంద్రమండలదీప్తి సంఘటింప
వజ్రకోరకజాలవలితాంతభూమికల్
నక్షత్రమండలి నలువుఁ జెంద

గీ. సరవి లోకావృతోన్నత స్ఫురణఁ దనరి
యఖిలసుమనోధివాసంబు లగుచు మెత్తయు
చొక్కటొక్కటి హేమాద్రి ధిక్కరింపఁ
జాలి యలరారు మేడ లాప్రోలియందు. 157

గీ. చెప్పనేటికి నప్పురిచేడియలను
రెప్పవేయక వారల యొప్పరేయుఁ
బగలు నీక్షించి కాదె యిప్పటికి నైన
ననిమిషత్వంబు విడువ రయ్యమరవరులు. 158

ఉ. అప్పురిలీలసౌధములయందు నృపాత్మజు లొక్కరొక్కరిం
దప్పుమటంచు నొడ్డుచును దాఁటఁగ నొక్కనిచే కటారి యా
యుప్పరవీధినున్న శశి నుక్కునఁ దాఁకెనొ కాకయున్నఁ జె
న్నొప్పెడి మేన మచ్చయొకటూనఁగ నేటికిఁ గల్గెనేనికిన్ ?

మ. ప్రతిగాఁ దత్పురిమేదినీసురులతోఁ బాటింపఁగా సత్కళా
న్వితు లీరేడుజగంబులం గలరె ! భావింప న్నిజాకర్ణక
శ్రుతులం బద్మజవాసవాది దివిజస్తోమంబు వేవచ్చి స
మ్మతిగాఁ దత్సవనావనిం బ్రకటసామస్ఫూర్తులం జొక్కఁగన్.

సీ. ఇతఁ డిరుంజనరాదు సతతంబుఁ దనతేజ
మరిసమూహంబుల నణఁపలేదు
అనరాదు రా జితెంజనుచును విలసి న
క్షత్రప్రకాశంబు సలుపఁడెపుడు

ఘనుఁ డీతఁ డనదగం డనిశంబు నప్పులు
గాక జీవనములు గడప లేఁడు
సర్వజ్ఞుఁడితఁడు గా దుర్వి నెల్లప్పుడు
సమదృష్టి నార్యరూపములు గానఁ

గీ. డనుచుఁ బుష్పవద్విషధరులను హసించి
యినులగుచు రాజులగుచును ఘనులునగుచు
విమల సర్వజ్ఞులగుచు సారమతిధరులు
౨ నగుదు రప్పీట నున్న యాభరణివరులు. 161

చ. రసవిషముల్ గొనంగ నెధర౯ ఘనుఁడీశ్వరుఁడంచు నెంతురే
వెసనొకఁ డప్పులిచ్చి యపవృద్ధి లఘుండగుమాఱు బేరము౯
బసచెడఁజేసి భిక్షుకతఁ బొల్పడు నొక్కఁ డటంచు నవ్వి త
ద్వసదురువైశ్యరత్నములు తద్దయు నైరిఘనుల్ మహేశులున్.

మ. హరిపాదాబ్జఫలాత్ములై ధరణిగర్భావిర్భవద్దివ్యధా
న్యరమానాయకులై కృతిప్రముఖసంతానాఢ్యులై నిర్జర
స్ఫురదుద్యద్బలశాలి దేహకనకక్షోణీధరాకారులై
పురిఁ జాతుర్థికజాతులుందురు మహాభోగాను భావోన్నతిన్.

మ. కరులప్పీట విహారశైలములపై గర్జావితర్జచ్ఛరో
త్కరరాజద్బలవైరివాహ విలసత్సందోహ మీక్షించి, భీం
కరణోద్యద్రణబుద్ధి దారుణనిరాఘాటార్భటిందాఁక, ఁద
ద్విరతాఘాతలకోటి నీరదములై వెల్వెల్లనా మేఘముల్.

చ. పురి తురగాతివేగగతిఁ బూనెదనంచుఁ బ్రభంజనుండు, రా
నునువడినేగి యడ్డపడినోంది ప్రకంపనుఁడై (తొలంగి) య
త్కరివరబృందసాంద్రమదధారలతో సమవృష్టి పూనుచున్
సరియగు నమ్మహోఘుచని సంతతముం గలహించు నోర్వకన్.

శా. స్వర్ణజ్యాధరకార్ముకాశ్రయములై వాహిన్యధీశాహితో
దీర్ణానంతశరానుషంగశరధిస్థిత్యంతరాళంబులై
వర్ణానేక పదక్రమాగమలసద్వాహంబులై తత్పురి
స్వర్ణింపన్ రథములు ల్పురారిరథభావంబొప్పఁగా భాసిలున్.

చ. అదయతనందు వీరభటులంతకునైనను, నల్లబుత్తురా
మదనవిరోధినైన, నరుమాఱుగఁ జూతురు కీలినైన మి
న్నొదవిన రాజునైన,మఱియున్ గ్రహరాజునునైన,నబ్ధిముం
పురురు తదీయధామచయముం గనలేక తిరస్కరింపుచున్.

సీ. రంగనృత్యద్వార రమణీ తనుద్యుతుల్
తొల్కారు మెఱుఁగుల తులను మీఱ
మురజాదివాద్య సముద్ధిత ధ్వానంబు
లబ్ధి నిస్స్వనముల నావహింప
మణిజాల మహిత భూషణ కాంతి సురరాజ
కోదండఖండమై కొమరుమిగుల
గాయకోద్గళిత వాగ్జాలవిశేషంబు
వర్ష ధ్వనులరీతి వరలుచుండ

గీ. లలిత శృంగార రసవృష్టిఫలితరసిక
విటమనోరథ సస్యాభివృద్ధి యగుచు
ఘనగుణస్ఫూర్తి వెలయింపఁగలిగె మెఱయు
విధి చమత్కృతి నవ్వేటి వేశ్యవాటి.

సీ. అరవిందలోచన కనురాగమొకటి యా
యనురాగకలన నీయందెకలదు
కలికిముగ్ధలగుమ్మ కళ్యాణిఁ బాడుమా
కళ్యాణి నీ విలోకంబె కాదె
నాతిరో సొగసు కన్నడఁబాడినను నీవె
కన్నడసేతునన్ గాక సతుల
బాలప్రాణ సమేతతాళవల్లకి మీటు
మరయ నాప్రాణంబవగుదు వీవె

గీ. యనుచు విటులాస నిటులు మాటాడుకొనుచు
సరససంగీతములఁబాడి సకలబంధ
రతులఁగూడి నగరిఁ బొల్తురతుల మతులఁ
జారు సౌందర్యవసతులు వారసతులు.

సీ. అలరు మల్లికలదండలుగూర్చు మాటొక
నటులైన మాపు రమ్మనుముఁ గలవు
ఒనరసమ్మాను పుష్పయోగమందునో కొమ్మ
విటవ కాలోచిత వృత్తిలేదె

సుమకదంబవిలాసమమరంగఁ గూర్తువె
యరయ జాతులపేరు లెఱిఁగి జాణ
సకియపల్లవ సంతతికి మఱుఁగేటికె
168 యిది కందుఁ బగలింటి యినుఁడుచూడ

గీ. యనుచు ననురాగయుక్తులు మొరయుచుండ
నతితరామోదసుమచయంబు లమ్ముకొనుచు
ననుపుకాండ్రఁ గలంతు రత్యనుపమాన
చాతురిని బుష్పలావికాజాతు లచట. 170

సీ. చెలియ లకుచముల విలువెంతయని పల్క
నవి నీకుఁ గొనఁగోటి కలవిగావు
యాలపంకిది కాయ జాలంబమందమా
నీడెపం డమృవుగా దిచ్చగింపు
సకితెల్పుమాను సహకారమదియేకఁ
బలుమఱుఁ బేరంపు కలువపెద్ద
అతివరో నీచాతె రంటిపంటి కొలంచి
169 . నొక్కమా టెఱిఁగింపు మెక్కడనగు

గీ. యనుచు రసగర్భయుక్తుల నెనసి తనివి
మనసిజాయత్తచిత్తసమ్మత్తులైన
విటుల కిటుల హాస్యోక్తులు పటిమఁజెలఁగు
సరస ఫలదాంగనల కూర్మి జరగు నీట. 171

మ. అలిసీ నాదము తానమై వనవిహంగాళీచలత్పక్షసం
కులరావంబు మృదంగఘోషగతియై, కూజన్మరాళీరుతం
బులు తాళక్రియలై చెలంగఁ,బిక లేబూఁదోటలన్ శాలిగో
పులగానంబలరన్ రసార్ద్రసుమనంబుల్ దాల్చుభూజావళుల్.

సీ. వరరూప పున్నాగ వారకాంతాళులు
వితత పల్లవరాగ విలసనములు
సత్పుష్పవత్ప్రాంత సాలోన్నతాగ్రంబు
లఖిల ద్విజౌఘ విహారకలన
రాజిత కనక విభ్రాజిత వీథులు
లత కూనల కళావిలాసపటిమ
మధురసపర్యాప్త మానవ కులములు
సరసుల సుమహిత సారసరణి

గీ. వీరతరుల ప్రకాశంబు మీఱుచుండ
తత్పురస్థల సద్రీతిఁ దనరి యచట
నందనమురీతి సుమనోభినందనంబు
బాలపల్లవమంజులోపవన మలరు. 173

క. ఏతాదృశ సుగుణగణ
స్ఫీతా నితరానుభోగ్య చిరసౌభాగ్య
శ్రీతత్తాదృశమహిమా
న్వితంబగు పురవరమున కీశ్వరుఁ డగుచున్. 174

సీ. తనచిత్రమణిహార తతికాంతివిసరంబు
శక్రచాపస్ఫూర్తి సంభ్రమింపఁ
దన యురస్సద్మ పద్మాసతి మైదీఁగ
సొబగు లైరావతీ స్ఫురణగాఁగఁ
దన సుధామధుర సాదరవచోగంభీర
సరసగుంభనము గర్జనముగాఁగఁ
దన యనుగ్రహ వశోత్కటకటాక్షావృష్ట
వరకృపారసము జీవనముగాఁగ

గీ. నలరు సుజనాంతరంగ సదాలవాల
సార రూఢంబులై నట్టి కోరికలను
లతల నీడేర్చి ఫలసమున్నతులుగూర్చి
రమణఁ జెన్నొందె హరిఘన ప్రాభవమున. 175

మ. శ్రుతిసీమంతవతంసితాద్భుతచరిత్రుండై జగద్వ్యాప్తుఁడై
సతతానందచిదాత్ముఁడై వెలయు నేసన్మాత్రుఁడే ధన్యుఁడ
త్యతులానంతవిలాసమూర్తి ధృతిచేతన్ భూమికాధారమా
నతఁ డొప్పెం దశరూపకాద్భుతసముద్యద్భూమికాధారతన్.

క. ఆపుణ్యు నగ్రమహిషి ప
రా పరవిజ్ఞానముద్రయన భాసిల్లెన్
దీపకళాంతరదీపిత
దీపముక్రియఁ బతి నిజాత్మఁ దేజరిలంగన్. 177

సీ. ఏ నిరంజను దా నధీనుఁ జేసుకొ సత్త్వ
ముఖగుణవృత్తుల మోహపెట్టె
నే శాంతునరియించి నాత్మాగ్రజా
హంకార సహితుఁడౌ నట్లు చేసె
నే వీతరాగుతోఁ దా వినోదించుచు
యోగీశ సుమనోనురాగుఁ జేసె
నే యాత్మ నాత్మోపహితుఁ జేసి ముగ్ధతఁ
దనజీవుఁ డతఁడై తనరఁ జేసె
గీ. నతని ననపాయవృత్తిచే ననుసరించి
వివిధరూపానుగుణరూప భవనశక్తి
నమితకాంతానురక్తిచే నతిశయించెఁ
జారుకళ్యాణి రుక్మిణీ కీరవాణి. 178

ఉ. ఆరమణీయుదారమణిమంచ ముదారమణిప్రఘాణ వ
ద్ద్వార శిరోగృహాంతరభవంతుల నెంతయుఁ జక్రపాణి క్రీ
డారసలోల మానసతడావలి జాతిలతోపగూహ మం
దార లతాంతసారముల తావులతేవలు నించుతావులన్.

చ. ఎలమి విదర్భరాజ సుతనిశల నీడల మల్లికాలతా
వలితమనోజ్ఞఁ డింతుల నవారితవారి కనత్సరోంతరా
విలసి మరుత్కిశోరములు వీవఁగ వీవ నవోత్సవంబులన్
గలసిమెలంగ శౌరి రతికందళకందళితాంతరంగుఁడై. 180

మత్తేభము.

నిరోష్ఠ్యము ఘనసాహిత్యనిదానదానజితలేఖజ్యాజకంజేనసం
దనధారాధర రాజరాజదహిరాట్తారేశ నీహార హా
రనికాయాయతకీర్తికీర్తిత జగత్త్రాణాఖిలాంచద్రసా
యనచారిత్ర రసజ్ఞ సజ్జ్ఞజన నిత్యశ్రీహితాస్థానకా. 181

క. సురుమాయి బిరుద రాహు
స్ఫురణ మలీమసిత విమత భూవర తేజః
ఖరకరమండల ప్రతిభా
పరిశోభిత నిత్యసహజపాండిత్యనిధీ. 182

క. రుస్తుమఖానతనూభవ
మస్తకబలిపూర్వకాత్త మహితఘన శ్రీ
నిస్తుల సువిదితనిధిసు ని
రస్తైకాంతనిధి రాజరాజైశ్వర్యా! 183

మాలిని.

విభవజితసురేంద్రా విశ్రుతౌదార్యసాంద్రా
కభవ భవసుమేధా కావ్యతత్త్వప్రబోధా
ప్రభుమణి పరివంద్యా పండితౌఘాభినంద్యా
శుభచరితకలాపా సూర్యవంశప్రదీపా. 184

## గద్య.

ఇది శ్రీలకవరసుమనోగిరిధామ రామచంద్రచరణార
విందమరందాస్వాదన సమాసాదిత నిరవద్య
సాహితీరసవిభావిత కవితాతిరేక రేకపల్లి
సూర్యనారాయణ తనూభవ సకలవిద్వ
త్కవిజనానుగ్రహ సనాథ సోమ
నాథ ప్రణీతంబయిన రుక్మవతీ
పరిణయాభిధాన మహా
ప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# రుక్మవతీపరిణయము.

## ద్వితీయాశ్వాసము.


భావుక బాహా పరి
శోభిత వసుధోపభోగ సుఖలాలన లీ
లాభినవభావభవ ! సు
ప్రాభవ గోపాలరాయ పార్థివగేయా. 1

వ. అవధరింపుము ప్రద్యుమ్నాభ్యుదయకథాసుధారసప్రసూత మాధుర్యానుస్యూతచేతుండగు సూతుండు శౌనకాద్యఖిల మునివరుల కెఱింగించిన తెఱంగున నప్పాండవకుల మండనుండగు పరీక్షిన్మహీమండలాఖండలునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 2

గీ. అంత నయ్యాదిపురుషు నిజాంశమైన
యాత్మభవ తేజ మిల నభివ్యక్తమగుచు
భువన మోహైక లీలావిభూతి మెఱయ
రుక్మిణీకాంత గర్భసంరూఢి నలరె. 3

గీ. తమ్మి మోమువాఁడె తళుకగు నెలరాతి
పలక చెక్కులంత పలచఁబారె
రుచుల తీవె కోర్కె రూఢులు కొనసాగె
శ్యామ కొక్కవెల మసలఁగ నపుడు. 4

క. కనుఁగవ విప్పలలారెను
జనుఁగవ కోక వింతకీవి సంధిలె మోమున్
నును తేట మీఱెఁ జెక్కులు
మనసిజముకురాభిరమ్య మహిమ వహించెన్. 5

క. ఆచనుఁ గవకుఁ బయోధర శ్లేష
వాచకతాయోగ మలర వ్యాప్తంబగు త
త్సూచక చూచుకమేచక
మాచకిత కురంగనయన కందము మీఱెన్. 6

క. కనకప్రభ గలిగిన సతి
తను వంతటఁ దెల్లమీఱుఁ దన్మధ్యమునన్
దనకునికి పొసఁగదని వెడ
లెననన్ రుక్మిణి నడుమున లేమి జనించెన్. 7

శా. స్వర్భూనాగనివాసలోకసకల ద్వంద్వాంతరంగస్థలా
విర్భావప్రథితుండు నిండుకొని యవ్వేళ న్విజృంభింప వై
దర్భిగర్భము దోఁచె దివ్యమణి సందర్భాంతరాళస్ఫుర
న్నిర్భావ్యద్యుతి కాంచనాంచిత కరండీ సామ్యసంశోభియై.

ఉ. ప్రొద్దులు నిండినంత పరిపూర్ణ శుభావహభావ భాగ్యభా
స్వద్దినినాథ పూర్వక నవగ్రహమాలిక తేజ మందగా
నద్దివిజాళికల్పక లతాంత నిరంతర వృష్టి నింప న
మ్ముద్దియ బాలుఁగాంచె, నవమోహనరూపకళావిశాలునిన్.

చ. అలజడినొంది వాఁడె కుముదాళులు సద్ద్విజరాజసూక్తి వి
చ్చలవిడి నల్లసిల్లె దిగజారెఁ దమంబు జగంబునందు శ్రీ
గలిగెను నీరజస్థితికిఁ గాంతి పరంపర మీఱె, రుక్మిణీ
బలరిపు దిక్ప్రసూతనవపంచశరార్కమహోదయంబునన్.

వ. తత్సమయంబున నాస్థాన సత్వరాగచ్ఛన్నానారాజన్య గణ మణిమయమకుట కటక కేయూరాది భూషణ పరస్పర సంఘటనోత్కటాత్కార సముద్భట కరటి ఘంటాఘంటికా క్రేంకారంబులు, నఖిలదిక్తట నిర్దళన పటుపటహ మర్దళ ప్రముఖ వాద్యధ్వని సమ్మిళిత ద్భాంభాంకారంబులును, దత్ప్రతిశబ్దఘుళిత నారాయణ హితఃహిత దేవదుందుభిధ్వానంబు లనూనంబుగా భూనభోంతరాళంబునన్ భోరుకలిగి మ్రోయుచుండ, నంభోజదళాక్షుండు పుత్త్రోత్సవానందం బంతరంగంబునం దరంగితంబై యుప్పొంగఁ, గ, వందిమాగధ విద్వద్బృందంబులతో నమంద చాతురిసందడిం జెందియుండ నంకులం గొంద అవసర స్ఫురిత దైవజ్ఞ తానుగుణ భాషణంబుల శ్రుతి తోషణంబులు గావింపందలంచి, 11

సీ. ధర్మభావముచూడఁ దగియుండె నప్పుడు స
ర్వోన్నతి సుమనః ప్రసన్నమగుచు
తనుభావ మజరాగ దతను జగన్మోహ
నాకారమహిమ విఖ్యాతిఁ దనరె.

స్మరభావమీక్షింప మహిత సత్త్వమీఱఁ
ప్రతిభా విరతి మనోరంజనంబు
విక్రమ భావంబు విపుల లీలార్జితా
నేకలోకాళి జయాకరంబు

గీ. ఇట్లు భావంబులన్నియు నెంచిచూడ
భాతిఁ గనుపట్టు లలిత శుభగ్రహంబు
లగుచుఁ గాకున్న నాదినారాయణాంశ
భవత దీపించు ఘనతరభాగ్యమెట్లు ? 12

క. అనవిని సంతోషంబున
గన దంబరదివ్యరత్నకాంచనముఖవ
స్తునికరములు గురియింపుచుఁ
దనిపెను హరి నిఖిల విప్రధన్యుల నెలమిన్. 13

మత్తకోకిల.

అంత నంతిపురంబునందున నంతవాక్పటు చాతురిన్
సంతసించిరి పొంతఁ జేరి నిశాంతమధ్యగ రుక్మిణిన్
గాంత కంటివె ? యింతచక్కని కంతువంటి కుమారు ని
న్నెంత యెంతుమటంచుఁ బల్కుచునింతులందఱు వేడుకన్.

క. జలకము లారిచి బాలున
కలిచికురలు చిక్కు లెడల నయ్యెరుగడలన్
బలుకాపిడి బాలింతకు
మొలఁకువలం జెలిపి నిర్గమించినమీఁదన్. 15

శా. ఉద్యద్బాల దివాకరప్రతిముఁ బ్రద్యుమ్నాఖ్యుని బ్బాలునిన్
సద్యోజాత శివేక్షణానల శిఖాసంత్యక్త పూర్వాంగుఁడే
తద్యోగాత్తనవీన విగ్రహుఁడు కం దర్పుండె పీడించు దు
ష్టోద్యోగంబున శంబరాఖ్య దనుజుం డూహించి మాయాగతిన్.

గీ. పురిటిమంచంబు మీఁద నప్పాప్పఁ బోఁడి
యొత్తిగిలి చన్నుఁగుడుపుచునుండి నిదుర
సంధిలఁగఁ గన్ను మోడ్చిన సందుఁ జూచి
శిశువుఁ గొనిపోయి జలరాశిఁ జిమ్మివైచి. 17

క. వననిధి బాలునిఁ బడవై
చి నిజమనంబలరఁ బుఱికి సిరి మెఱయఁగ, నే
పునఁ జనియెను దమ యనుచరు
లను మతిఁ గొలువ శంబరాసురుఁ డంతన్. 18

క. మనుమని యపు డంభోనిధి
మనుమనిఁ దనవారి నడుమ మన్నననిడి ప్రే
మను మనిపె రుక్మిణీ భా
మను మనికిత మానసిని మన మలరంగన్. 19

ఉ. అంతట నొక్క మీనమసురారి కుమారుని మ్రింగఁ డంచుఁ దా
నంతత తద్ద్వజంబగుటఁ జాతురి మీఱఁ బ్రవర్ధమాన నై
జాంతర వృత్తిఁ దెల్పెడు క్రియం గబళింపఁ దదీయకుక్షిలో
నెంతయుఁ గోటరంబున నహీనముకై వడి నొప్పుచుండఁగన్.

చ. అదనగు నిప్పుడేఁగిన నటంచుఁ బరస్పర హూయమానులై
గొదగొని గాలముల్ వలలు కొద్దిగఁ జిక్కములుం ధరించి స
మ్మదమునఁబేర్చియార్చుచుఁగ్రమంబునఁదద్విషయప్రభాషలన్
గదలిరివెంట వారిధికిఁ గ్రక్కున శంబరుపేటి జాలరుల్. 21

క. చనికని మన మలరారఁగ
ఘనతర కల్లోలమాలికల నాలోల
త్కన దనిమిషసంతతి కట
నను మోదింపుచును జొచ్చి రంబుధిలోనన్. 22

సీ. సొరిది వీచీపరంపరలనీఁదుచు మీన
సంచార సంగతుల్ గాంచికాంచి
గాటంబుగా నేటి వేఁటంచు మోచేతి
వలలెత్తి యందంద వైచివైచి
నాపేరు పొంతన మీఁపట్లఁజేకూడెఁ
బొమ్మంచుఁ గాలాల జిమ్మిచిమ్మి
యొడబడ్డదాని సందడిఁగొని చేపట్టి
చిక్కంబులను వేగఁ జిక్కిచిక్కి

గీ. వివిధభంగులఁ దెరవుల వేడ్కలలరఁ
జెల్వగు విభేదములఁ బ్రశంసించుకొనుచుఁ
దనివి దీరక లోలోని కొనరఁ జనుచు
నామనిగ మీలవేఁటాడు నప్పు డొకట. 23

క. జాలరి యొక్కఁడు తనఘన
జాలములో నొడపుగనిన ఝషకేతన గ
ర్భాలసఝషరాజముఁగని
మేలము పచరించెఁ దనదు మేలములోనన్. 24

చ. బలువగుమోకులుం జిరుతపగ్గములున్ వలఁ దేలుకొయ్యలున్
జెలువుగఁగూర్చి పట్టుకొని సింగపుబొబ్బలు గుబ్బతిల్లఁగా
నెలమిని గట్టుచేర్చి తమినెంచుచు నందఱు గుంపుగూడు కొం
చలమి యిదేమిరా కనఁగ నచ్చెరువయ్యెడునంచు నేపునన్

క. అబ్బురపు చేఁపదీనిం
గొబ్బున దొరకీయమేలు గూడెడినారో
రబ్బ ! యని శంబరాసురుఁ
డుబ్బఁగ బాడగనుపుచేసి రొయ్యన నెదుటన్. 26

క. శంబరుఁడా శంబర చర
ముం బరికరయుక్తముగను మోదముతోఁబా
కం బొనరించుట కనుపఁగ
నంబుజముఖు లామహానసాంతరసీమన్. 27

గీ. వంట కనుకూలమగుటకై వ్రక్కలిడఁగ
ముత్తియపుఁ జిప్పలోపల ముత్తియంబు
కరణిఁ, గననయ్యె ననిమిష గర్భమునను
బాల భాస్వత్ప్రతీకాశ బాలకుండు. 28

క. రాజాంతఃపురరాజ
ద్రాజానన లిచ్చిరెలమి రతిచేతికి నా
రాజీవ గర్భసంభవు
రాజీవ దళాయతాక్షు రాజకుమారున్. 29

క. ఆసమయంబున నారదుఁ
డాసరసీజాయతాక్షి కబ్జాలుని వా
ర్తాసాకల్యముఁ దెలుప వి
కాసమునం బ్రత్యభిజ్ఞగా నిట్లనియెన్. 30

క. ఫాలాక్షుని నిటలాక్షు
జ్వాలాహుత విగ్రహుండు జనహృజ్జాలో
ద్వేలిత నిజ లీలాగతి
హేళి జగజ్జయముఁగొనుచు నతిచిత్రముగన్. 31

సీ. బ్రహ్మాదిసురుల నిబ్బరము దబ్బరసేయఁ
జాలు నెవ్వనితమ్మి వాలుడాలు
వరమానినీజనస్వాంతకాఠిన్యముల్
మృదువు గావించునే మేటిధాటి
వాతాంబు పర్ణాశులై తపంబొనరించు
ధన్యు లేవేలుపు దాసజనులు
సరసమానసరూఢసంకల్పతరునకు
మహనీయమూల మే మాన్యచరిత

గీ. పుట్టి జగదేకవీరవిహారుఁడైన
మహితతరమూర్తి నీభర్త మన్మథుండె
రుక్మిణీగర్భసంప్రాప్త రూఢిమెఱయ
నభినవస్ఫూర్తి నిబ్బాలుడై జనించె. 32

క. తనకీ బాలుని వలనన్
మనవాదని మేర తెలిసి మాయాపరుఁడై
వననిధి నసురుఁడు పడవై
చిన మీనమువలన నీకుఁ జేకొనఁగలిగెన్. 33

గీ. అనుడు నబ్బాల ప్రత్యభిజ్ఞాధిరూఢ
నిజమనోహర భావజస్నేహకలిత
హర్షపులకాంకితాంగయై యలరెఁ దరి జ
లావనీకజ కళికయా తీవెకరణి. 34

వ. ఈగతి నారదోపదేశంబున నబ్బాలకు నిజమనోహరుఁగా నెఱింగి, మును దా మాయావతీసంజ్ఞచేఁ దదాగమన కాంక్షిణియై యుంటఁ బుత్త్రార్థినియుంబోలె శంబరానుమతిఁ బడసి, యబ్బాలుని పోషింప, నతండు శీఘ్రకాలంబున నారూఢ యౌవనుండై నందినానందకర లీలారస నిష్యందంబుల సుందరీజనసుందరబృందంబుల డెందంబు లమందంబుగా నంద నందంబున. 35

చ. వదనమునందుఁ జందురుని వారిజముఖ్యశిలీముఖంబులన్
సదయ నిరీక్షణంబులను సంతస మొప్ప వసంతుఁ దత్పురీ
సముపవనాంతరంబులను సంగతిఁగూర్చి మనోహరాకృతిన్
మదనుఁడు దేజరిల్లె, రతిమానసవీథిఁ గోర్కె లూరఁగన్.

చ. చిర విరహాగ్ని లీఢమగు చిత్తము చల్లఁదనంబు నొందవే
డ్కరతి సమంచితాత్మకుచకాంచనకుంభయుగంబుదత్వయ
స్సరసినిముంచి పూర్ణరస సంగతిచే నభిషేచనక్రియా
పరత వహించె,నంత నిజభర్తృతనూవిలస ద్వనస్థలిన్. 37

ఉ.చూపుల కెంతయున్ హృదయసూచనమోహనలీలఁ దెల్పుచో
గోపు లలంకరించి నవకోమల విగ్రహుమూరుఁ జేర్చ,ను
ద్దీపిత వృత్తిచే సలితదీయ ముఖేందు మనోజ్ఞతా సుధా
రోపిత నిర్నిమేషగతి రూఢిగ నందె సుపర్వసాత్కృతిన్. 38

సీ. వదనాంబుజంబుపై వ్రాలించు చూడ్కులు
మదమిళిందంబులై మరలకుండఁ
జిరునవ్వు వెన్నెలఁ జేర్చినకన్నులు
స్థిర చకోరంబులై తిరుగకుండ
లావణ్య సరసి నాలంబించు దృష్టులు
వన్నెసూ కలువలై నాడకుండఁ
ప్రేమ నిధానమా ప్రియుఁ జెందు నీక్షలు
వరఖంజనంబులై వదలకుండ

గీ. ఇటుల చిరవిప్రయుక్తసంఘటితకాంత
మోహకలనాప్తి సూచనోత్సాహమైన
రతికిఁ దమి మించి జనియించె రమణుపైని
ప్రథమదశయైన దృక్సంగ భావ మపుడు. 39

ఉ. అంతట నొక్కనాఁడు వికచాంబుజలోచన మీనకేతనున్
మంతనమన్మిషంబున నమందవిమోహము నిల్పలేక యే
కాంతముఁ జేర్చి మానసభవానలశాంతికి వాంఛఁ జెందుచో
స్వాంతమునందుఁ జాల వెగటంది యతం డవికారవైఖరిన్.

చ. జనని యిదేమి యింత తనుజాతుఁడ నీకని ప్రేమయుంచ కీ
పనికి వహించు టెట్లు దగుఁ బాపముగాదె యటంచుఁ బల్కినన్
విని రతిపల్కె నోభువనవిశ్రుతమోహనతాధురీణ ! నే
జనని నిగాను నీవు తనుజాతుఁడవైన క్రమంబు దెల్పుచోన్.

క. అనవుడు నాతనుజాతత
జననివి గాకుంట నీవు చనునే భువిపై
ననిశము "నవినాభావం"
బెనయక యిటులుండ నేర్చునే యొందైనన్. 42

ఉ. నావుడుఁ బల్కె నారతి యనన్యసమానమనోజ్ఞ సంపద
న్నీవల మన్మథుండవు జనించితి విట్లు విదర్భరాట్సుతా
పావనగర్భసీమ నినుఁ బాయుచు నీదృగవస్థ నైతి నే
సేవలవృత్తి నీకుఁ బ్రియగేహిని నైన రతి న్మనోహరా. 43

సీ. శైలేంద్రతనయపై శూలి మోహితుఁజేయ
దేవతాప్రేరణఁ దేజరిల్లి
యతఁ డసమాధికస్థితి సమాధిగరిష్ఠుఁ
డైన-నో విషమాంబకాఖ్యకరయు
నాత్మైకరూఢి నహంకృతి మీఱంగ
సుమనఃప్రకాండములఁ బూనిపి యతని
ఫాలానలజ్వాల భస్మీకృతుండవై
భువనమనోభవస్ఫూర్తినగడ
గీ. నుంటి వంత నమాంగత్వ మొందకుండ
మహితతరమూర్తియా సర్వమంగళేశు
కరుణ నేప్రద్యుమ్నవద్యోగవరము నొంది
ప్రాణపతివైన నంత నయ్యమరవహాని. 44

క. లీలాగృహీత విగ్రహుఁ
డాలక్ష్మీరమణుఁ డెలమి యాదవకులమున్
మేలుగ నొంది జగత్పరి
పాలకుఁడై యున్న యతని భవ్యాంశమునన్. 45

క. హృద్యతర రూపగరిమన్
బ్రద్యుమ్నుండై విదర్భపతికన్యకయం
దుద్యల్లీల జనించి మ
హోద్యమగతి మెఱయ నిన్ను నొందు నెలంతా. 46

క. అని నా కుపదేశించిన
విని శంబరు నింటనుంటి వీనికి నీచే
హాననము గానుండుట నేఁ
గనుఁగొని భవదాగమంబుఁ గాంక్షించి మదిన్. 47

మ. ఘనమాయాపరుఁ డీదురాత్ముఁడు నినుం గల్లోలినీభర్త క
ప్పనముం జేసిన వారిలోన నొకచోఁ బాఠీనగర్భాంతరం
బున నున్నంత యదృచ్ఛ ధీవరులు సమ్మోదంబునం బట్టి తె
చ్చిననాసొమ్మగుటన్ లభించితివయశ్శ్రీపూర్ణుఁగాఁ జేసితిన్.

వ. అనిపలికి మాయావతి సకలజగన్మోహనాకారుండైన మనో
హరుని సమరసోత్సాహసాహసునిగా నొనరించి, నిఖిలశత్రు
వినాశినియైన మాయావిద్య నుపదేశించిన, 49

మ. అతఁ డమ్మాయననుగ్రహించి కలితాహంకారుఁడై విగ్రహ
స్థితి సత్త్వప్రభవిష్ణుఁడై సమరజశ్రీకాముఁడై సంభృతో
గ్రతమస్స్ఫూర్త్యసమాంబకుండునయి సంరంభించిరక్షోదయా
హతిసేయఁ బరమాత్ముఁడయ్యెనుప్రపంచాశ్చర్యకృద్రూపుఁడై.

ఉ. ఓరి నిశాచరాధమ మహోదధిన న్బడవైచి తింక నిన్
ఘోరరణాబ్ధిలోనఁ బడఁగ్రుమ్మెద రమ్మని ముమ్మలించి వేఁ
జీరిన శంబరుండు దరి శీఘ్రమ యుగ్రగదాగ్రహస్తుఁడై
భూరిసమీరణుం డచలముంబలె మారునెదిర్చి యార్చుచున్.

చ. గదభ్రమియించివైవ నతిగాఢబలాఢ్యగదాగ్రజాత్మజుం
డది గదియంగనీక తునియల్వడఁ గొట్టి దృఢాభిఘాత కృ

ద్భిదురముఁబోలు నాత్మగదఁ ద్రిప్పినిశాచరనాథుఁడై వ వాఁ
డుదిరి మహోపదిష్టకదనోర్జితమర్జయదైత్యమాయలన్.

క. పెళపెళ నార్చుచు దళమగు
ప్రళయాభ్రముఁబోలె మింట బర్వుచు ధారా
మిళమరుశరములు గురిసిన
నలినాక్షుతనూజుఁ డంత నగధీరుండై. 53

మ. అరిమాయాపహసాత్త్వికప్రథితమాయాక్లృప్త జంఝామరు
ద్గురుహోర్నాద విఘూర్ణ దర్ణవ పయోదోద్యద్వీథిజృంభించి,జ
ర్ఝరితాకారవికారుఁగాఁబొడువ నారక్షః ప్రభుండున్ జనో
త్కరదృగ్భీతపిశాచగుహ్యకముఖాకారోరు మాయావిధిన్.

క. పన్నునఁ దనునొప్పించిన
వెన్నునికొమరుండు నిశితవిశిఖావళిచే
నన్నిటిఁబొలియఁగఁ జేసెను
సన్నుత పటుబాహుశౌర్య సంశోభితుఁడై. 55

వ. మఱియు నాశంబరుండు దన శాంబరీమంత్రమహిమ నహి
దహనగగనాద్యనేకవిధమాయావిహార ప్రహారమహోదగ్ర
వృత్తి నెట్టుకొని, తన్నుం జుట్టుముట్టుకొని, బిట్టదుమం
దొట్రుపడక వెన్నునిపట్టి, దిట్టతనంబునం బట్టి, సపరిఘాదు
లంగొట్టి, తెరల్చుచుఁ గుండలీనసముద్దండభుజాదండకుండ
లీకృతకోదండనిర్ముక్తప్రచండకాండంబులు మెయినిండించిన,

మ. రణనానావిధవిక్రమక్రమణుఁ డాక్రవ్యాదుఁ డత్యుగ్రవీ
క్షణుఁడై, దర్పమెలర్ప శక్తినపు డక్కందర్పుపై, వేగ భీ

షణరేఖన్నిగిడింప, వాని నడుమన్ సంరంభమేపార వా
రణమందించె నతండు దారుణసమగ్రప్రౌఢబాణాహతిన్.

చ. కినుక నిశాటుఁ డగ్గలికఁగేల మహాగదఫూని డాయ న
వ్వనరుహనేత్రసూతి దవవహ్నిమహోగ్రశిఖాసముజ్జ్వల
ద్ఘన నిశితాసి నయ్యసురుకంఠముద్రుంప, శిరంబురాలె, నం
తను దనుజారివృష్టసుమనఃస్థితభృంగసమాభిపాతమై. 58

గీ. శంభరాసురు మాయించి సంభ్రమమున
సంగరాంగణరంగానుషంగినటన
భంగిరచియించు మరుని యుపాంతమునకు
లలితగతి వచ్చె, రతి జయలక్ష్మిఁబోలె. 59

మ. సతమస్కప్రహరప్రభావలి గళచ్చైతన్యలోకోత్కరా
యత ఘోరాహవరాత్రికాల విరమంబై నంతఁ జెంత న్మహో
ద్ధతదోషాచరమూర్తి వాయ జగమత్యంతంబుగా భాసిలన్
రతియన్ గూఁకిమిచాయ చెందెనపుడా ప్రద్యుమ్నభాస్వంతునిన్

ఉ. అంతట నవ్వధూమణి లతాంతధనుర్ధరుతోడ వేగ న
త్యంతము నంతరిక్షగతి ద్వారకకుం జనుదేర నెమ్మదిన్
సంతసమంది తా గగనచారిణియై నిజనాథు బాహుయు
గ్మాంతరసీమఁ జేర్చి నగరాభిముఖంబుగ నుద్గమించినన్. 61

మ. రతికాంతాలతికాంత బాణులు వియత్కాంతిక విజృంభించి, రా
నతివిభ్రామమమానచిత్రగమనం బాశ్చర్యమందింపఁగా
సతతాక్రీడవిమానచారణులు తత్సంభావనార్థాదరు
లతగా నెంచిరి గొంతదూరము ప్రియాలంవాచ్యసన్మానులై.

శా. కాంచె న్వంచిత శంబరుండు సమనఃకాండుం డహోవిస్ఫుర
త్పంచై తన్యమహాసనీ ప్రతతిమత్ క్ష్మాభృద్విభాస్వత్సతీ
సంచారాస్పద దివ్యచిత్రగృహరాజ శ్రేణికాకంఠ భా
గాంచత్కాంచనరత్నతోరణ సముద్యద్ద్వారక న్ద్వారకన్.

క. కని సతితో ననిమిషకే
తనుఁడనెఁ గనుఁగొంటె బాలతారకపథమం
టిన చణసౌధాగ్రస్ఫుర
దనుదృతగాంగేయ కుంభహరిపురలక్ష్మిన్. 64

ఉ. కేళినిజూచితే పురి నికేతన జాతహిరణ్మయాంశు కో
చ్చాలన తాళతళ్యములు సంగతసౌధములై తగె న్నను
న్మీలితలోకుఁ గృష్ణఘనునిం గని యాత్మపరిగ్రహార్థ ము
ద్వేల విలాసత న్మెఱయు తీగెమెఱుంగులభంగి రంగుగన్.

క. అనికొనియాడుచు మదనుం
డనుపమగతి నభమువలన హరిపురమునకున్
గనుఁగొను వారికనుంగవ
కనుమోదం బొదవ డిగిమె నంగనతోడన్. 66

సీ. జగతీ దిదృక్షావశంబునఁ జను దెంచు
గిరిజాసహాయుఁడో గిరిశుఁ డొకొ
అమరసంపద లెల్ల నలరించు హరిఁగొల్వ
శచితోడ నేతెంచు శక్రుఁడొకొ
తనరాక కుప్పొంగు వనరాశిఁ గనవచ్చు
రోహిణీయుత హిమరోచియొకొ

తనలీల హారికిని దగఁదెల్ప మెయిఁదాల్చి
రతితోడ నేతెంచు నతనుఁడో కా.

గీ. అనుచు నిజరూప దర్శనోద్యద్వికల్ప
కలితులై పౌరజనము లుత్కలికఁజెంద
నాత్మతనుకాంతి నభమెల్ల నలముకొనఁగ
వెలఁదితోఁడుత మదనుఁ డవ్వేళ నలరె. 67

మ. ఉదయద్భానుమరీచికాప్రచయ సద్యోభిన్నపద్మోదరా
స్పదమాధ్వీరససంగసన్మధుకరీపారంపరీ విస్ఫుర
న్మదనాస్యేందుమనోజ్ఞతాలహరి నిర్మగ్నాచలద్వీక్షణా
ల్మదనాగాధిపయానలందఱు మది న్మోదేతరానందలై.

క. మునుపటి మన్మథుఁడనుచును
వినుటయె మనమెన్నఁడైన వీక్షించుట లే
దనుపమగతి నతఁ డితఁడై
మొనయక మఱిగలరె సాటి ముల్లోకములన్. 69

క. అనుచును నిజలావణ్య ర
సనిరంతరవీచికలనసంభ్రమయుతద
ర్శనలై మనమున నివ్వెర
దనరఁ గనుంగొనఁగ నపుడు తద్దయు వేడ్కన్. 70

క. తొలకరిమెఱుఁగును బాయని
జలదము చందాన మరుఁడు సతితోడ సిరిన్
గలకలనగు కలకంఠులు
గలరతనపులోని మేడకడ కరుదెంచెన్. 71

మ. కనదంతఃపుర నీరజాక్షు లెలమిన్ గాంతాసమేతంబుగాఁ
జనుదేర న్నవమన్మథుండయిన యాచంద్రాననుం జూచి, యా
వ్వనజాక్షుం డని నెమ్మదిన్ లలితభావం బొప్పఁగా వేడ్క న
య్యనసందందనడాఁగుచు న్వెఱఁగుపాటం దన్వి భావించుచున్.

క. హరి యగునందరు కొందఱు
హరిగాఁడన లక్షణంబు లరయుచుఁ గనఁగొం
దఱు కొందఱు పడతుక ల
చ్చెరువొందుచు నపుడు మరుని చెలువంబునకున్. 73

చ. కనుఁగవ చెంగలింప నతికౌతుకలీలఁ దదీయవైఖరిన్
గని, హరిచందమన్యులకుఁ గల్గఁగనేరదు, వీనియందము
న్గన, హరియే యగున్ హరికి నందనుఁడై తగుఁగాని వేఱొకం
డనఁదగదంచు రుక్మిణియు నద్భుతముం బ్రమదంబు నొందుచున్.

మ. తనయుం బాసిన నాఁటనుండి యొకవార్తాలేశమింతైన లే
దనయంబు న్మదిఁ గుందఁజేసె విధియాహా వాని లావణ్యరే
ఖ నిరూపింపఁగ నెందుఁ గాన నయితిం గన్పట్టు నీధన్యునం
దునితం డెవ్వఁడొకో యటంచు మదిఁ బెంచున్సంశయం బెంతయున్.

క. హరియును దా నందఱివలె
నరుదందుచు నెఱుఁగనట్టు లభినవ మదను
న్నిరుపమలీలాసదనుం
దరహసిత స్మేరవదనుఁ దార్కొన నంతన్. 76

ఉ. నారదమౌనివచ్చి వదనంబున సుందర మందహాస మిం
పారఁ గళానిధిన్ రతిసహాయుని మన్మథుఁగాంచు రుక్మిణీ

సారసగంధికిన్ హరికి జన్మము శంబరకృత్య మాదిగాఁ
జారుతరోక్తులన్ దెలుప సమ్మద బాష్పము లంకురింపఁగన్.

చ. కొమరునిఁగౌఁగిలించుకొని కూరిమిరుక్మిణి యాత్మవిగ్రహో
పమమహనీయమూర్తియుఁగృపావనమైతగుముద్దుఁగోడలిన్
సముచితలీల లాలనమొసంగఁ బ్రియంబొనరించెఁ దేవకీ
ప్రముఖసరోజనేత్రలు నపారముదంబున గారవింపఁగన్.

గీ. అడుగుఁదమ్ములపై వ్రాలు నాత్మభవుని
కౌఁగిటను జేర్చెఁ గృష్ణుఁ డుత్కంఠ మీఱఁ
జారుసాకారమహిమవిస్తార కలన
నాత్మసారూప్య ముద్వేలమై చెలంగ. 79

సీ. బలరామ సాత్యకి ప్రముఖ యాదవవీరు
లత్యాదరస్ఫూర్తి నలరఁ జేయ
సాంబాది సోదరులం బరమప్రీతి
గౌరవంబేసార గారవింప
పౌరాంగనాహస్త సారసవికీర్ణ
మౌక్తికాక్షతము లాసక్తిఁ గొనుచు
నారదముఖమౌని నాయకాశీర్వాద
సందోహములకు నానంద మొంది

గీ. నందనందన నందనుండిందు రత్న
మందిరామంద సుందరీబృంద మిళిత
మగుచు విలసిల్లు జననిశుద్ధాంతకలిత
జలజసదనా నివాసంబు సంశ్రయింప. 80

క. కొడుకుం గని యుప్పొంగుచు
నెడ తెగని ప్రమోదవార్ధి నీఁదుచు సిరులన్
దడఁబడుచునుండె రుక్మిణి
పడఁతులు తను నభినుతింప భాగ్యోన్నతయై. 81

గీ. తల్లిదండ్రుల యుల్లముల్ చల్లఁదనముఁ
జెంది యానందకందళాశ్రితము లగుచు
రంజిలఁగ లోకమహితాభిరామలీలఁ
బెంపు ఘటియింపఁ బ్రద్యుమ్నుఁ డింపుదనరె. 82

క. సిరియే రుక్మిణి యనుకొనఁట
సిరిమెఱయఁగ మున్ను దనరు చిత్తజుఁడే యీ
కరణి బ్రద్యుమ్నుండఁట
తరమే నుతియింప వారి ధన్యత లవనిన్. 83

క. అన విని మునిరాట్కులమణిఁ
గని మన మలరారఁ బల్కెఁ గమలాక్షతనూ
జునిచరితామృతధారలఁ
దనియఁగఁ గ్రోలంగఁదలఁచి ధరణీపుఁడెలమిన్. 84

మ. మునినాథా మున విన్నవెన్నని కథల్ముక్తాసరస్యాతిరే
తిని నామానససీమఁ గన్గొనుచు నుద్దీపింప నీసత్కృప
న్వనజాతాక్షవరాత్మభూచరితము ల్వర్ణింపఁగా నంతక
న్నను చిత్రంబగు వానిసత్కథ లుపన్యాసంబు సేయంగదే.

మ. అన నావ్యాసతనూభవుం డధిపలోకైక ప్రభావస్ఫుర
ద్ఘనత న్మౌనమఱందలై తనరు వైదర్భక్షితీశాగ్రణీ
తనయ న్రుక్మవతిం ద్రిలోకనుతసౌందర్యన్ గుణాంభోనిధిన్
దనుమధ్యామణిఁదత్స్వయంవరమహోత్సాహంబునన్జైకొనెన్.

క. అన విని నృపుఁ డమ్మునిఁగని
మును గృష్ణునిచేతఁబన్నములఁబడి యపుడా
తనయం దత్తనయుని కతఁ
డొనరఁగ నేరీతి నొసఁగెనో యన వేడ్కన్. 87

క. తన తనయకుఁ దగుపురుషుం
డని నిజసోదరికిఁ బ్రీతియగునట్టులుగా
వినుఁ బెండ్లిచేసెనన న
య్యనఘుఁడు తద్విధము తెలియ నడుగుటయంతన్. 88

మ. సతతాప్తావనదక్షదక్షరిపు తేజస్కార సారస్యభా
విత సౌహార్ద్రికపీంద్ర వీంద్ర విజయాభిర్భావ భావోద్భవ
ప్రతిమాకార విహార హారిగుణ ధుర్యప్రౌఢ ప్రౌఢ క్షమాం
చిత బాహాంతరధీర ధీర జనలక్ష్మీ కృష్ణమహానుగ్రహా. 89

క. కంజాతనయన భక్తిస
మంజస నిజహృదయ కంజయాహవభేరీ
మంజుల జయజయజయరవ
భంజితమాద్యద్విజీర బలహృత్పుంజా. 90

క. సమదముజాయతుఖానజ
నిమథన యజ సారకవిమణీనుత నానా
నమచమిత రాజలీలా
సమశర కారుణ్యరుచిర సరసకటాక్షా. 91

వనమయూరము.

సారఘనసారసిత సారసనితా నీ
హార శర సార కరి హార దరి వాణీ
తారక శతార శశి తార శివమూర్తీ
క్షీరనిధి హీర హరి సీర కర కీర్తీ. 92

గద్య.

ఇది శ్రీలకవరసుమనోగిరిధామ రామచంద్రచరణార
విందమరందాస్వాదన సమాసాదిత నిరవద్య
సాహితీరసవిభావిత కవితాతిరేక రేకపల్లి
సూర్యనారాయణ తనూభవ నిఖిలవిద్వ
త్కవిజనానుగ్రహ సనాథ సోమ
నాథ ప్రణీతంబయిన రుక్మవతీ
పరిణయాభిధాన మహా
ప్రబంధంబునందుఁ
ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# రుక్మవతీపరిణయము.

## తృతీయాశ్వాసము.



శ్రీయుత వత్సాంక సమను
మేయ శ్రీరమణ భావమిహిలాన్వయ భూ
షాయుత గోపాలమహా
రాయ జయ శ్రీరిరంస రాజవతంసా. 1

వ. అవధరింపు మజ్జలజాక్షిసూత్రి కథాసుధారస ప్రసూతమాధుర్యానుస్యూతచేతుండగు సూతుండు, శౌనకాద్యఖిల మునివరుల కెఱింగించిన తెఱంగునఁ బాండవకులమండనుండగు పరీక్షిన్మహీమండలాఖండలునకుశుక యోగీంద్రుం డిట్లనియె.

సీ. శ్రీరాజమణిసౌధసారామితోత్సేధ
తారాచలభ్రాంతి కారకంబు
హేలామిళచ్చంద్ర శాలావినిస్తంద్ర
లీలావతీసాంద్ర లాలితంబు
నాగావళీదాన భోగాళినీతాన
గాగాయనీగాన రాగదంబు
భాసమానామరాభ్యాస నాసాఘ్రేయ
వాసనాగురుధూప వాసితంబు

గీ. నగుచు వలనగు జిగిఁగను సొగసుపనులఁ
దగిన మగరాలమేడ నెమ్మొగముచాయ
నిగనిగలసీన నగరింపు నగరిసిరుల
వగలనగునట్టి కుండిననగరి దనరు. 3

సీ. బలభేదిపీటిని బరిహాసింపకయున్నె
ప్రబలసంసేవ్య యీభవ్యనగరి
యగజాధిపతి యేలు నగరి మీఱకయున్నె
బహుగజావాస మీపట్టణంబు
అలకుబేరుండేలు నలకఁ గేరకయున్నె
రమణీయరాజ్ఞ యీరాజధాని
జడధీశుఁడు వసించు విడిది నవ్వకయున్నె
వరసుధీసహిత యీపురవరంబు

గీ. విబుధసముదాయ కామధు గ్వితతసతత
భూసుత్తైశ్వర్య సన్నిధానానవద్య
నూత్నవరత్న ఘటనామనోజ్ఞదివ్య
భవనవరమాన్య విభవసంభవన వరమ. 4

ఉ. ఆపురదివ్యసౌధ నికరాంచితకాంచన పుత్త్రిక ల్కర
స్థాపిత రాజరత్న కలశంబులచే ననిశంబు తత్పుర
స్త్రీ పరిశోభిరూపముల రీతికినోడి, జలాహృతిక్రియా
వ్యాపృతిఁదాల్చియున్నయమరాంగనలచ్చటనుంటఁదెల్పెడున్.

మహాస్రగ్ధర.

పరిఘాంభఃపూరమందున్ బలిసదనమునన్ బర్వినిండన్ ఫణీంద్రుం
డురుభీత్యాక్రాంతుఁడై పై కురక వెడలి తానుర్వి దత్పట్టణోద్య
ద్వరణవ్యాజంబుచేతన్ వలయముగ దదత్యంతవిస్తారశృంగో
త్కరలీలం దత్ఫణవ్రాతము వెలయు దివిందాఁకి లోకాద్భుతంబై.

మ. నవశిక్షాధ్యయనప్రభావమతిమన్నాళీకభూసంతతుల్
నవఖండక్షితిపాలనైకసముదీర్ణక్షత్రియాధీశ్వరుల్
నవరత్నౌఘవిభావనాప్రథితధన్యప్రాభవార్యేశ్వరుల్
నవధాన్యాకరశూద్రులుం బొలుతురౌన్నత్యంబు చేనప్పురిన్.

సీ. ఒకరు కువలయ రక్షోద్యోగులైన నొ
క్కరు చక్రపోషణకరమతీషు
లొకరు సద్విజరాజు నుద్భయం బొందింప
నొకరు సూర్యాహితప్రకట తేజు
లొకరు సశ్యాములై యుల్లాస మొందిన
నొకరు పద్మినులతో నొప్పుగాంతు
రొకరు విగ్రహలక్షణ కలనఁగాంచిన
నొకరు తేజస్ఫూర్జ దుదయశాలు

గీ. లొకరికొకరెంచఁగ నసహాయులును విక్ర
మప్రకాశకులగుచు సమానదివ్య
గోత్రసుకృత ప్రదక్షిణకుశలు లగుచుఁ
దనరుచుందురు రాజమార్తాండు లచట.

సీ. శ్రీమంతుఁడొకఁడు మున్ జెన్నొందు నటువంటి
శ్రీమంతు లెంద ఱీధామమునను
జతురాస్యుఁ డొక్కఁడున్నతి మీరు మున్నట్టి
చతురాస్యు లెంద ఱీసరసనగరి
సర్వజ్ఞుఁ డొకఁడు మున్గర్వించునటువంటి
సర్వజ్ఞు లెంద ఱిచ్చట గణింప
జిష్ణుఁ డొక్కఁడు మున్ను చింతింపనట్టి జి
ష్ణులుచూడ నెంద ఱీలలితపురి న

గీ. టంచుజను లెన్న లోకవిఖ్యాతి మెఱసి
నిగ్రహానుగ్రహకళాసమగ్రు లగుచు
నసమవిభవంబుగలిగి దివ్యాంగులైన
పురుషవరు లుందు రందు నైపుణము దనర. 9

సీ. గంభీరవేదిలక్షణ లక్షితోదగ్ర
గంధదంతావళోత్కరయుతంబు
ఘనతరారట్టజ గాంధారసంభవ
గంధర్వసంపత్ప్రబంధురంబు
అతిమహారథసంజ్ఞ కాహూఢకీర్తి వి
ద్యోతితరథ సమూహాన్వితంబు
దోర్వీరమల్లాది దుర్వాదబిరుద స
మంకిత భటమాళి సంకులంబు

ఆ. నగుచు చతురంగయుత సముద్యత్ప్రతాప
దీపితాటోపపరదురవాప మగుచు
విగ్రహస్థైర్యకలనచే విపులమైన
సేనగలదానగరి ననసంఖ్యానయగుచు. 10

ఉ. ఎవ్వరె మంజులుల్ చెణకి రెవ్వరె యీదిగుర్లో త్తికలతన్
జవ్వని తెల్పుమంచు నవసంగమలక్షణతత్పరోక్తులన్
నవ్వుచుఁ గంతునాటక కనత్కనకప్రతిమోపమాంగలై
పువ్వులతోఁటలందు ననఁబోండ్లురసంబు ఘటింతు రప్పురిన్.

సీ. (నిరోష్ఠ్యము) లతికాంత సారసంతతిఖేల దళిజాల
కలనాదగీతికా కలనఁగాంచి
సతత రాజసగంధ సంగతానిల లస
త్సంచార లీల లాసక్తిఁ జెంది
కిసలయ శకలాతి రసకషాయిత కంఠ
కలకంఠకీర్తన ఖ్యాతిఁ జెంది
సహకార సారజ్ఞ సకల కీరాధిష్ఠి
తాశేష శాఖల నలరఁజేసి

ఆ. రసిక జనచిత్త రంజనాశ్రయ చరిత్ర
లలితతర చైత్రనేత తా లలి నెలంగ
రాజనగరాంతి కాంత నిరంతరాళి
సంత తాచ్ఛాయ ధరణిజాస్థాని దనరె. 12

సీ. ఘనసార గంధసారనవాగరూద్భూత
రమ్య దీపావళీ ధూమ్యగాఁగ
నిరవద్య లావణ్య నిజగాత్రలసనము ల్
సురుచిర వైద్యుత జ్యోతిగాఁగ
లలిత సంగీతకళాజాత సితమణి
వ్రాతరస శ్రుతుల్ వారిగాఁగ
లాస్యక్రియాభేద లంచిత శ్రమభవ
శ్వాసంబులును ప్రభంజనముగాఁగ

గీ. మురజ వరజాత నిర్ఘోషములును గర్జ
నములుగాఁగను బుసతీసమితి యాత్మ
లలిత సౌధంబు మేఘమండలముఁజేయ
సరస హృదయానురాగసస్యంబు లలర. 13

క. తరణి వహించును దత్పుర
సరసిజమణి శిశిర కిరణశాలా శిఖరో
పరిఖచిత కనక కలశ
స్ఫురణల ఖద్యోతమాత్ర సురుచిరలీలన్. 14

క. నవమాసతతాంచిత యగు
నవనీసతి రత్నగర్భనై కనియెనో నా
నవరత్నౌఘము లప్పురి
నవిరళతను విపణులందు వ్యాప్తములయ్యెన్. 15

క. కనుఁగొన నిదిగల దదిలే
దని తెలుపఁగదరమె ? తుది ననంగునకై నన్
గొనఁగలిగినఁ గల వప్పరి
ననుపమ లావణ్యరసము లంగడఁ లంపన్. 16

మ. దివివారందరుగూడి క్షీరనిధి మర్దింపంగఁ గాన్పించు న
న్నవలాలచ్చరలౌట యోగ్యసమ భిన్నావాప్తి లేదంచు న
బ్బుభిలావణ్య నిధిన్ మథింపఁగ సముద్భూతంబులై తత్ప్రథన్
నవలావణ్య సరస్సులై తగెఁబురిన్ వారాంగనావారముల్.

క. ఘటికలు దెలుపును బురినె
ప్పటికిని మణిహాటకాగ్ర భాగాంబరలి
ఝటికారవ శాలాంతర
ఘటిత విటంకావలంబి ఘంటారవముల్. 18

క. ధరణీ మండల మండన
కరుఁడగు తత్కుండినాఖ్య ఘనపురమునకున్
బరిపాలకుఁడగు భీష్మక
నరపతి దగె వైరి సార్థనామకుఁడగుచున్. 19

గీ. అధరాధీశు నాత్మజులందు నగ్ర
గణ్యుఁడగు రుక్మి మనుజవరేణ్యుఁడలరు
నాత్మ మణిపాద పీఠశాణావలీఢ
రాజకాంచన కోటీర రాజియగుచు. 20

క. ఆరాజవంశ భూషణుఁ
డారూఢాఖిల సమీహితార్థుండగుచున్
గూరిమి మెఱయఁగఁ గులకాం
తారత్న సుఖోపభోగతత్పరుఁడగుచున్. 21

గీ. కనియె నారాజదేవేంద్రుఁ డనుపమాన
ధన్యగుణగణ్యలావణ్య మాన్యయైన
"రుక్మవతి"యను కన్యను రూఢిదనర
కమల నద్దుగ్ధ వారాశి గాంచినట్లు. 22

గీ. అమిత సౌందర్యరేఖా సమగ్రలీలఁ
బొలుచు నాకన్య సంతత స్ఫురణరత్న
దీపనలరీతి రుక్మిపార్థివవరేణ్య-
భవనమెల్లను దీపింపఁ బ్రభఁదలిర్చె. 23

క. వెన్నెలల నలరు కళలుగ
మిన్నలవగు చంద్రరేఖ మెఱసిన కరణిన్
గన్నియ లావణ్య కళల
మిన్నల నానాఁటికింపు మీఱుచునుండెన్. 24

ఉ. బంగరుబొంగరాల నవపద్మ మణీమయ పుత్రికావళిన్
సంగతిఁదోటి బాలికలు సంఖ్యలు దెల్పఁగ బాల్యకేళుల
న్రంగలరారు రుక్మిజననాథ తనూభవ యందొకింత భా
తింగనుపట్టె యౌవనపుఁ దీరుపు దెల్పెడు వింతవైఖరుల్. 52

చ. పలుకుల ముద్దులున్మధుర భావముచూపుల తేటలందుఁ గ్రొం
దళుకు ముఖాంబుజప్రభల నవ్యమనోజ్ఞత మేనిచాయలన్
జిలిబిలి సోయగంబునయి చెన్నువహింపుచు నంతనంత నా
కలికికిఁదోఁచె యౌవన వికాసము శైశవలీలలందునన్. 26

గీ. సరసతరవిద్యలన్ని సద్గురునివలన
విమలమతి నేర్చి యబ్బాల విదుషియగుచుఁ
రమ్యలీలల మదనాంతరంగగురుని
వలన నేర్చుచుఁ దరుణి గావచ్చెనంత. 27

గీ. ఉదయరాగంబు నొయ్యన నోసరించి
లలితతర సుధాకిరణ జాలంబునొంది
యలరు శీతాంశుమూర్తి నా నలరుఁబోఁడి
బాల్యమెడలించి యౌవన పటిమఁదనరె 28

సీ. అలి నీలమణి జాలముల నేలఁగలలీల
దగెనింతి కచకాంతి నిగనిగలకు
మరుతూఁపు గమిమాపు సిరులూఁపు నుచుగోపు
గలిగె బాలిక వాలుఁగన్నుఁ గవకు
విరిబంతులకువంతు విడిపింతునను మంతు
గొనసబ్బెఁ జెలిగబ్బిగుబ్బలకును
సిరిమీఱు నలమూరు తరవారి మురితీరు
చేరె నారీమణి యూరునకును

ఆ. వె. మిన్నుఁ బొన్నపువ్వు దిన్నెలు ననఁటులు
శరధియుగళి సరసిజములు దెగడి
తెఱవ నడుమునాభి పిఱుఁదులు తొడలు జం
ఘలు పదములు సోయగములఁదనరె. 29

క. జననీజనకుల హృదయం
బున కనుమోదము ఘటించు ముగ్ధల నా జ
వ్వని యౌవన కళల మనసి
జనిశితశస్త్రంబుమాడ్కి ఛాయలనలరెన్. 30

క. ఈరీతిలలిత గతులను
నారీతిలకంబు యౌవనమునిండ మెఱుం
గారుచుఁ దండ్రికి నిజఘన
నార గుణామోదకలన సంతసమిడియెన్. 31

గీ. భవ్యతరకీర్తి రుక్మిభూపతియు నంత
రమ్యగుణధన్య కన్యకారత్నమునకు
వరసువర్ణానుఘటన సుందరతఁగూర్ప
నాత్మఁదలఁపుచునున్న నయ్యవసరమున. 32

మ. వరమాయాబల శౌర్యసారముల గర్వగ్రస్తుఁడౌ శంబరా
సురునిన్ సంగరకేళిఁ ద్రుంచి దివిజస్తోమంబు మోదింపఁగాఁ
బురికేతెంచి వినోదలీలల సిరిన్ బొల్పారు ప్రద్యుమ్ను వా
ర్తరహింబంధుపురోహితాదులుప్రమోదంబొప్పఁగాఁదెల్పఁగన్

చ. జనకునితోడఁ దన్మహిమ సంగతిఁదెల్పు, జనాళి నెల్లఁదా
నెనరు దలిర్పరాఁ బిలిచి నెచ్చెలిచే నడిగించి వేడుకన్
మనమునఁ దృప్తి దీరక యమంద తదీయ విలాసవైఖరుల్
వినుచు నిజాత్మ రుక్మవతి వీక్షణ తత్పరచిత్తవృత్తియై. 34

చ. మదనుని సాటివారు సురమానుషలోకములందు రూపసం
పదలను లేరఁటందు రతిభాగ్యవతీమణియైన రుక్మిణీ
మదవతి కిన్నుతుండనఁగ మానితదివ్యమనోజ్ఞలీలఁ బెం
పొదవెను వానికిన్నను సమున్నతి నవ్విధి గూర్చునేమొకో!

చ. మహినుపమానమై యనుప మానతఁగైకొను వానినివ్వమో
రుహజనిగూర్పఁడేమొ? రతి రూపవతీ రమణీయలీలలక్
విహరణశీలుఁడై యతఁడు వేడుఁకగైకొనఁడేమొ? నన్ను మ
ద్విహితములైన పూర్వజనివిస్తృతపుణ్యములెట్టులుండునో.

వ. ఇవ్విధంబున నవ్విదర్భరత్నగర్భకాంతు కన్యకారత్నం బంత
రంగంబుననె తరంగితప్రేమరసంబునశంబరహారుని నిజమనో
హరునిఁగాఁ గాంక్షించి తద్రూప విలాస సంపచ్చరితంబులు
కర్ణామృతంబులుగా నాకర్ణింపుచుఁ దదాయత్త చిత్తయై
యుండెనంత. 37

ఉ. చెలియలిపెంపుమేనయలు సేమమునామహనీయమూర్తియా
జలరుహనేత్రు వైభవము సమ్మతిఁ జారులు వేడ్కఁ దెల్పఁగా
నెలమి నిజాప్తబాంధవ మహీసుర వర్గముతోడ రుక్మి భూ
వలయ దురంధరుండు విని భాసిలె సమ్మదవార్ధిఁదేలుచు౯

క. తనయభ్యుదయముఁ దెలుపఁగఁ
బనివిని వచ్చిన నిజాప్తబాంధవ తతిచే
విని ప్రద్యుమ్నుఁడు రుక్మవ
తినిగ్గైకొన నాత్మఁదలఁచె ధీరత మెఱయన్.

చ. అటఁ జనివచ్చు నాత్మహితులందుఁ బురోహితపుత్రు నొక్కనిన్
బటువచనప్రభావుఁ బ్రతిభావిభవోజ్జ్వలు నిక్క సుహృత్త్వ సం
ఘటన గుణజ్ఞుని గ్గని వికాస విభాసి ముఖారవింద్ముఁడై
స్ఫుటతరమైన రుక్మవతి పోయగము ల్విసఁ గోరి వేడుకన్. 40

క. ఏమీ యచ్చటి వార్తలు
భూమీసుర యశ్వదర్భ భూపతిరుచిర
క్షేమములెల్లను సుగుణో
ద్దామత నెఱిఁగింపుమనిన ధరణీసురుఁడున్. 41

ఉ. కొంచక వారివార్తలొకకొన్ని వినోదముగాఁగఁ జెల్పి యా
కాంచన గర్భవంశమణి కౌతుకమొప్పఁగ శంబరారితో
నించుక మందహాస ముదయింపఁగ రుక్మవతీమనోజ్ఞ శో
భాంచిత వైఖరుల్మది శుభావహలీల ఘటిల్ల నిట్లనెన్. 42

ఉ. ఓమహనీయ దివ్యమహిమోజ్జ్వల రాజవరేణ్యుఁడైన మీ
మామకు రుక్మిభూపతికి మాన్యతరాకృతి ధన్యయైన క
న్యామణిగల్గె, రుక్మవతి నా ననురూప లసత్సమాఖ్యయై
యేమని చెప్పవచ్చుఁ దరళేక్షణరూపవిలాససంపదల్.

ఉ. తామర చూలి హేమము సుధారసయుక్తి మనోభవప్రతా
పామిత వహ్నికీలల సమగ్రపుటం బొనరించి మార్దవ
శ్రీ మహిమాప్తి నాసతి సృజింపఁగఁబోలును గాక కల్గునే
యామహనీయ కోమలతరంగ విభావిభవాతిరేకముల్. 44

సీ. జలజాస్య తనుకాంతి చపలాకృతి విలాస
మది యిందుముఖి చూపులందుఁగలదు
నవమోహనాంగి నెన్నడుము వింటియొయార
మది నాతి కన్బొమలందుఁగలదు
నలినాక్షి భాసమాన కచభ్రము గతి
యది బాల పాదములందుఁ గలదు
కలికి చన్దోయి యుజ్జ్వల దరి సౌందర్య
మదికన్నె నతనాభియందుఁ గలదు

తే. గీ. బాల కటిచక్రముకలసల్లీల నమరు
నచల సద్వృత్తి నది చెలియరుతఁ గలదు
నెలఁత సొబగెల్ల వెలయించె జలజభవుఁడు
సరస లావణ్య సమగాత్ర సౌష్ఠవమున. 45

చ. అరయఁగఁ బద్మరాగమణులందునఁ బల్లవమార్దవంబు నా
సరసిజ రాగరత్నరుచి సంగతి యాచిగురాకులందుఁ జా
తురి విధి గూర్చినప్పటికిఁ దోయరుహాస్యపదద్వయంబు తా
నరి పరికింప నీను విలసద్గతి గంధనిబంధనంబునన్. 46

గీ. అతను జీవన మొరులిడ నలరు చెంత
తగ నతను జీవనప్రదంబగుట ఘనమ
టంచు వరశాలి గర్భంబు లట్లుగాఁగఁ
దలఁచి యాయింతి జంఘికాకలనఁ దనరు. 47

చ. సకల జగజ్జయాఢ్య జలజాత శరోన్మద భద్ర దంతి హ
స్తకళ ధరించు నాచెలువ చారుతరోరు యుగంబుతోడఁబో
లిక గన నేరమంచుఁ గదళీతరుకాండము లవ్వనిన్ సదో
దక పరిపూరితోదరతఁ దాపసవృత్తి భజించు నెంతయున్.

గీ. అతివ యభివృత్త కటిభావ మవనిచక్ర
మగునో, కాదో, యనెడు సంశయం బదేల ?
మది వితర్కింప నామీఁది మధ్యసీమ
దగ నభంబైన యదియె బోధకముగా దె. 49

మ. పులినంబెంత నదీతలంబునఁ దపస్స్ఫూర్తిన్ విజృంభించినన్
జలసంసర్గముచేత నంతమున కాశ్యంబందుగాకిట్టి సం
వలితోద్యద్వళి వీచికాలలిత లావణ్యస్ఫుర స్నిగ్ధరా
కలితంబై ఘనమైన యింతి జఘనాకారంబు చేకూరునే. 50

క. దరదళదరవిందమొ యా
తరుణీమణి నిమ్న నాభి తద్గత నిర్య
త్సరసమధువ్రత రాజియె
సిరిమెఱయఁగ మెఱుఁగు మీఱు చెలి నూగారున్. 51

క. చెంబులు కుధరంబులుగా
నంబుజభవుఁ డీసుపడిచి యతివకుచంబుల్
గుంభించె ననఁగ నీకుధ
రంబుల దూరస్థ బర్బరంబులు సరియే. 52

క. చెలియ సమున్నతకుచయుగ
మలరెను యౌవనవనాంతరాంచితవీథిన్
నెలకొని వేఁటాడెడు న
వ్వలజేనికి బెదరుజక్కవల కవయనఁగన్. 53

గీ. అమర కాసారబిసముల నతివబాహు
మూల లావణ్యసరసాలవాలసీమ
భుజలతలుగాఁగ, విధినాటబోలుగాక
తుదల కరహేమ బిసరుహాభ్యుదయమెట్లు ? 54

క. కనఁ దనకుఁ దరాభిఖ్యయు
ననయము నతిమెడకు సుందరాభిఖ్యయు గ
ల్గిన వలమురిచిన్నె పె
ద్దనయెననీ సమ్ముఖములఁ దద్దయు మొరయన్. 55

క. మణియనఁగా నుదయద్దిన
మణిబింబమనంగ నద్ద్యుమణిబింబమె కా
కణుమధ్యమోవి కెనయే
మణిబింబము లేక దేశమాత్రాభిఖ్యన్. 56

సీ. సకియపల్కులతోడ సారస్య మొనరింప
నోపక మకరంద మోడిపోయెఁ
గలికి వాఙ్మాధుర్య కలనఁబూనఁగలేక
విమలామృతంబు వెల్వెల్లనయ్యెఁ
బోఁటిమాటల తేటఁ బోలుపుగా నెఱపంగ
లేక యిక్షురసంబు కాఁకపడియె
రమణిమృదూక్తి సారంబునొందఁగలేక
చులకనై శర్కరచూర్ణమయ్యె
ఆ. వె. మధువునూఱడింప సుధకుఁ దెల్విఘటింపఁ
బానకంబు లీయమైనయట్లు
లలమఁ బంచదారతులఁ గూర్పఁ జాలున
ప్పద్మగంధి సరసభాషణములు. 57

మ. సుగుణత్వంబున సౌమనస్యమున సంశోభిల్లి వైరించినన్
నగరే మిమ్ములనంచు కంతుఁడనఁగాంతా భ్రూయుగ వ్యాజధ
ర్మగతిన్ భాసిలువీక్షణాఖ్య మధుప వ్రాతంబుతో సంధికిన్
దగనేఁతెంచిన చంపకం బనఁదగెన్ నారీమణీ నాసయున్.

సీ. తారకాపరమాంచితస్ఫూర్తిఁ జెలువొందె
లలితంపు నీలోత్పలంబులొక్కొ
సరసప్రచార చాతురిమీఱఁ దళుకొత్తె
నరయంగ మీలె యిట్లలరెనొక్కొ

శ్రీ విశ్రుతైకాంత గృహములై విలసిల్లె
భావింప వికసితాబ్జంబులొక్కొ
మదన నిక్షేపసంపదలు దెల్పుచుండె
నలువుమీఱిన ఖంజనంబులొక్కొ

గీ. నిక్కమిన్నిటి నొక్కటే నేర్పుమిగులఁ
గలయఁగూర్చి విధాత యాకలికి నేత్ర
యుగళ మొనరించె నిట్లు గాకుండెనేని
యతను తద్ధర్మశాలులై యలరు టెట్లు. 59

క. శ్రీకారంబులు పావ
ర్ణాకృతి గర్వించి వాదులై రాఁజెలి క
ర్ణాకృతిరానీమిఁ గృతవ
శీకారము లయ్యెనది విచిత్రముగాదే. 60

చ. తిమిరపునైగనిగ్యముల తేటలు కాటుకకప్పు నిగ్గు లిం
ద్రమణి దళోత్కరద్యుతు లుదగ్రతభాసిలు శైవలంబు నం
దమరిన నాఁటికిం దలప నంబురుహాస్య శిరోజపాళి దా
సమతనొసంగదెంతయును సంతతవక్రతమస్వభావయై. 61

సీ. ఘనధను శ్రీభృంగ కనకదర్పణ కచ
భ్రూకర్ణ నయన నాసాకపోల
కుందరత్నదరాబ్జ కోకచందన రదా
ధరకంఠ కరకుచద్వయసుగంధి

ఫణితటిద్వీచికావ ర్తభూరోమాళి
నతతనూవళిమధ్య నాభిజఘన
రంభానిషంగ కూర్మభకిసలగజోరు
జంఘాపదనఖాళి చరణయాన

గీ. యానలిననేత్ర సొబగుల నా ననవిలు
కాని కేకాని యొరులకుఁ గానఁదరమె
దానిఁ గైకొన్నఁగలుగుగదా నిరంత
రాతి సుఖమెన్న శంబరారాతినీకు. 62

చ. త్రిభువనవర్ణనీయ వినుదేవ రయాన తలోదరీమణీ
శుభతరవైఖరుల్ గనిన చొవ్వునఁ జెప్పఁదరంబె యారహా
ళిభవదనూన వీక్షణమిళింద పరంపర లేఁదవే తను
ప్రభవమనోజ్ఞ తామధుర్ఝరంబులనప్పువుఁబోఁడిఁగాంచినన్.

చ. అని వినయంబుమీఱఁగ ధరామరవర్యుఁడు విన్నవించు త
ద్వనజదళేక్షణాగుణ సుధారసగుంభిత సూక్తు లంత తి
య్యనగభజించె శంబరనిశాటవిపాటనుఁడెంత తియ్యఁగా
ననుభవమొందునో సతిరసాయనమూర్తి లభించునత్తఱిన్.

ఉ. నెమ్మది నించితెచ్చి నవనీరజనేత్ర మనోజ్ఞతామృతం
బిమ్ముగసూక్తికాసరణినెంతయు నాధరణీసురేశ్వరుం
డమ్మరుకర్ణరంధ్రముల నానఁగఁజేసిన నంతరంగమున్
గ్రమ్మజనించె నాతనికఖండ విమోహలతాంకురచ్ఛటల్.

క. మునుపట దానతుండై
ననదూపుల విరహిణీజనంబులఁ బీడిం
చిన యఘు మనుభూతముగా
విను మదనుని మనము మోహవివశతఁ జెందెన్. 66

సీ. మను ధర్మగుణములై మ్రోయు తుమ్మెదలెల్ల
శ్రుతివిరుద్ధంబులై చూడఁబడియె
తొల్లిట శుభవాహధూర్వహంబగు కీర
వితతివిక్రమచర్య వివశమయ్యె
మొదలఁ బ్రాణంబులై పొదలుతెమ్మెరలు ప
రాగము లోలయంబై గ్రమ్ముకొనియె
నావిని నిజభృత్యులై మించు కోకిలం
బులు పరభృతములై చెలగఁ కేరె

గీ. నహహ యీరీతియై తగ నాత్మబలమె
తుది విరోధించె విధివశంవదతఁ జెంది
మరుఁడు వలరాయఁడయ్యు రుక్మవతి కలికి
చెలువమొదనంటి వలపులఁ జిక్కినపుడు. 67

సీ. రతినెడఁబాయని రసికశిఖామణి
యనిశంబు రసములం దరతిఁ జెందె
స్వవశాఖిలుండైన వరబలాఢ్యుండొక
యబల చేఁ బారవశ్యంబుఁ జెందె

సరస వాక్చాతుర్య సర్వస్వమహితుండు
విద్యాకలనయందు విసుగుఁ జెందె
నధికసంప్రాప్త మనోభీష్టశాలి యొ
క్కతనుమధ్యనుగోరి వెతలఁ జెందె

గీ. సకల మాయావిహరణ విస్ఫార తేజుఁ
డగుచుఁ దనరారు నంబుజాతాక్షసూతి
ధైర్యమెడలంగ నపుడు సంతత నితాంత
మనసిజ విమోహ మాయానిమగ్నుఁడయ్యె. 68

సీ. అలకృశోదరి నాత్మయందు సంభావింప
గానేమొ నెమ్మేను కార్శ్యమొందె
చంచలాలతికాంగి సౌందర్యమెదలోన
నిలుపఁగానేమొ చంచలతఁ జెందె
ధవళాక్షి ననిశంబు తలఁపున భజియింప
గానేమొ ధావళ్యకళ ధరించె
భ్రమరకుంతలరూపు పలుమాఱుఁ జింతింప
గానేమొ మది భ్రమగతివహించె

గీ. నతఁడు తద్భావనాభావితాంతరంగుఁ
డగుచుఁదగ రుక్మవత్యభిఖ్యాకలన
నలరెఁ బ్రద్యుమ్నుఁడగుటను సార్థవృత్తి
భ్రమర కీటనయప్రకారంబుదోఁప. 69

సీ. చెలు లేమివిన్నవించిన నవి వినురీతిఁ
జెవియొగ్గు నత్తెల్విఁ జెందకుండు
నెవ్వ రీక్షణకాంక్ష నేతెంచి రేనియుఁ
గన్నులుపై వ్రాల్చుఁ గానకుండు
నేభోజ్యములనైన హితులుదెచ్చిన భుజి
యించును దరుచు లెఱుఁగకుండు
నేసుగంధద్రవ్య మిచ్చిన నంది యా
ఘ్రాణించు గంధంబు గాంచకుండు

గీ. హార చందన లేపాదు లమరఁ దాల్చుఁ
గాని తత్సుఖ సంస్పర్శగతిని దెలియఁ
డతఁడు రుక్మవతీశుభాకృతిలసద్వి
శేషగుణచింతనాయత్తచిత్తుఁడగుచు. 70

గీ. ఇటుల మనసిజవేదనాచటులచిత్తుఁ
డైన ప్రద్యుమ్ను నభిమత మఖిలవేది
యగుట నారుక్మిణీమనోహరుఁడు దెలిసి
చిత్త మలర వినోదంబుసేయఁ దలఁచి. 71

చ. మదనునిఁజూచి యుల్లమున మల్లడిఁగొన్నప్రమోదసారమిం
పొదవఁగ మందహాసరసయుక్తముఖాబ్జలసద్వికాస సం
పద పొదలంగ లీలఁ బ్రతివత్సరకార్యవసంతసంభ్రమా
స్పదఘన దివ్యరైవతకశైలవిలాసము లుగ్గడించుచున్. 72

మ. తనయా రైవతకాద్రిఁ గాంచఁదగదే తారాపథాకర్షిశృం
గనికాయప్రతిపన్నకిన్నరసతీగానంబులం దద్వన
ఘ్నన నాదచ్ఛలమర్దళధ్వనుల నాగంధాంధబర్హీంద్ర న
ర్తనలీలావిభవంబులన్ ధరణిభృద్రాజత్వ మింపొందఁగన్.

క. అని జనకుఁ డానతిచ్చిన
మనమునఁ బెనఁగొన్న మోహ మాయాదరణం
బనయము సడల గిరీశునిఁ
గనఁ బ్రద్యుమ్నునికి వేడుకలు దైవారెన్. 74

సీ. రైవతకాద్రియాత్రామహోత్సవ మంచుఁ
జాటించి రారేకుల్ సంభ్రమమున
పంచమహావాద్య చంచద్ధ్వనివ్రాత
మంభోధిగర్జాసిగుంభసరణి
మ్రోయించి రెలమి సద్రూపవారాంగనల్
కమనీయ తౌర్యత్రికప్రసంగ
మంగీకరించి రాహ్లాదంబు మీఱంగ
భూసురాంగన లెల్ల సేసలిడిరి

గీ. నవ్యవైభవ సకలసన్నాహములను
మెఱసి ప్రద్యుమ్నుఁ డురుతరమృదులకనక
చేలమణిభూషణోత్కర కీలితాంగుఁ
డగుచు నగవీక్షణాసక్తిఁ దగిలె నపుడు. 75

చ. హరి బలరాములున్ నిఖిలయాదవముఖ్యులు రుక్మిణీముఖాం
బురుహదళాక్షులున్ హితులుభూసురులున్ జతురంగసైన్యముల్
సిరులలరంగ నొక్కమొగిఁ జెన్నువహింపుచు రాఁగ మూరుఁడ
ప్పురిజనులెన్న రైవతకభూమిధరంబున కేఁగు నయ్యెడన్.

సీ. కనకమయాందోళికాసమూహము లెల్ల
లలితసారస్వతలహరి గాఁగ
గంధగజశ్రేణికా నికాయము లెల్ల
రమణీయ యమునాఝురంబు గాఁగ
వరసితచ్ఛత్ర చామరపరంపర లెల్ల
నమిత గంగాప్రవాహంబు గాఁగ
రంగత్తురంగశతాంగసంఘము లెల్ల
కనదభంగురతరంగములు గాఁగ

గీ. నడచె వేడుక లుప్పొంగ నడరి వాహి
నులు సమగ్రత్రివేణికాకలనఁ జెంది
రైవతకశైలరత్నాకరప్రదేశ
సంగమున కాప్తజనాంతరంగమునకు. 77

మ. అపు డానందితనందనందనకుమారాగ్రేసరుం డ్వాంతరా
శపరీతామరభూజకేళి వనశైలప్రాంతముల్ దాఁటి సా
రపరాగాంచితపుష్పవాసనల నారామాభిరామానిలుం
డుపచారంబులు సేయఁగా నరుగుచో నుద్యత్పురస్తాద్దిశన్.

చ. కనియె హితోపసూచనలఁగన్నులు తిన్నఁగ నున్నతిన్ నమ
న్నినదగభీరనీరధరనీతపరీతఝరీతరంగ గుం
భనకర జృంభణోపచిత పాదసరోజ ముపేతరాజ ధా
మనిధి మణీమయాశ్రయసమాజము రైవతకాద్రిరాజమున్.

క. కని యాహా గిరిసిరి ! యని
మును విని కననట్టి దగుట మోదింపఁగ న
వ్వనజాక్షతనూభవుఁతో
ననె నమ్మహితద్విజుండు హర్ష మెలర్పన్. 80

చ. అది యగు పద్మరాగరుచి రాతతభాగసురాదిధామ మ
ల్లదియె సమగ్రతారకధరాంచితకూటము దానిచెంత ను
న్నది యదె చూడు; హైమసదనప్రతిభాసి శిలోచ్చయంబు స
మ్మదమున దీనిఁగాంచున సమస్తకులాచలదర్శనం బగున్.

చ. అనుపమరూప! కాంచు మహాప్రసరించెఁ బటీరభూజకా
నన విలసత్సరోజసృతనవ్యమరందఝరావగాహముల్
కనకలతామిళత్కదళికావిలసద్ఘనసారసారతే
పనజనతావిమోహములు భాసురరైవతగంధవాహముల్.

క. అనవృతా సుమనస్సార
స్యనిరతసౌరభ్యములను హాళివయస్యా
ఘనసానురాగగతులను
దనరు ధరాగ్రణి సమీరణంబులఁ దెల్పెన్. 83

ఉ. తెమ్మెరజాలుతోఁడ బరతెంచుచు ఘుమ్మనువాసనాసమా
హమ్ములఁ గ్రమ్మ భాసురలతాంతరజోమకరంద బిందుసం
ఘమ్ముల నిమ్ములంగదియు గంధఫలిందవితాన మంతరి
క్షమ్మున నూతనాగమనకందరమావహ మయ్యె నావుడున్.

క. కందరమావహ మిదియన
సందియమేచూడు మచటి జంభారిమణీ
కందరమావహమై గిరి
యందున నిఖిలార్థసముదయము మెఱయంగన్. 85

చ. అనుచు హితావతంసుఁడు ధరాధిప వైభవముల్ వచింప న
వ్వనరుహనేత్రిసూతి యనివారిత మోదరసానుబద్ధుఁడై
యనుపమమయ్యె నగిరి వయస్య మహామహిమానుషక్తి మీ
ఱ నిరత దైవతాగమనిరంతరవాసనలన్ భజింపుచున్. 86

క. చేరువ కరుదెంచితి మని
వారితగతి నద్రిరాజ వైభవములు శృం
గారరసోదారములై
మీఱుచుఁ గనుపట్టెఁజూడుమీ! యనవేడ్కన్. 87

చ. హితవరుఁడట్లు చూచుచు రతీశ్వర! మున్ గనుపట్టకుండియున్
మతిఁ బ్రమదానురాగమున మల్లడి గైకొనఁజేయువాఁడ వీ
యతులమనోజ్ఞమూర్తిఁ గని యద్రివహింపఁడె సానురాగసం
గతిఁ బ్రమదాళిసేవ్యరస గర్భలసత్సుమనః ప్రసన్నతన్. 88

సీ. ప్రతిగజభ్రాంత దుర్వార మదేభదం
తాఘాత జర్జరితాంబుదంబు
కలితోరు రుధిరధీ మిళిత శార్దూలన
తాంత విభావిత ధాతురసము
పల్లవశంకోపపన్న పికత్రోటి
కాలీఢ పద్మరాగాంకురంబు
జంబూఫల విమోహ సంక్రాంత శుకదంశ
నోచ్చలద్ భ్రమరసముత్కరంబు
గీ. లలిత లతికాభవనబుద్ధి విలసమాన
సిద్ధముగ్ధాంగనా సమాశ్లిష్టవివిధ
రత్నకూటవిటంక మీ రైవ తాంక
గిరివతంసంబుఁ గనుఁగొంటె హరికుమార ! 89

వ. మఱియు నుద్దండ వేదండ శుండా దండోత్పాటిత సప్తపర్ణ సమాకీర్ణాభినవ ఘనసారచూర్ణ మేదురిత మకరందరసకర్ద మాలసత్తర సంచరచ్చారణ శోణాధరాచరణకమల విన్యా సకృతాంకంబులగు మణిమయకటక విటంకంబులును, అఖ ర్వగర్వదుర్వారా క్రీశత్రోడ దంష్ట్రాక్రోడీకృత కనక ప్రతాపోద్ధూత రజోవితాన పీతాంబర విద్యోతమాన వియ చ్చరాస్థాన సదనాభోగంబులగు నభ్రంకషశిఖర భాగంబు లును,సముద్దామప్రేమరసావిర్భావ పరవశతా లసదసమయ సుమశరలీలాలోల శబరశాతోదరీ దయితోపభోగాను కూలయవనికావిలంబి బింబాంబుధర పరిచ్ఛన్న ద్వారంబు

లగు దరీకుహరవారంబులును, నిరవధికఫలకిసలయ సుమ రసవిసర నిరంతరపరిసేవారత కీరపరభృత మధుకరోత్కర ముఖరీకృత పనస రసాల కదళీముఖ సరసతరులతాభవనం బులగు బాలపవనోపవనంబులును, గురుతర శఫర మకరికా సందోహాందోళిత సముద్వేలకల్లోల మాలాడోలా ఖేలన్మ రాళీక నాళీక పాళీకలితగభీరపీర మనోహరంబులగు కేళికా సరోవరంబులునుం జెలంగ, నధరీకృత నిఖిలధరా ధురంధర సమాజంబగు నిద్ధరణీధరరాజంబు నిరీక్షింప నరుదై భవ త్ప్రతాపానురూపంబయ్యె, తత్సమయ సమాహృత మహా శాంబర మాయామహితంబై మహితాద్రూప్యసహితం బయ్యె, రత్నాకరమేఖలావిరాజమానంబై విరాజమానవ ద్విగ్రహానుకృతంబయ్యె, ననుభృత హరినితంబాభోగంబై భోగవత్ప్రతిమంబయ్యె,సకమలాధివాసపాదభాసురస్థానంబై సురస్థానోపమానంబయ్యె, లలితాప్సర స్సుమనో ధిపరాగం బై పరాగమహితంబయ్యె నపరాగమహితంబై రజనీకర కాంతప్రదేశంబయ్యె నీరజనికరకాంతప్రదేశంబై వప్రప్ర భాగ స్వచ్ఛఘనసార ప్రసారంబయ్యె నవప్రభాగస్వచ్ఛ ఘనసారప్రసారంబై హారయోగ్యముక్తంబయ్యె, విహార యోగ్యముక్తంబై ముక్తసక్తోభయ జనైకసేవ్యమానంబై యలరుచున్న యది విలోకింపుమని హితవరుండు విన్నవించు సమయంబు నందద్ధరాధర లీలాలోకన కుతూహల ధరుండగు హలధరుండును, అధిగమ్యమానసగవిహారా రామానుభవుం

డగు రామానుభవుండును నఖిలయాదవ పరివారంబుల
నిచ్ఛానుకూలచ్ఛాయా తరుచ్ఛాయ చ్ఛాదితావిచ్ఛిన్నా
చ్ఛ సూనగుచ్ఛ సముచ్చయాలంకృత లతాభవనంబులగు
నుపత్యకోద్యానంబుల విడియించి నర్మసఖులతోడ నవార్య
ధైర్యాహార్యవర్య సంపద్ధుర్యతల వాక్రుచ్చుచు నన్యో
న్యోద్దేశంబున. 90

క. రామున కీగిరి మిక్కిలి
ప్రేమాస్పద మెట్లనంగ రేవతితోడన్
శ్రీమీఱ రైవతనృప
గ్రామణి పోషింపమహిమ గాంచెను గాదే. 91

గీ. అనవిని తనకుఁగాదె యత్యంతమోహ
పద మచలలక్ష్మి రుక్మిణి మదిఁ దలంప
మహిమ నిభ్భ్రామి సత్యభామ హితయగుచు
వెలయు నీమాట చోద్యంబుకలన సుమ్మి. 92

వ. అనుచుఁ జతురవచన రచనల నచలముపయింగల నెనరు
నెఱపుచు, పురోహితాగ్రేసర పురస్సరంబుగా రైవతకు
ధరాధిదైవతోత్సవాస క్త మనస్కులై రంత. 93

మ. రతియున్ రేవతి రుక్మిణీమణియు సత్రాజిత్తనూజాత సం
గతిచేఁ దక్కిన భామినీమణులు వేడ్కల్ మీఱ కేళీసర
స్తతవల్లీగృహావర్తటానుగత చంద్రగ్రావ సోపానసం
తతి రాణించి జలావగాహన రసానందోన్ముఖ స్వాంతలై. 94

గీ. తొడవులన్నియు నెడలించి తురుము లలర
ముడిచి సొబగుల బెడఁగు పెందొడవు గలుగు
నొడలి వలువలు విడిచి పావడలుగట్టి
నడుము లల్లాడ జలకేళి నడరునపుడు. 95

క. కచశైవలముల నయనవి
కచనీలోత్పలముల ముఖకంజాతములన్
విచలద్భుజ బిసలతలన్
బ్రచురితమై కొలనుసతుల బహుమతిఁ గాంచెన్. 96

గీ. అపుడు చందనగంధు లాత్మాంగకలిత
చందనాలేపవాసన సరసి నించి
పద్మసరసపరాగసంబంధి గంధ
కలితలై వెల్వడిరి పద్మగంధు లగుచు. 97

ఉ. తీరము చేరి వేడుకల దివ్యతరాంబరముల్ ధరించి, కా
శ్మీర పటీర సార పరిమేదురితాంగ విలేపనంబులన్
దీరిచి భూషణావళులు నెమ్మెయిఁదాల్చియదూర్వహాంగనా
వారమురై వతోత్సవవప్రమదంబున మీఱు నయ్యెడన్. 98

క. యదుపతి రామరతీశులు
ముద మలరఁగ నాప్తవర్గములతో సిరులన్
బొదలుచుఁ బద్మాకరమునఁ
గదిసి కృతస్నానులగుచు ఘనతరభక్తిన్. 99

మ. వరభేరీపటహాదివాద్యనికరధ్వానంబు లాహార్యకం
దరవక్త్రప్రతిశబ్దగుంభములు నానాదిక్సదంతావళో

త్కరకర్ణ ప్రవిభేదనార్భటులవీఁకఁ బ్రమోదయుక్తై శేంద్రమున్
సిరిమీఱంగ భజించి రుత్సవకళానిర్నిద్రభద్రాత్ములై. 100

సీ. రైవతకధరాధి రాజాగ్రరత్నధా
మంబుల సుమనోరజంబు లూడ్చి
మృగనాభి పన్నీట మెదిచి పూఁతలు వెట్టి
కపురంబు ముగ్గులు కలయఁదీర్చి
వితతంబులగు పట్టువేళ్ళచప్పరముల
నవకిసలయతోరణములు గట్టి
చందనాగరుధూపసౌరభ్యములు నించి
గంధపుష్పాక్షతోత్కరము లునిచి

గీ. చతురపరిచారజనములు సంభ్రమమున
సకల మాయితమయ్యె నర్చనల కనుచు
దెలుప సరసపురోహితదిష్టవిధుల
శౌరి యలరించె దైవతోత్సవము లపుడు. 101

క. యాదవవరు లందఱు న
ర్ఘ్యాదిసముపచారము లుపహారంబులు న
త్యాదరభక్తి నొసంగుచు
నాదేవతఁ గొలిచి రపుడు హర్షమెలర్పన్. 102

చ. వరుసగ నర్చనానతుల వారిజనాభవధూజనంబు లా
దరమున రేవతీసతి ముదంబునఁగొల్చిన వెన్కఁ గేళి నా
సరసిజగంధితోడ మతిసంతతభక్తి భజించి రప్పు డా
ధరణి ధరాధిదేవత నుదారవియచ్చరవారసేవితన్. 103

క. రైవతకోత్సవ మీగతి
భావజజనకుం డొనర్చి బహువిధమణి భూ
షావసుదానము లిడి భూ
దేవసమారాధనములు దీర్పఁగ నంతన్. 104

మ. నగరానీతసువస్తుసంపదలకన్న న్మిక్కి లౌనట్లుగా
నగరాజత్ఫలసారపుష్పరస సంతానంబులంగూర్చి యె
న్నఁగరానట్టి ముదంబుచేనపుడు నానాభక్ష్యభోజ్యాదులన్
నగరాజోత్సవభూరిభోజనములన్ సంతుష్టులై రందఱున్.

క. ఈలీల రైవతోత్సవ
కేళీరతిఁ జెలఁగి రామకృష్ణులు సుతులున్
వేలాతీతవినోదవి
శాలతఁ గొలువుండి ప్రొద్దుజరుపఁగ నంతన్. 106

ఉ. రైవతకాద్రిమీఁద హరిరమ్యవసంతమహోత్సవాయత
శ్రీవెలయింపఁగాంచి సరసీరుహమిత్రుఁడు దాను నట్లు పూ
జావిధిసేయనేఁగుగతిఁ జయ్యనఁ గెం బరాద్రిశృంగసం
భావితరత్నకాంచనవిభాసి సమగ్రవిటంకపాళికిన్. 107

గీ. అంత నంబుజబాంధవుం డపరశైల
శిఖరదుర్గంబు నాక్రమించిన జయంబుఁ
దెలుప నెత్తిన సముదగ్రవిలసదరుణ
పటఘటితకేతనంబనఁ బరఁగె సంధ్య. 108

గీ. సంజకెంజాయపైఁ గొంత జాలువారు
తిమిర మపరాత్రిమణికూటదీధితిపయి
నంబుదము గెల్చి తత్పలాశావనీజ
కుసుమతతిమీఁది తుమ్మెదగుంపుఁ దెగడె. 109

చ. రజనిసరోజగంధి యనురాగరసోన్ముఖశోభ పూని యం
బుజరిపురాకఁ గోరి మదిమోదముఁ జెంది దిశాప్రసాధికా
వ్రజమిడఁ గస్తురి న్ననుపువారఁగ మేననలంది మౌక్తిక
స్రజములుదాల్చెనా నలరె సంతమసస్ఫురదచ్ఛతారకల్.

గీ. అంత తొలిదెల్పుదగె నుదయాద్రిచెంతఁ
జంద్రగర్భంబుదాల్చిన శక్రదిగ్వ
ధూటివదనాంబుజంబునఁ దోఁచు గర్భ
చిహ్నమై పొల్చు పాండిమశ్రీయనంగ. 111

ఉ. సంగతిచే నభంగురభుజాబల మేర్పడ నభ్యసించుచున్
జెంగటివేల్పురాగరిడిఁ జేరి పురందరుపట్టి పట్టి యు
త్తుంగవివృత్త విస్తృతము దుర్భరమై కనుపట్టు కెంపురా
సంగడమెత్తెనానపుడుచంద్రుఁడుదోఁచెనుదూర్పుదిక్కునన్.

చ. తడయక పూర్వదిగ్వనిత తన్గడుపారఁగఁగాంచి శోణితం
బెడలఁగ విన్నువాఁక నటనిమ్ములనారిచి బుగ్గఁజుక్కబొ
ట్టిడెనన శీతరశ్మి యుదయించుతఱింగనుపట్టు పుట్టుఁగెం
పెడలి విపాండుతాంకముల నింపలరార వహించె నతఱిన్.

సీ. తనయురాకకుఁ జాలఁ దనివిచే దుగ్ధాబ్ధి
భువనముల్ నిండ నుప్పొంగె ననఁగఁ
దిమిరసామజదైత్యు సమయించిహరుఁడు దా
నడరించు వికటాట్ట హాసమనఁగ
రాజుతోఁ దారకారాజీవగంధులు
చల్లులాడెడు ఘనసార మనఁగ
యామినీచంద్రకళ్యాణమహోత్సవా
గత దిగ్వధూక్షౌమ కాంతులనఁగ

గీ. నదులు జలధులు గిరులు కాననములెల్ల
నేకహేళినిఁ బాల ముంచెత్తినట్లు
తెల్లమీఱుచు జగములు దేజరిల్ల
నెగడ నవ్వేళఁ బండువెన్నెలలజాలు. 114

శా. హాళిందా ద్విజరాజుగావున సముద్యద్రైవతక్షోణిభృ
త్సాలగ్రామమునందు మాధవున కర్చల్ సేయఁగాఁజంద్రికా
జాలక్షీరయుతాంశు శంఖముఖనిస్రావత్స్ఫురద్ధారలన్
బ్రాలేయద్యుతి కైతవంబుననిడెన్ సాంద్రాభిషేకంబులన్.

క. ఆవేళఁ బండువెన్నెల
భావింపఁగ బట్టపగటి భంగివెలుంగన్
రైవతకాద్రిపయిన్ బల
దేవుఁడు మదిరోపభోగధీయుతుఁ డగుచున్. 116

క. యాదవపరివారములో
నాదరమున వివిధరుచిరహాలా సారా
స్వాదనమునఁ దనరుచు నా
మోదముఁ జెందెను వినోదములు సెలఁగంగన్. 117

సీ. తాళీయసురతోడఁ జాలఁగల్పిన నారి
కేళాసవము లెల్లఁ గ్రోలువారు
నేలారసంబుల నెనయించి రుచినించి
సుమనోరసంబులు జుఱ్ఱువారు
సురుచి మరీచికాచూర్ణాంచిత ఫలర
సావళు లాసక్తిఁ ద్రావువారు
జాతిలవంగకాసారసమ్మిళితాన్య
నానామధువు లాస నానువారు

గీ. నగుచు మనసిజపారవశ్యములఁ జెలఁగి
సకలయాదవ పరివారజనులు వేడ్క
మదకలితలీలల విహారమహిమఁ దగిలి
కెరలుచుండఁగ నారేయి జరుగునంత. 118

ఉ. తూరుపు తెల్లవాఱె ననదూఁపుల వేడిమి తీఱె జారిణీ
జారమనోరథావళులు జాఱె శుకీపిక శాలికార్భటుల్
మీఱె రథాంగదంపతుల మిక్కుటమా వెతలాఱె పద్మినీ
వారము గేరెఁ జందురుఁడు వారుణదిక్తటిఁ జేరెఁ గ్రక్కునన్.

క. కనఁడగెఁ దూరుపుదిక్కున
దినమణి కనదరుణరుచులు తేజరిలంగన్
దినలక్ష్మి ముక్కు ముంగఱ
నొనరిన నవపద్మరాగ మోయన నంతన్. 120

క. తరుణతరకిరణసంతతు
లురుగతి రవివెంటఁ దగిలి యుదయధరిత్రీ
ధరవరము వెడలుకరణిన్
హరితో రైవతముడిగ్గె యాదవబలముల్. 121

గీ. దినముఖోచిత కృత్యముల్ దీర్చి వేగ
సపరివారంబుగా రామసరసిజాక్షు
లెలమిదళుకొత్తఁ బ్రద్యుమ్నుఁ బిలిచి వేడ్క
చెలఁగ నవ్వేళ బంగరుశిబిక లెక్కి. 122

క. భేరీప్రముఖాఖిల వా
ద్యారావములెల్ల భూనభోంతరముల యం
దారూఢి మ్రోయ నప్పుడు
ద్వారవతీపురికి జని రుదారతమెఱయన్. 123

క. కంతుఁడు చెలితోఁ దన య
భ్యంతరసౌధంబుఁ జేరి యారుక్మవతిన్
జింతింపుచుఁ బరవశత వ
సంతారామమునఁ గ్రీడసలుపఁగ నంతన్. 124

శా. కంఖాణేశ్వరసైన్యభంజన జనౌఘస్తుత్య నిత్యోత్సవా
ప్రేంఖద్వైభవమందిరోత్కర కరాభీష్టార్థ విశ్రాణనా
రింఖత్కంకణజాలభాసిత సితశ్రీధూత తారాహిరా
ట్ఛంఖా శృంఖళకీర్తికారణ రణక్ష్మామండలీభైరవా.

క. వార్ధవితరణవిహారా
దుర్ధమచతురంగసైన్య ధూర్వహదరక్ష
న్మార్ధిహశ్వేన్ఖానశిరో
మర్దన చణబాహుసార మహితవిచారా. 126

సుగంధివృత్తం.

భానువంశదీప శీతభానురూప సువ్రతా
పానతప్రకోప నిర్జితారిరాట్కలాప కా
వ్యానుభావధీవరానవావరాసనాస్మరా
మానవాధిపాన్వవాయ మాన్యధన్యజీవనా. 127

గద్య.

ఇది శ్రీలకవరసుమనోగిరిధామ రామచంద్రచరణార
విందమరందాస్వాదన సమాసాదిత నిరవద్య
సాహితీరసవిభావిత కవితాతిరేక రేకపల్లి
సూర్యనారాయణ తనూభవ నిఖిలవిద్వ
త్కవిజనానుగ్రహ సనాథ సోమ
నాథ ప్రణీతంబయిన రుక్మవతీ
పరిణయాభిధాన మహా
ప్రబంధంబునందుఁ
తృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

# రుక్మవతీపరిణయము.



## చతుర్థాశ్వాసము.





శ్రీస్వీయ దర్శనాదృత
భాస్వద్రాజా యసంత భవ్యాశ్రయ వి
ద్యాస్వారస విబుధసన్నుత
భాస్వరగోపాలరాయ పార్థివగేయా. 1

వ. అవధరింపు మజ్జలజాక్షసూతి కథాసుధారసప్రసూతమాధు ర్యానుస్యూతచేతుండగు సూతుండు శౌనకాద్యఖిల ముని వరుల కెఱింగించిన తెఱంగున పాండవకుల మండనుండగుపరీ క్షిన్మహీమండలాఖండలునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

క. సంతతమును గంతునికి వ
సంతుఁడు చెలియౌట నాత్మసఖ్యముఁ దెలుపన్
సంతసమున రుక్మవతీ
కాంతామణిఁగూర్చు మనసు గలవాని బలెన్. 3

చ. చెలఁగి విదర్భరాజపుర సీమ ఘనోపవనోత్కరంబులన్
మలయసమీర సంగతి నమందవిలాసము లుల్లసిల్లఁగా
నలరె రసాల పల్లవ రసాద పికావళి కాకలీస్వనా
కలనల మానినీజనులు కంతువశంవదతం దలిర్పఁగన్. 4

చ. అలరె వసంతవాసర ముదంచిత చంచల చంచరీక సం
చలిత పరాగ భాగవర సౌరభపుష్ప రసాతిశీత స
న్మలయసమీరణాపహృత మన్మథసంగరజశ్రమాంగనా
కలిత పునర్మనోజ్ఞరతికాంత విలాస నితాంత కాంతమై. 5

సీ. ఘనభాసురోద్యాన వనపుష్పమంజరుల్
నిరతంబు పూఁదేనె గురియుచుండ
మధుమత్త మధుకరీ మధుర సంరావముల్
కమనీయముగ గానకలనఁ దెలుప
సురసాల ఫలసార పరిభోగ రుచికీర
నికరంబు నినదంబు నెరపుచుండఁ
జిగురాకు వగరాని జిగిదేరు పికరాజి
పంచమస్వరములఁ బల్కుచుండ

గీ. మంజరీ మంజువంజుల కుంజపుంజ
కంజ సంజాత సౌరభాక్రాంత లలిత
మలయపవమాన శాబకా కలిత చలిత
మానినీ స్వాంతము వసంతమాసమలరె. 6

గీ. అప్పు డంతయు ధరణియం దలరుచుండు
భ్రమరహిత వృత్తి పరిలసద్భవ్య తరుల
సంగ మొప్పారె నాగమసంహితాత్మ
కలనచే మాధవుండు సాక్షాత్కరింప

గీ. హాళి మాధవస్వామి వాహ్యాళి వెడల
లీల వనదేవతలిడు నివాళులనఁగ
నేకహేళిని తరులతానీకములను
గిసలయచ్ఛాయ గనుపట్టె వసమనుహిమ. 8

సీ. తరుణప్రవాళ ఖాదనమత్త పికవీర
భటు లిరువంకల బలసి కొలువఁ
బ్రత్యగ్ర సహకార ఫలసారరుచిఁ గేరు
బలు చిల్కతేజీల బారుచెలఁగ
మకరందరసఝరీ మదవిభ్రమాదభ్ర
సారంగ కరివరచ్ఛటలు దనర
వలి దెమ్మెరల పిల్ల లలరు శతాంగ సం
ఘముల సింగారంపుఁ గలనఁ దోఁపఁ

గీ. చైత్ర సేనానిదళముల జరుప మొనలఁ
దీరి రాజిలు చిగురుల నారసముల
గములఁ గురియింప విరహిసంఘముల మీఁద
నలరి మదనుం డపుడు చైత్రయాత్ర వెడలె. 9

క. విహరత్కీర తురంగ ని
వహములతో నెమరుకొలిపి వరఫల విలస
త్సహకారంబులు మరునికి
సహకారంబులుగఁ జేసెఁ జైత్రుం డెలమిన్. 10

చ. మరుదళవాయియై యలరుమాధవుజృంభణవృత్తిఁజూచి సుం
దరతరసాలముల్ లతలు నవ్యపరస్పర సంగతి న్నిరం
తర సుమనోరసాచుకలనఁ దనరార సచేతనస్ఫుర
త్స్మరసజనంబు మన్మథవశంవదతన్ భజియింపకుండునే.

సీ. వరజీర్ణతరులందు సిరి మీఱఁ బల్లవ
స్తోమ విభ్రమముల సొబగు లమరె
మహనీయ సుమనస్సమాజంబు లందును
భ్రమదాళి సంసేవ్యరసము లలరెఁ
జిరమాని విప్రనికరములందును రతి
కలగళ రవకళాకలన దనరె
లలితాగమసదాగతులయందును బరాగ
వాసనావాప్తులు వలనుమీఱె

గీ. మానినీ లోకభీకర మదనచైత్ర
యాత్ర ననుపమాటోప విహరణలీల
నఖిల శృంగార రసవజ్జనైక శరణ
మహిమఁ జెన్నొందు మధు విజృంభణమునందు. 12

చ. లలిత లతాగృహాంతరములన్ లతకూనలకున్ రహిం బ్రస
క్తలసిత పుష్పయోగము దగన్ మకరంద జలావగాహనం
బలర సమీరణుండు సమయంబున దక్షిణభావమేర్పడన్
దెలుపుచుఁదావులంటుచురతిన్ విహరించుచుమీఱెనామనిన్.

సీ. పరిణతచ్ఛద సముత్కరములకై వడి
నలరుఁబోఁడుల పొలయలుక వెడలె
తరు సమాజము లట్ల సరసుల చిత్తముల్
పల్లవింపుచు రాగభరముఁ జెందె
సూనగుచ్ఛములట్ల సుదతీమనంబులు
వికసించుచు రసార్ద్రవిధముఁబూనె
గంధానిలంబుల గతి వియోగి జనంబు
ప్రమదాళి సంసక్తి పటిమఁ జెందె
గీ. నౌర భువిఁ జేతనాచేతనైకసరణి
జగము లెల్లను మనసిజాజ్ఞా వశంవ
దతను భజియింపఁ జేయు సద్యావరాజ్య
కలిత మహనీయ చైత్రాధికారమునను. 14

వ. ఇవ్విధంబున నఖిలజనమనోహర లీలాకాంతంబును లతాంత సాయకానంతవైభవ నిశాంతంబును నగు వసంతంబు విజృంభించునంత నవ్విదర్భరాజకన్యకారత్నంబగు రుక్మవతికి ప్రబద్యుమ్నాభినివేశితంబైన యంతరంగంబునం దరంగితంబగు మోహాంబునిధి యుద్వేలంబైనలేలాపన యానుకూల లీలారసప్రసంగసంగతి నంగీకరించి, సమంచితోద్యానవనీ విహరణంబు గావింపందలంచి యించువిలుకాని తేజీల జాలనంజాలు నాళీజనాళి మేళంబుగూడి యచ్చేడియందోళ్కాని యీడులేనివేడుకలఁ గలకల నవ్వుచుఁ జిలిబిలి పలుకుల

రొదలుపొదలఁ గదలి కదలికాతరు విసరపరివృత సరస రసాల
ప్రముఖ రసారుహ విలసత్కిసలయ సుమసముదయ ఫలకల
నాభిరామంబగు నారామంబుఁ బ్రవేశించి రంత. 15

సీ. కరములు పల్లవోత్కరములపైఁ గొల్చి
మేనులు లతలతో మేళవించి
దంతకాంతులఁ గుందధావళ్య మెనయించి
చనుఁగవ ననగుత్తులను జయించి
వేణుల మధుకరశ్రేణులఁ గెల్చి వా
తెఱలచే ఫలముల తీరులెంచి
కలగీతములచేతఁ గలకంఠముల హెచ్చి
పలుకులతోఁ దేనెఁ గలయఁగూర్చి

గీ. లలిత సుమనోవితాన సంకలిత సరణిఁ
దగిలి యమ్మానవతులు సంతతలతాంత
సార సందోహముల జీరువారు చాయు
కేళి వనసీమ విహరణ లీలమెఱసి. 16

సీ. కలకంఠి రావమా కలకంఠి రావమా
కర్ణింపుమా యింపు కలిగితనరు
శుకవాణి చూతమా శుకవాణి చూతమా
ఫలితంబుగాఁగదా నెలమిదెల్పు

నలివేణికాంచనా యలివేణికాంచనా
వలిమీఁదఁజేర కావలకునరుగు
మదహంసయాన యమ్మదహంసయాన యు
మ్మమరు తమ్ములయందు నందమందు
గీ. ననుచుఁ గొమ్మలు మదివేడ్కననుచు గొమ్మ
లను మతింపుచు వనసీమలనుమతించి
కలకలనగుచు గమిగూడి కలకల స్వ
నములు వెలయించు నవ్విహంగములఁగనుచు. 17

ఉ. హేమలతా వితానములు హెచ్చరికన్ బఱికించిమించుచున్
గోమలచూతజాతములకున్ దమిడాయుచుఁ గూయుకోకిల
గ్రామముజూచుచున్ జెలులరమ్మనిజమ్మనితుమ్మెదల్వసం
దామరసంపుఁదావిదముఁదార్కొనసాఁగినఁదారుదారుచున్.

క. లేమావి జొంపములలో
లేమావి హరింపవేడ్క లేమాయుతముల్
వేమారు తమ్మిదావుల
వేమారుతువృత్తినంట వీవఁగనెపుడున్. 19

మ. కలికీ చూచితె ప్రాగ్గళాంశుకము చక్కం బాపి పూబంతి గు
బ్బలుపున్నాగ లతాంతనాభికలనల్ బాగొప్పపుప్పొళ్ల తి
ప్పలనిద్దంపుఁ బిఱుందులుంగని వనీపద్మాస్యనమ్మాధవుం
బలరించన్ జెమటల్ మరందములునూర్పా వాయువౌచుండెనున్.

గీ. వనజముఖి ! కను గోపికా వళియె వలసి
యలముకొన రమ్యపల్లవ త్వానుబంధ
మహిమ ననురక్తిదనరంగ మాధవ్రందు
లలితగతిఁదోడఁ దిలకమలంకరించె. 21

భుజంగప్రయాతము.

అభంగాశుకవ్యాళి హాళిన్ వచింపన్
సభోదగ్రసాఫల్య సంప్రత్వశస్తిన్
శుభాంగీ వతంసారుచుల్ మీఱ వృక్షు
ప్రభుస్ఫూర్తి లేమావి భాగ్యోఁగంటే. 22

తోటకవృత్తము.

కలికీ చెలువొప్పఁగఁ గాకలిఁగీ
రలతాంగిని బిల్చి సరాగముగా
నలమెన్ సహకార ఫలాతిరసం
బెలమిన్ శుకరాజులదే కనుమీ. 23

చ. అలసరసాళిసమ్మతి సమస్తసుమంబుల నేలుఁ దోఁ దనుం
దలఁపమి నైజవాసన వృథాగతిఁ జెందెనటంచుఁ జంపకం
బలమిన వంతతోడ వివృతాస్యతి పూని మరందజాలక
చ్ఛలమున బాష్పవారి కణజాలము నించుచు జూచితే చెలీ.

సీ. ఇంపు మీఱెడు పరాగంపు దిప్పలజాలు
జాళువాగద్దెల మేలు దెలుప
మడువులై కనుపట్ట మకరందసారంబు
లలరు కేళాకూళి పొలుపు దెలుపఁ

భ్రమదాళికలనాద పటిమ గాయనికోఘ
మృదుగానకళల సంపదలు దెలుప
నవమరుచ్చాలిత లవలీ లతావళుల్
నర్తకీ జన సమున్నతులు దెలుప

గీ. లీల భవదీయ లలితకేళీవిశాల
శాలికావలి కాస్థాన పాళిఁబోలె
నలరు ద్రాక్షా నికుంజ పుంజాభిరామ
ధామ మీక్షించితే శీతధామ వదన 25

సీ. లకుచంబులివికంటె లలన యీ వనలక్ష్మి
లకుచంబు లనవన్నెలఁ బచరించె
మోవి వీక్షించితే భావింపఁగ వనీల
తాంగి మోవిది యగు నబ్జవదన
తిలకంబు భావించితే చెలి విటపాళి
కెల్లఁదాఁ దిలకమై యింపు దనరె
సహకారమది చూడు చైత్రున కభిమత
సహకారమైయొప్పు జలజగంధి

గీ. పొగడఁ గాంచితె పొలతుక పొగడఁదగిమొ
చెలిమి నగరిది గను బాలసిరుల నగరు
సరళ మిదిచూడు తరులలో సరళ మబల
యంటి కనుగొంటె నాతియనంటి నెలఖి. 26

సీ. గోల నీపద మూనఁ గోరు నశోకంబు
లలన నీ చూడ్కి తిలకము వేఁడు
నింతి నీయనురాగ మెంచుఁ బ్రియాళువు
కొమ్మ నీనుడి కొండగోఁగు పొగడుఁ
గలకంఠి నీముద్దుఁగామించు సంపెంగ
యువిద నీయెదగ్రోవియుండ దిమురు
వనితనీవక్త్రాసవము కేసరము మెచ్చుఁ
బాలఁతి నీ హాసితంబు పొన్న చూచుఁ
గీ. దరుణి వావిలి నీయూర్పుతావిఁ జొక్కు
నతివ లేమావి నీనుకేలంటఁ బెనఁగుఁ
గన్నె యీలీల సుమనఃప్రకాండకలనఁ
దరులె మోహింప నితరుల కరుదె కోర్కె. 27

గీ. అనుచు నీలీల వనిత లవ్వనవిభవముఁ
దెలిపి కొన్నిటిఁ దరువుల నలమికొనుచు
దోహదక్రీడ లలరించి తోయజాక్షి
కెలమి కుసుమాపచయకేళి హెచ్చరించె. 28

ద్విరదగతిరగడ.

కొమ్మనిరిఁ దేనియల కొమ్మయిది యంచుకొన
కమ్మ యీతుమ్మెదల కమ్మనువె జీవనము
లేమావి చిగురుగొన లేమా విజృంభింపు
రామాదరికి వేగ రామాతరులయందుఁ

గొననున్న విరులుగై కొననున్న తివి నిగుడ
మనమేల చేసెదవు మన మేల కీలతలఁ
గడచిగురు తరులందుఁ గడ చిగురు దునుముదము
నడుము గదలఁగ లతల నడుము గదియకె చెలియ
తావులకు నిరవులగు తావులివి గనుఁగొనుము
మోవియిది యానకయె మోవి మాకునఁ గలుగు
పండుగై కొను మరుని పండుగకుఁ బారముగు
నండఁగొని రావేగ నండజాధిప గమన
విరిదేనె మడువులయి విరవి గొన నటువోకు
పరువుగొనదాఫలము పరువుగై కొననేల
రాగపునరేఁచక పరాగమును గనుఁగవల
మూఁగువల్లీడోల ముదిత యూఁగుము లీలఁ
బొన్నవిరి గుత్తులవి పొలఁతి పేరుగ గుత్తుఁ
గన్నియ మొగలిరేకు కమలాస్త్రి బలు బాఁకు
ఇది నీదుకొనగోరె యెనురుకొని వడిఁజీరెఁ
గదిసి యివి మరువంపగములనుచు నుతియింప
పొలుపలరు మల్లికలఁ బుణుకు కరవల్లికలఁ
గలికి మలయుచుఁ దునుము కలికి మాఁకెవ విరుల. 28

కం. అని యిటుల న్ననబోఁడులు
ననవిలుతుని గొలువ నలరు ననగము లెలమిన్.
దునుముచు రుక్మవతి మదిన్
దని వొందఁగ సేయుమణియుఁ దమకమున వనిన్. 30

కమలవిలసితము.

అలరుల మధువుల నలముచు హాళిన్
గిలకిల నగుచును గిసలయపాళిన్
బలుమఱు పరిణత ఫలముల నోలిన్
జెలువుగ గొని మెఱసిరి వనకేళిన్. 31

ఉ. బాలిక యోర్తు దాఁగు సుమపాళులు గైకొను వేళఁ దద్రసా
లోలమిళిందజాలములు లుబ్ధతఁ బైకొనెనో యటంచు ను
ద్వేలభయంబుఁ జెంది కటిదీర్ఘనటన్నిజవేణి మాటికిన్
గేలనదల్చె ముగ్ధత సఖీనివహంబులు గేలిసేయఁగన్. 32

మణిగణనికరము.

కుసుమ ముకుళములు గొన నొక సతి దా
వెసఁ గరములు దమి విసరఁగ నెలమిన్
గిసలయమతిఁగొని కెరలుచుఁ బికముల్
మెసగఁగ బెదరెన్ మెలఁతలు నగఁగన్ 33

ఉ. ఇందునిభాస్యయొక్క తెరహిన్నన గుత్తుల నందవల్లికల్
పొందుగనంటఁ బెన్గుతఱిఁ బుష్పొడు లద్ధరణీతలంబునన్
జెంది కనందగెన్ మరుఁడశేషవశీకృతి సేయఁ జేలముల్
గ్రందుగ దారు నాగయుగళంబు దరిన్బఱపించెనో యనన్.

సుగంధివృత్తము.

చానయొత్తు విస్ఫురద్రసాలపల్లవాళిలోఁ
బూని చంపకప్రసూన పుంజముల్విరాజిలన్
గానమర్చెఁ గాంచనంబు కాంతిమీఱఁ జేయ దీ
ప్తానలంబు లోనఁగాక నంటఁజేయు కైవడిన్. 35

క. తరుణి యొకర్తు కిసలయో
త్కరమెదఁ బొదవుచును లీలఁ దరుణ శిశువునున్
సిరిమెఱయఁగ బాలిండ్లకుఁ
బరపెడు బాలెంతకరణి భాసుర యయ్యెన్. 36

మత్తకోకిల.

మానినీమణులిట్లు వేడుక మందగతిఁ దారుందమిన్
సూనము ల్దునుమంగఁ దేనియ సోనవానలనానుచున్
మేనులంటి పరాగజాలము మేర మీఱిన సారగం
ధానులేపనమై తగన్ వనిహాళిఁగేళి సలీలలై. 37

చ. పలుకుచునవ్వుచుంగనుచుఁబాడుచునెమ్మొగమానుకొంచుగౌఁ
గిలిగదియించుకొంచునుఁగేలుఘటించుచుఁ బ్రాణమిచ్చుచున్
జెలువలరన్ బదంబిడుచు నెమ్మిని వక్త్రరసంబు లిచ్చుచున్
లలితతరావనీజముల నవ్యలసత్సుమనస్సు లంపుచున్. 38

కవిరాజవిరాజితము.

అలమిరివేడుకమోవులఁబ్రోవులనందముమీఱఁగఁదావులఁజె
న్నలరుఫలమ్ములనిమ్మలకొమ్మలహాళిమెయిన్గజనిమ్మల వ

న్నెలసురపొన్నలపుప్పొడితిన్నెలనెమ్మిగమామిడిగున్నల నా
ల్లలదళిపుంజచలద్రసమంజరులం దగుఁపుష్పనికుంజములన్.

ఉ. కప్పురగంధులీకరణి గౌరవమొప్పఁదనర్చు పూవులున్
బుప్పొడులున్మరంద రసపూరము లున్బరువంపుఁ బండులున్
మెప్పులు మీఱఁగైకొనుచు మిక్కిలివేడుక లుప్పతిల్లఁగా
నప్పువుఁబోఁడి కవ్వనవిహారవిలాసము లెచ్చరింపుచున్.

మానిని.

మానిని సూనరసావళు లానుచు మత్తిలితుమ్మెదగుంపులివే
గానముసేయుచుఁ గానన ఖర్వము గానసలంగొన నీయవు సు
మ్మో!నలినాక్షి!పరాకుననంటకుమే మెలమిన్ గొనియిత్తునునీ
కాననవాసన లేనిది మంకెన హాళిగనందకు మిందుముఖీ. 41

చ. మగువ సువర్ణపుష్పముల మందముగాఁగయికొంటివమ్మకెం
జిగురుఁగటారిజోదును భజింపలఁదలంచితొ యాలవేడ్కనిం
పుగ భువనాభిరామ నినుఁ బొందఁదలంచు వరుండె యిట్లుగా
మిగుల సువర్ణపుష్పముల మీనపతాకునిఁ గొల్చెఁగాకిలన్.

తరల.

మొగలిపువ్వసమాంబకార్చన ముఖ్యతంగనదంచునో
మగువ ! గోయవు మానినీజన మానభేదముసేయ నిం
పగుసటంచుఁ గటారిగానది యందువాఁ డసమాంబకుం
డగుచు మీఱఁగఁ బాడియౌనె యనాదరం బొనరింపఁగన్.

వనమయూరము.

రమ్మిచట పుష్పనికరమ్ముల దుమారం
బిమ్ముగ నళిప్రకర మెమ్మెగని రేఁచన్
గ్రమ్మకొనఁ గాంచన ఫలమ్ములనఁ బొల్చున్
గొమ్మ! రఁటిపండు లివి గొమ్ములరుఁబోఁడీ. 44

క. నారంగఫలము లివి లల
నారంగమదే లలితవనాంతరమునఁ జె
న్నారంగ నటనసల్పెడు
నారంగ లతాబ్జలోచనలకుచములనన్ 45

తోటకము. చేడియ కొమ్మ పచేళిమతన్ గన్
దాడిమముల్ప్రసదాడిఫలంబు
ల్వాఁడిగఁ జెందుచు వాడనివౌనా?
యీడలఁ గోరిక యీడలరంగన్ 46

మ. పనసంగంటివె? బాల కంటకములన్ బైఁదాల్చితానంతరం
గనితాంతస్థితసారసన్మధురిమం గానంగనీ దెంతయున్.
దన సద్వాసన గ్రమ్మెింపఁగలదే తర్కింప సద్వాసనా
జనితోత్కర్షములై తనర్చుగుణము ల్సంసేవ్యతన్ గాంచవే.

తోటకము. చిలుకలు గంటఁలు సేయని చూతం
బులు గలిగెన్జెలి పొల్పగు గాఢ్పల్
వలపెడలింపని వన్నెవిరు ల్మే
లలరఁగఁ గంటివె? హాళిచెలంగన్. 48

వ. అనుచు నివ్విధంబున ననేకవిధ ఫలకిసలయ పరాగమధూళి పాళికల హాళిఁగైకొనుతఱిఁ దరులతానీక భవన శుకపికావళికావళి గావింపుచు లతాభవనంబుల డాసియు ఫలంబులగోసియుఁ బూవులంద్రుంచియుఁ దావులన్ మించియు నందంబులం బూనియు మరందంబుల నానియు, రాగంబులఁ జూచియుఁ బరాగంబుల రేఁచియు, నన్యోన్యలీలావిహార చాతుర్యాది వినోదంబులం బచరింపుచు, నమంద స్వేదబిందు సందోహాక్రాంత ముఖేందుబింబలగు నబ్బింబాధరీమణులారామాభిరామ కేళీనితాంత పరిశ్రాంతలై, తామరసము కుసుమాపచయములందగిలి పూఁబోదలం బొదలుచు నద లుప వదలని రోదల నెగసి వగలఁ బొగులుచు, నిమ్మగు వలపిసాళి చెయ్వులం దెలుపుదమనుచుఁ దలంచినవియుంబలె నరిగి యదూరవిశాలసాలావృతాస్థాన సద్మాంతర విరాజమాన పద్మాలయాత్మ భవకంజాత కాండోద్దేశంబునం దేఁటులు మ్రోఁతలిడఁ దత్ప్రేక్షితుండునుం బోలె మలయ సమీరణుం డక్కేళికావనాంతరంబునం దావుల నన్నిఁట నరయుచు నొరసిన ఫలమ్ముల నెరసిన పరాగజాలమ్ముల విరిసిన కుందమ్ముల గురిసిన మరందమ్ముల నరయుచుఁ దమ్ముం జేలాంచలాకర్షణమ్ములఁ బెనంగుగతిం బయ్యెదలు దొలంగ వీవ, నభినందింపుచుఁ దత్ప్రాంతకాంత నిరంతరచ్ఛాయాతరుచ్ఛాయాచ్ఛాదితాచ్ఛతర వారివారి జాకర

విహారాభిలాషలంతరంగంబులందరంగితోత్సాహంబు లుత్పా
డింపుచున్న సమయంబున. 48

క. పాటలగంధులు జిలిబిలి
పాటలగంధేభగతుల భాసురలీలా
పాటవముల నలనలిసి
వాటికిఁ జనిరప్పుడు కేళివశమానసలై. 50

ఉ. అంగనలంతఁ గాంచిరి విహంగమరాజ విరాజమానమున్
భృంగపరంపరావలయ నీలపటీవిలసద్వితానమున్
దుంగతరంగజాలమణితోరణభాసము నిందిరాశుభో
త్తుంగగృహాయమానముల సద్రుచిసూనము నబ్జదానమున్.

మ. కరమొప్పన్నరసీవతంస మపుడక్కాంతామణిశ్రేణికిన్
మదదంతావళశంవదాంబుల నసంబద్ధాత్మమై తత్తహా
సరసాలింగన సత్కృతిన్ నిజలసత్సౌరభ్యము ల్దెప్పెనా
సరసు ల్తుల్యులతో నొనర్పరె మహిన్ సమ్యగ్గృహాకారముల్.

సీ. శశిమణిసోపాన విశదపీఠములందు
నాచాహారంబు మున్నాచరించి
లలితాబ్జదళపాత్రములయందు మధురస
వ్యతికరంబుల వేడ్క నర్ఘ్యమొసఁగి
తటముహుర్ముహుర నుత్కటసమాక్షిప్తోర్మి
కావళికలన పాద్యంబొసంగి

సరస గంధానిలోచ్చలిత విమలవారి
శీకరంబుల నభిషేకమిచ్చి

గీ. సుమరజస్సారగంధంబు లమరఁ జేసి
భ్రమరకల్హారధూపదీపములు వెలయ
రసవదసమామృతోపహారంబొసంగఁ
జెలిమి నాయింతులకు సరసీపురంధ్రి. 53

ఉ. హాళిగభీర నిర్మలతరాశయవృత్తి విరాజమానమై
శ్రీలసమానసారస విశేషవిభూషిత విగ్రహంబునై
లీలఁదనర్చు పావనచరిత్రము దెల్పఁగ సన్నుతించి రా
బాలిక లక్కొలంకురమ భాసురరూపముస్వానురూపమున్.

వ. మరియు సరోవరలక్ష్మీవిలాసమందిరంబులో నరవిందంబుల నమందమకరంద సందోహామిళిన్మిళిందసుందరీబృందమధుర గానరసాకలనకుతూహాల సముత్పతదహినివహా శంకావహా విమల సలిలాంతర్లక్ష్యమాణ బిసనాళపాళికలహాళిఁ గనుంగొనుచు, సరసతరమందగంధవాహుండు తనదాక్షిణ్యంబున ననేకపద్మినులన్ దగిలి పరాగచేలంబులందూలించి వలపుల సొలపులన్గలసి మెలంగుచుం దెలిపిన యసమరసానుభావంబున న్విభావింపుచు, నభంగురతరంగభంగీవిభాగబహూకృతాంబరమణిప్రతిబింబకదంబంబులాంతరాళికరత్నవ్యతికర భ్రమకరంబులై విమలసరోవరస్వరూపంబునకు రత్నాకరతాద్రూప్యబుద్ధి నంకించుట కభినందింపుచుమంజులకంజాత

సంజాతకింజల్కచ్ఛాయాపుంజపింజరితతరంగాంతరసంగతజలావర్తంబుల నిరుపమరాగంబులుసువర్ణపుటుముకుఁబూదెల తెఱంగున మెఱుంగమర, సువర్ణకారకరప్రసాదితంబులగు కారులతీరునంబొలుచు వికటఖేలాంచచ్చంచలజలపతంగచంచూపుట ప్రసారంబుల కబ్బురంబునొందుచు, ననంతరవిద్యోతమాన సూర్యనారాయణుంఉకమలాకరసమాగమం బొనర్చునను యంబున సుమనస్సముదయంబులుల్లసిల్ల వారిమధ్యంబున జలదేవతాచిరంటీనికాయంబు లాత్మబిసవిలసద్భుజాప్రసారంబులంబట్టినతైలపూరప్రదీపిత దీపరాజివిరాజమానకనకదీపికాపాత్రంబుల సొంపుపంపాదించు నమందమకరందరసనిష్యందసుందరకేసరవిసరపరిస్ఫురదరుణారవిందంబుల యందంబులకుం డెందంబుల నానందంబు నొందుచు, మఱియుఁగమలకల్హారప్రముఖ నానాకుసుమవితానవినిస్రుతనిరంతరపరాగవిచిత్ర పట్టాంబరాస్తరణ సముదితపరభాగప్రకాశంబై, సరోజశరాస్థానప్రదేశం బనంజాలు నాసరోవరంబు హంసవరణ విన్యాసప్రకాశితాంతరసరోరుహపరంపరాభిరామంబై పావనమోగప్రకటితసౌరభ్యంబును, అనిమిషాధివాసంబై కవిరాజవిరాజమానంబును స్వచ్ఛతరగీతామృతప్రబంధంబై పశ్యజ్జనాత్మప్రతీపాదకంబును, ఇందుశేఖరమందిరంబు చందంబున భృంగిరితసంగీతానుషంగంబును హిమశైలశిఖరంబుకైవడి ననంతవాహినీకలితంబును, భ్రమర

హితంబయ్యు ననేకభ్రమసహితంబును, అప్రసిద్ధంబయ్యు భువనజాతప్రసిద్ధంబునై మనోహరంబగుచున్న నన్నులు షండమ్ముగా నవలోకించి, యుదంచితగతి నచ్చంచలాతనూ విలాసలు తదీయజలఖేలనలాలసమానసలగుచు నంత. 55

చ. వలపుల రేనిగన్న యని వాసిత భాగ్యవతీలలామయా
నల సిరిపుట్టినిల్లిది విహాయసమధ్యమలార ! వేడ్క నీ
కొలని భజింతుమేని మనకున్ గమలాతిరసప్రసన్నమం
జులహరిసేవగల్గునని సొంపులుమీఱఁ దటాంచలంబులన్.

చ. నిలిచి తనూలతాంచిత మణీమయభూషణ చిత్రచేలముల్
నిలిపి మెఱుంగురుంగలరు నిద్దపుఁబావడ లందగించి మే
ల్కలికిమిటారిగుబ్బల భరంబున మధ్య మముల్లలింపగా
జలకములాడ డిగ్గిరొగిచన్యనఁ గ్రొన్నెలరాతిమెట్టులన్.

క. నెలతలు కిలకిలనవ్వుల
జలముల నొక రొకరిమీఁద జల్లుకొనుచు రొ
మ్ముల బంటినీటిలోపలఁ
జెలువమరఁగ నోలలాడఁ జెలరేఁగు తఱిన్. 58

క. ఓలలన ! యోల యనియొక
బాలిక వడినీటఁ గ్రుంకి పద్మాటవిలోఁ
దేలిన దన్ముఖ మలరెను
నాళీకానన్యమగుచు నారులుభ్రమయన్. 59

చ. ఒకచెలి నీటఁ గ్రుంకిడి సమున్నమితాననబింబయై సిరుల్
ప్రకటముగాఁగ నీఁదుతఱి బంభరపాళి సరోజశంక మీఁ
దికిఁ గదియంగఁ గేలుఁగవ ద్రిప్పిన నంబురుహాంతరభ్రమా
భికలనచేఁ దొలంగమికి భీతిమునుంగుచుఁ దేలె దవ్వులన్.

ఉ. శ్యామ యురోజదఘ్న జలసంగతిఁ గేళియొనర్పఁ దద్వికీ
ర్ణామలకేశపాశరుచులంటి సరోజములొప్పెఁ బద్మినుల్
శ్రీమహనీయసౌరభవిశేషములన్ సరిగామి వారినె
మ్మోములఁ జూచి వ్రీడఁదమమోములశ్యామికఁ బూనెనోయనన్.

చ. జలరుహగంధులీకరణి సంతసమొప్ప జలావగాహలీ
లలఁ జెలువొంది పోదము విలాసినులార! పయోజబాంధవుం
డలరె హుటాహుటిం దరలె నంబరమధ్యము సూనసాయకుం
గొలువఁగ వేళయయ్యె నని గొబ్బునఁ దీరము చేరి వేడుకన్.

చ. ధగధగ కాంతులంతట నుదారతమీఱ విచిత్రచేలముల్
జిగిబిగి సోయగంబులను జెల్వగు మేనుల నందగించి ము
జ్జగములు గెల్వ మన్మథుఁడు సానలదీర్చి నిశాతశస్త్రముల్
తగవణి చిత్రకోశములఁ దార్చినవైఖరి దోఁప నత్తఱిన్. 63

చ. మదనుఁడు ప్రోదిసేయ మహిమందనరారిన కొమ్మలాట నీ
యదనునఁ బల్లవింపఁ దగునంచు వయోమధువంతరక్తి నిం
పొదవఁ జిగుర్పఁ జేసెనన నొప్పుగ హేమవిభూషణావళు
ల్మదమునఁ దాల్చిరింతులు సముత్కటనూనశరార్చనాదృతిన్.

చ. అలరుల గంధము ల్చిగురు రాయితపెట్టి మరందసారస
ద్ఫలరుచిరోపహారములు బాగుగఁగూర్చి మనోభవార్చన
మ్మొలకరుదెంచటంచుఁదముమోదముమీఱఁగఁబిల్చుకై వడిన్
బలుకుశుకీపికావళుల పట్టగు నొక్క నికుంజ వాటికిన్. 65

వ. చేః తదంతరసీమ నామూలాగ్రకుసుమితాభిరామ హేమ
మల్లికా మాలతీ వాసంతికా ప్రముఖనిఖిల లతావితానా
త్మక పరస్పర నిరంతరాను కీర్ణోపరితలంబు వివిధమణిమా
లికాలంకృతంబగు విచిత్ర వితానంపుసొంపున నింపుమీఱు
నితాంతకాంత ప్రాంతమూలంబుల నంతరాంత రాంకురితం
బులగు లేమావిలతకూనల నూనపద్మరాగదీపకళికల కళల
లీలలు వెలయింప, నవిదూర పరితః పరిస్ఫుతత్ప్రత్తచ్ఛద
కదళికాతరునిసరవినిస్రుత పరివ్యాప్తఘనసారచూర్ణంబులు
విమలపరిశ్వేతపట్టాంబరాస్తరణంబుల డంబొనరింపనవిరళ
శుకపిక ప్రముఖద్విజ కులారావంబుల భంగురోత్సవాను
కూలమంగళ శాసనంబుల విలాసంబులందియు సాక్షాద్వన
దేవతాకల్పితేందిరానందనార్చనామందిరంబుచందంబుదనం
దనబగు నొక్క లతాభవంతికయం దధివసించితత్రత్యవిచిత్ర
తరలతాంతంబుల సింహాసనంబు గావించియందుమనోభవు
నావాహించి, సుప్రసన్నహృదయలై. 66

చ. మదవతులార యీరమణి మానసముం బెనఁగొన్నయిష్టసం
పదలు ఘటింప నీమరుని బ్రార్థనసేయుదమంచు భక్తినిం

పొదవఁగ ధ్యానసంగతి సముస్మిషదంబుజపత్రనేత్రలై
ముదమునహస్తతామరసముల్ ముకుళింపుచు మ్రొక్కి వేడుకన్.

సీ. ధ్యానమాగమవచోమాన సాగోచర
మహనీయ రూపసంపద్వహాయ
ఆవాహనమశేష జీవచేతస్స్థలీ
విహరణలీలాభి విలసితాయ
అర్ఘ్యమనర్ఘ్య శీలాభినందితకృపా
రసపూరితేక్షణ ప్రసరణాయ
అభిషేచనముదార విభవలోకత్రయ
రక్షణకార్య విచక్షణాయ

గీ. గంధపుష్పాణి లలితకాంత కాయ్మకాయ
సురభిధూపోభినుత గుణపరిమళాయ
రమ్యదీపోయ మోజోవిరాజితాయ
మధురసఫలోపహారోయ మధురసాయ. 68

క. అన్నుచు నుపచారసంగతు
లొనరింపుచు భక్తిఁగొలిచి యుత్కలికఁ బునః
పునరభివాదన పరలై
వనితలు ప్రార్థించి రపుడు వారిజబాణున్. 69

క. జగదేకపూజ్య నీకున్
మగువల మిడుచిగురు విరులమందమె సారం
గగుణుఁడవగు నీవయిం
పుగఁదగు నాళీకధర్మమునఁ గైకొనఁగన్. 70

సీ. అళివేణిఁ బ్రోవుమీ యళిజాలసద్గుణ
జలజాక్షిఁ బ్రోవుమీ జలజబాణ
కలకంఠిఁ బ్రోవుమీ కలకంఠపరివార
శుకవాణిఁ బ్రోవుమీ శుకతురంగ
కుసుమాంగిఁ బ్రోవుమీ కుసుమకల్పితచాప
హరిమధ్యఁ బ్రోవుమీ హరితనూజ
మదవతిఁ బ్రోవుమీ మదహంసపరిసేవ్య
చంద్రాస్యఁ బ్రోవుమీ చంద్రసచివ
గీ. కిసలయాధరఁ బ్రోవుమీ కిసలయాస్త్ర
మానినీమణిఁ బ్రోవుమీ మానమథన
ఘనగుణాఢ్యను బ్రోవుమీ ఘనసవర్ణ
రుక్మినృపకన్యఁ బ్రోవుమీ రుక్మవసన. 71

వ. అని యిట్లు ప్రార్థించి యుత్సవాంతం బొనరించి మదనదేవతా ప్రసాదరసానుభవ మంజుల మనఃకంజాతలగు సజ్జాతరూప తనూవిలాసలు రాజకుమారికారత్నంబు ప్రయత్నంబున నుపాంతకాంత వసంతోపవనంబగు విహారభవనంబునకుం దోడ్కొని వచ్చు నవసరంబున. 72

చ. సమయసమాఖ్యుఁ డంబురుహశాత్రవకింకరుఁ డుద్ధతిన్ మహా
ద్యమగతి వచ్చి తత్కువలయంబుల నుగ్రకరానుషక్తిఁ దా
పము భజియింపఁ జేసి యరి పంక్తులఁ బెంచిన నేరమెచ్చుచున్
ద్యుమణిని నేలమాలియను ద్రోచె ననందగెఁ బ్రొద్దు గ్రుంకినన్.

గీ. యామినీ మదగజయాన యాన వడసి
సమయపటరంజకుఁడు తదీయ మహితాంబ
రమున కనురాగరంజనం బమరఁ జేసె
ననఁగఁ దగె రక్త సంధ్యాభమగుచు సంధ్య. 74

క. వియ దురుసరసీ సీమన
మయుజాలకుఁ డుదయ దృష్టమయ మీనములన్
గయికొనఁగ నీల జాలము
రయమున వైచెననఁ దమము ప్రసరించె వడిన్. 75

గీ. తారకలు మీఱె రేనెలంతను బ్రగ
హింప శశివరుఁ డరుదెంచు నెడ దిశాపు
రంధ్రు లపు డుప్పరపుఁ జప్పరంబునందుఁ
గూర్చి కట్టిన ముత్యాలగుత్తులనఁగ. 76

క. వలరాజు విరహిజనముల
నలయింపఁగ దాడివెడలు నపుడెత్తిన యు
ల్లలితపతాకాగ్రమునన
తులిత మకరశోభయనఁగఁ దొలి తెలుపలరెన్. 77

గీ. అంత నుదయాద్రి యను భద్రదంతి నెక్కి
రూఢిగను రాజుముందర రోచులనెడు
వెండి చుట్టీలె మొనలచే విఱుగఁబొడిచి
యిరులఁ దఱిమి కిరణ బలం బెంసె దివిని. 78

క. కైరవిణీ విటుఁడు దిశా
వారసతీచయముపైని వలపొలయఁగ గ
ర్వారరజమ్ములఁ జిమ్మెరు
నారహిం వెన్నెలలు దనరె నవ్యప్రభలన్. 79

సీ. కొండలన్నియు వెండి కొండలై యలరారెఁ
దీవులన్నియుఁ దెలిదీవు లయ్యె
ఖగములన్నియు హంసఖగములై తెలివొందె
నేఱులన్నియును మిన్నేఱులయ్యె
జలధులన్నియు సుధాజలధులై విలసిల్లె
రసములన్నియు పాదరసములయ్యెఁ
విరులన్నియును మల్లెవిరుల యందమునొందెఁ
దరువులన్నియు దేవతరువులయ్యె
గీ. నప్పు డుద్వేల భువనపర్యాప్తగాఢ
సంతమస వాశి నిచయసంక్షాళకాచ్ఛ
సాంద్రచంద్రప్రభామృతసారపూర
నవకలితసమ్యగవగాహనమ్ము లగుచు. 80

వ. ఈ లీల లలితజలజభవాండకలశంబునకున్ గలాయిం బొన
రించిన పొలుపు వెలయించు నప్పుడు వెన్నెలలు గాయించు
కలువలచెలి జగతి నఖిల విరహులంగలంగింపుచు నిజవిహార
భవనప్రాంతంబునకుం డాసి జాలక మార్గంబుల నలరు విలు

తుని పుంఖానుపుంఖ పరిక్షిప్త మల్లికాకుసుమ శరపరంపర లనం జొనుపు కిరణజాలంబున హృదయాంతరమదనతాపాన లంబు దీపింప సహింపరాని వేదనవిదర్భరాజ తనయ తన యనుంగుచెలులంగనుమొఱంగికురంగటంగరంగుచు మొఱుం గమరు కురంగభృన్మణి మయ వేదికా తలంబున మేనుజేర్చి పొరలుచు నప్పరిసరంబున నొప్పగు గొప్పకప్పురపుటనఁటుల నుప్పతిల్లు కప్పురపు సుమారంపు వలపు లోలయించు మల యానిలుని కలనలకునులికిపడి లేచి రాఁజిల్కతేజీల హేషా రవంబులకుం గలకంఠ వరవీరభటహుంకారంబులకు సహం కారంబు దెచ్చుకొని మచ్చరంబునన్దనపయిదండెత్తివచ్చిన పచ్చవిల్తుబలంబులవేలంబిడి గదిసెద నటమీఁద నెట్టులైనం జక్కనయని తెగువసేసిన యఱియుంబలె నవ్వాలి నిలదోపవ నాంతరంబునకునడువ నడుగులిడు నయ్యెడనడరి త్రోడిచేడియ లందంద నరసి విఱిసి విప్పలరు కప్పురపుతిప్పల నొప్పు మిగులు చరణకిసలయ విన్యాసంబుల చొప్పున నప్పువుఁ బోఁడిం గప్పునం గవయుచు. 81

క. అవునమ్మ చెలియ యెంతటి
జవరాలవె యెంటి నిటకు సాహసమునరాఁ
జివురున్ గత్తుల బోనిది
గవయుదురే యెట్టివెడఁగుగబ్బితలైనన్. 82

చ. అదయుఁడు పాంథలోకనిచయాంతకుఁడీవలరాజు వానినె
మ్మది కనుకూలు రీపవనమాధవచంద్రులు నమ్మఁగొల్చినా
ట్టిదళము కీరకోకిలమిళిందము లీవ బలావతంసవై
యెదుటి బలంబు నాత్మబలమెంచక యిట్లరుదెంతువే సఖి.

క. అని దూతి వనిత లెంతయుఁ
గనికరమునఁ జెలియ తాపకలనలకును దా
మును వేఁగుచు వినువీథిని
మొనకొను శశియుగ్రకిరణముల గోరువకన్. 84

క. చెలి కలువగంటి యనుచున్
గలువల చెలివయ్యునేల కానవు చంద్రా
తలఁపఁ గళాగతివాఁడవు
నిలుకడ నెనరుండ నేర్చునే నీకెందున్. 85

చ. కడు సుమనఃప్రకాండకునిఁ గాలనిగాఁగనె గాని శూలి నీ
గడుసుఁదనంబు గానఁబడుఁ గానఁడు గాగడు గాయచంద్రహా
యుడుకులు వోసికొందురఁట రోఁటు గోయుట రోసులేదు నీ
కడలుచుఁ దండ్రియార్పుగదరాయడె రామదిరాక్షి నేతురా.

క. అనిచందురు నిందింపుచు
ననదూపుల గములఁ గుములనాటించి సతిన్
మని కితమందించిన యల
మనసిజుపైఁ గదలుకొన్న మచ్చరమలరన్. 87

సీ. నీతల్లి దైవతజాత జీవనదుఁడై
నలసుధావారాశి యాత్మజాత
నీతండ్రి వితతవిఖ్యాతి భక్తావదు
ద్ధారకుండగు జగత్కారణుండు
నీయన్న సంతతామ్నాయముల్ సృజియించు
నవ మతి శాలియైన పరమేష్ఠి
నీమేనమామ సన్నిహిత దరస్ఫూర్తి
సిరిమించు సర్వజ్ఞ శేఖరుండు

గీ. సరవి నీరీతి నుత్తమసంప్రదాయ
రూఢివై యుండి వంశవిరుద్ధధర్మ
ముత్పలాశుగతాదరోద్యుక్తి పూని
భీరువుల నేఁచు టేమేర క్రూరమార. 88

చ. మునుపె యరూపభూతమవుమూర్ఖతనమ్మున వెన్కఁబల్మిచేఁ
దనువుదొలంగి భూతమగు దర్పకుసంగతిఁ జెందుచుం బ్రకం
పనయబలాజనంబులను బాధలఁబెట్టెద వింతె కాని ని
న్నొనర నిరోధపెట్టు బలుమోగుల చెంతకుఁ జేర లేవుగా. 89

క. అనయము ననలముతోఁ బొం
దొనరింపఁగఁ బుట్టినట్టి యుగ్రుని నిన్నున్
జనునె జగత్ప్రాణుండనఁ
గ నయో యబలాజనప్రకంపన పవనా. 90

మ. అని నిందించెడు మానినీమణుల సాహంకారవాక్యంబులన్
విని రోషంబున గంటఁగింపు దవరన్ విస్ఫూర్తి నాత్మేశుతో
నొనరం దెల్పుగతిం బికాళి పలుక న్యోషావతంసంబు నె
మ్మనమత్యంతములీలమూర్ఛఘటిల్లం బ్రవ్రాలెఁ బూసెజ్జపై.

క. అపుడాళీజనములయో
కపటాత్ముఁడు మదనుఁడనుచు గణుతింపక మే
మపరిమితభక్తి నొసఁగిన
యుపచర్యల కిట్టి ఫలము నొందితి మిచటన్. 91

క. అనుచున్ గలకం జెందఁగ
బని లేదికఁ జివురుసెజ్జపై నిడి వేగం
బున జలువయొలరుపనులను
మనుపఁగవలెఁ జెలియనని, యమందోద్యమలై. 92

సీ. కలువరేకులఁ గన్నుఁగవ దాల్చె నొక్కతె
చిగురుఁగెమ్మోవిపైఁ జేర్చె నొకతె
అఱుతముక్తాహార మలరించె నొక్కతె
బిసముల భుజపాళిఁ బెనచె నొకతె
కేలఁ గ్రొందమ్ములు గీలించె నొక్కతె
చందనంబలఁదెఁ గుచములనొకతె
పన్నీరు నెమ్మేనిపైఁ జల్లె నొక్కతె
పదములఁ బుప్పొడుల్ పొదివె నొకతె.

గీ. మల్లెరేకుల యుపధ యమర్చె నొకతె
విమలతరతాళవృంతంబు విసరె నొకతె
పచ్చకప్పురంపు వాసనలిచ్చె నొకతె
లలితమృదువాక్సుధాధారఁ దెలిపె నొకతె. 94

క. ఈలీల ననుఁగుఁ జెలియలు
బాలికఁ దెప్పిరిలఁ జేసి భాసురశుభవా
ర్తాలాపకలనల చే
లాలసదతి నిపుణసరణి లాలించుతఱిన్. 95

చ. సరసిజినీ ధరాత్మభవ చంద్రదశాననుచెంత నుత్పలా
దరణసుగంధవృత్తిఁగని తాపముఁజెంది కృశించుచున్న య
త్తఱి సమయాంజనాసుతుఁ డుదారతరేవ కరాంగుళీమణి
స్ఫురదురుముద్రఁ దెచ్చెననఁ బొల్చెను వేగువచుక్క తూర్పునన్.

మ. తననాథుండపరాశ జెందెనని సంతాపంబునన్ యామినీ
వనజాక్షీమణి హైమశీకరలవవ్యాజచ్ఛలాశ్రుచ్ఛటల్
కన దిందీవరలోచనాంచలములన్ గన్పట్ట నిట్టూర్పువు
చ్చెను నాఁ దెమ్మెరలుల్లసిల్లె జలజశ్రీగంధవాహంబులై. 97

శా. వేళావల్లవి యబ్జజాండమనులోవిస్సాంద్రచంద్రప్రభా
జాలోద్వేల దధిన్ మథించు తఱిఁ దత్సారంబు లేచెంతకున్
లీలన్ రాఘటియుంచె నాసపుడు నాళీకారి మిన్నేకనన్
ప్రాలెం బల్చఁగనయ్యెఁ దన్మథితతక్రస్ఫూర్తి నవ్వెన్నెలల్.

గీ. అంత రహిఁ డించెఁ దారక లంబుజారి
యామినీకాంత గదిసిరతాంతవేళ
లలితగతి డిగ్గ గగనతల్పంబువంక
మిగులనలఁగిన పుష్పాల మెలపుదోఁప. 99

శా. వీడెన్ పాండురచంద్రికానికరముల్ వెల్వెల్లనయ్యెన్ దిశల్
వాడెం గైరవజాలముల్ మధుకరీవారంబు లత్యంతమున్
బాడెం గానకళావిజృంభణగతిన్ బద్మాటవీసీమలన్
జూడంజూడఁగఁ జేరెఁ జంద్రుఁడు పరక్షోణీధరోపాంతమున్.

చ. కమలిని యుల్లసిల్లఁ ద్రిజగంబుల వేఁకువ పిక్కటిల్ల న
క్కుముదిని దల్లడిల్ల మదకోకిల కీరమయూర నాదముల్
క్రమమునఁ దేజరిల్ల వల రాయనిహుంకృతి సన్నగిల్ల నిం
పమరఁగఁ గమ్మదెమ్మెరలయందములల్లఁ బ్రభాత మొప్పగన్.

గీ. శశినిశాచర మోహితాబ్జ హరిసైన్య
వితతివెలయింప సమయ మారుతసుతుండు
దీపితౌషధి శైలంబుఁ దెచ్చెననఁగ
నుదయగిరిచెంత భానుఁ డభ్యుదయమందె. 102

శా. విశ్వక్షోణి వరాప్పితద్విపఘటావిఖ్యాతదానాబ్ధీ
విశ్వాసోపగతస్వరేఫనివద ద్వేశోత్తమాస్థాన స
త్రాశ్వాగ్ని ప్రతియానితేజ జనతాపాశేషనిర్వాపకృ
చ్ఛశ్వత్సత్య వరాభిధానకపురీసౌభాగ్యకందాయితా. 103

క. మాన్యాగ్రేసర భవ్యాం
కన్యకృత నిఖిలరాజ కవిజననయనా
నన్యవిధేయానంద వ
దాన్యకృతి ప్రవణముఖసుధాకరబింబా. 104

క. మోహనవసుధాదాన దు
రూహాతిక్రమణ సాహసోద్యమ భాగా
జీహుల్శైనతనూభవ
రాహుశిరశ్ఛేది చక్రరాజిత హస్తా.

లయగ్రాహి.

అర్యమకులాభరణ సూర్యవనసాదరణ
శౌర్యనిటలాక్షయనివార్య రిపుశిక్షా
కార్య పరతంత్రనృప వర్యనుతమంత్ర
యవధార్యగుణజాల శుభచర్య ఘనలీలా
స్థైర్య జితభూరి ధరనార్యభిదవాజ్ఞ శర
హార్యమితరామ చరితార్యకల నామా
ధుర్యరసపోషణ విహార్యధిక భాషణ
యనార్యజనదూర కృతిధుర్యనుతశౌరీ. 105

గద్య.

ఇది శ్రీ లకవరసుమనోగిరిధామ రామచంద్రచరణార
విందమరందాస్వాదన సమాసాదిత నిరవద్య
సాహితీరసవిభావిత కవితాతిరేక రేకపల్లి
సూర్యనారాయణ తనూభవ సకలవిద్వ
త్కవిజనానుగ్రహ సనాథ సోమ
నాథ ప్రణీతంబయిన రుక్మవతీ
పరిణయాభిధాన మహా
ప్రబంధంబునందు
చతుర్థాశ్వాసము.

---

శ్రీరస్తు.

# రుక్మవతీపరిణయము.

## పంచమాశ్వాసము.



శ్రీరమణీరమణపదాం
భోరుహభృంగాంతరంగభోగజితసునా
సీరా సూరినికరమం
దారా గోపాలరాయ నరవరగేయా. 1

వ. అవధరింపు మారుక్మవతీ పరిణయకథాసుధారసప్రసూత మాధుర్యానుస్యూత చేతుండగు సూతుండు శౌనకాద్యఖిల మునివరుల కెఱింగించిన తెఱంగున నప్పాండవకులమండనుండగు పరీక్షన్మహీమండలాఖండలునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 2

ఉ. అంత విదర్భభూమివరుఁ డాత్మహిత ప్రకరంబుతోడ న
భ్యంతరసీమ మంతనమునందు ప్రసంగముఁ దెచ్చి మత్కులం
బెంతయు దేజరిల్ల జనియించిన పుత్త్రిక బొమ్మ పెండ్లికిం
గాంతుని జూడఁగావలయుఁ గావున నెట్లు విచారసంగతుల్.

ఉ. భాను సుధాంశువంశ భవ భాసితముఖ్యనృపాలమండలిన్
భూనుత చర్యుఁడైన పరిపూర్ణవిలాసకళాధురీణునిన్
మానవతీవతంసమగు మద్వరపుత్త్రికి సర్హయోగ మిం
పానఁగ నెంచుఁడీ ధర నుదారవిచారులు మీరలందఱున్. 4

సీ. లాలితజగదేక లావణ్యశాలిని
గన్యకారత్నంబు గాంక్ష సేయు
సముదగ్రవైభవాప్తుం డైన వరునకుం
దనయ నర్పింపంగాం దలంచుజనని
సకలవిద్యాతత్త్వపారజ్ఞుతో నాత్మ
భవంగూర్పం దండ్రి సంభ్రమము నెందు
ఘనసత్కులప్రసూతునికిం గన్యకనీయ
నభిమతింతురు బాంధవాప్తజనులు

గీ. జగతి నీరీతిగలదు విచారకలన
నామనం బిట్టి సకలగుణంబులొగిని
గలిగి తగియున్నచోటుగాం గాంచి ముద్దు
గుమ్మ నొసంగంగం గోర్కెలు కొనలుసాగు. 5

క. నెరవుగ సకలగుణంబుల
ధరణీందన సమతగలిగి తగియుండినచో
టరసి కుమారిక నిచ్చిన
సిరిమెరయునటండ్రుగాదె ? చేకొని తద్జ్ఞల్. 6

చ. అనవిని బాంధవాప్తజను లాదరవిస్ఫురితాంతరంగతన్
జనపతితోడ నిట్లనిరి సజ్జనకర్ణరసాయనంబు మీ
ఘనతరవాక్సుధారసము గాంచంగ నిట్టి గుణోత్తమంబులన్
గనందగు రాజనందనుండు గల్గుటభాగ్యముగాదె భూవరా !

చ. జలజభవానుకూల్య మెటు చక్కఁగ నున్నదొ కాని, మామతం
బలరును గన్నె కెద్ది ప్రియ మట్టిదె; నల్పిన రూపమున్నచోఁ
గలుగు సమస్తసద్గుణనికాయము; దీనికి సాక్షిగాఁగ ని
ర్మలమతి నీదుచెల్లెలికి మారుని మారునిఁ జూడు భూవరా!

గీ. రుక్మవతికన్య నెమ్మది రూఢినెంచ
వరుఁడు ప్రద్యుమ్నుఁ డగుట సుందరతమెఱయ
నిస్తులోదారసంపత్ప్రశస్తికలన
నర్హయోగంబు సకలలోకైకహితము. 9

వ. అని హితోచితప్రకారంబుగ విన్నవించు నయ్యాప్తజనుల పలుకులు నిజాభిమతార్థకలితంబులగుటకు సంతసించియు మాధ్యస్త్యైకశరణుండగుచు నమ్మహీకాంతవరేణ్యుం డఖిల జగజ్జేగీయమానవైభవకళారమ్యంబగు స్వయంవరమహోత్సవంబునకుం జతురంబుధివేలయిత వసుమతీచక్రంబునం గల రాజలోకంబు రావించి కన్యకారత్నంబునకుం దన్మనోహరుండైన వరునిం బెండ్లి యొనర్చెదనని నిశ్చయించి, శుభకార్యధురంధరులకు బంధుపురోహితామాత్యవరులకున్ దత్తత్కరణీయంబుల నియోగించిన, వారలమందానందరసనిష్యందకందళితహృదయారవిందులై. 10

సీ. విశదంబుగా నల్లదిశలస్వయంవర
గరిమఁ జాటఁగఁబంచి నిరుపమాన
మణినిబద్ధానేక మహితవీథీకుడ్య
భాగము ల్మెఱుఁగార బాగొనర్చి
సౌధగోపురచంద్రశాలాదిభవన రా
జముల నెంతయు వింతసౌరుదీర్చి
యభినవచిత్రలేఖాభిరంజన లీల
లలరించి శుభకుతూహలము మీఱఁ

గీ. బురము గై సేసి రవుడు విస్ఫురితతత్స్వ
యంవరాలోక నాదరణాగమిష్య
దఖిలనరలోకపాలమోహన విరాజ
మానతరశోభనశ్రీల నీనుచుండ. 11

చ. రతనపుఁ జప్పరంబులను రాణదలిర్పఁగఁ గట్టిరంతటన్
వితతమహార్హహేమమయవిస్ఫుటశోభివితానపాళియం
దతులమనోజ్ఞవైఖరులనందఁగ మౌక్తికగుచ్ఛమాలికా
వితతులు సంఘటించిరి సవిభ్రమకౌతుకసంభ్రమంబునన్.

చ. నిరుపమకీర్తి రుక్మిధరణీతలనాథకుమారికాస్వయం
వరవిభవంబుఁగాంచ ఫణివల్లభదంపతు లప్పురంబునన్
బరువడి నిల్చిరోయనఁగ బాగుదలిర్చెను నాగవల్లికా
పరిగత పూగకాండయుగపాళులు రత్నగృహాస్యసీమలన్.

మ. వివిధానర్ఘ్య మణివ్రజంబు లపుడుర్వీపాల మూర్ధన్యగే
హావరద్వారములన్ సువర్ణమయ సూత్రైకాప్తిచేఁ దోరణీ
భవదాకారముఁ బూనుచుం దెలిపె భూపాలోత్కరంబిట్లు రు
క్మవతీమోహగుణైక బద్ధతఘటింపన్ బంతిగాఁ గల్గుటన్.

క. కదళీతరువులు నాటిరి
సదనబహిర్ద్వారపార్శ్వజగతిని నభిసం
మదమున రుక్మవతి శుభా
భ్యుదయాంకస్ఫురణదాల్చి పొలుపు వహించెన్. 15

ఉ. అలఘు శుభప్రయత్న కలనాదరణంబున నుద్ధృతంబులౌ
జిలుగుమెఱుంగురంగలరుచీరెలు గట్టిన కేతనచ్ఛటల్
పొలిచెను విశ్వతోముఖతఁ బూని పురేందిర బాహులెత్తి భూ
వలయ వసుంధరాధిపుల వారక రమ్మనిపిల్చు కైవడిన్.

చ. సకలదిగంతవిశ్రుత లసద్విభవోన్నతరుక్మభూమి పా
లకతిలకాత్మజాసుగుణ లంబితపాశవశాంతరంగులై
చకచకితప్రభాపటల చారుహిరణ్మయకేతనచ్ఛటా
ప్రకటమహానుభావులగు పార్థివముఖ్యులు వచ్చునయ్యెడన్.

శా. చారుల్వారల రాకదెల్పఁ బహుతోషంబంది గంభీర తూ
ర్యారావంబులు భోరుకల్ల నిజసైన్యానీకము ల్గొల్వ వి
స్ఫార శ్రీయుతుఁ డవ్విదర్భధరణీపాలావతంసుండు వే
ఱ్వేఱన్ వేడ్క యథార్హసంగతినెదుర్చెన్ వైభవోదగ్రతన్.

సీ. పాండ్యకోసలసింధు పార్థివేంద్రులతోడ
మగధావనీపాల మణులతోడఁ
గుకుర కేరళలాట ఘూర్జరేశులతోడఁ
బాంచాలసౌరాష్ట్ర పతులతోడ
ద్రవిడకర్ణాట బర్బరమహీశులతోడ
శకసాల్వభూమి పాలకులతోడ
మత్స్యాంధ్ర కేకయక్ష్మావల్లభులతోడ
భోజకళింగ భూభుజులతోడ

గీ. మఱియుఁ జతురబ్ధి వలయితక్ష్మాతలాధి
కలితమహనీయ రాజపుంగవులతోడ
నెదురుకొని తెచ్చి మణిమయసదనములను
నర్హమగుభంగి విడియించు నవసరమున. 19

శా. యద్యోగంబునఁ గవిసీజలజసామ్యఁ బొప్ప రాజాధిపుల్
సద్యోభిన్నఘనస్వయంవరకథాసంసక్తులై వెండి హృ
త్ప్రోద్యద్వ్యత్తిభజింతురట్టి హరితాద్రూపాన్యనుభావాఢ్యుఁడౌ
ప్రద్యుమ్నుఁడు విదర్భరాజతనయాపాణిగ్రహోత్సాహియై.

సీ. విజయమంగళతూర్య, వితతవాద్యధ్వాన
విభవంబుదిక్కూల వీఁకదనర
ఘనకేతుజాత సంఘటితకాంచనచేల
కాంతు లంబరవీథిఁ గ్రమ్ముకొనఁగ

నవరత్నమయభూషణ పరస్పరోద్ఘర్ష
ణజరేణువులు ధరందళముకొనఁగఁ
బటుతరచతురంగ బలసంఘమహిరాజ
ఫణమండలమునకు భరముసేయ

గీ. నఖిలలోకైక విజిగీష నతిశయిల్లు
ప్రాభవస్ఫూర్తి నరుదెంచె భవ్యతత్స్వ
యంవరాయాత నిఖిలధరాధిపతిస
మాజమగు కుండినపురాధి రాజమునకు. 21

వ. ఇవ్విధంబున ననంతవైభవోదీర్ణంబుగ యదువృష్ణిభోజాం
ధక కురువంశ్య ధరాధిప చతుర్విధవాహినీపరివృతుండై
ప్రద్యుమ్నుండు విదర్భదేశంబుఁజొచ్చి కుండినపురానతి
దూరాగతుండయ్యె, నంతఁ దద్వృత్తాంతంబు చారులవలన
నెఱింగి రుక్మిభూవిభుండునుం దనమేనల్లుని రాకకుం బ్రియ
బునొంది బంధుమిత్రామాత్య పురోహితపరివారసహితంబు
గా నెదుర్కొనియె నప్పుడు. 22

సీ. ఇరుదళంబు లనేక హేళిమ్రోయించిన
దుందుభిధ్వాన సందోహపటిమ
యుభయసేనానీక శుభతరాధ్మాత శం
ఖారవసముద యోదారకలన

యొండొరుల బలాళినొనరించు మంగళ
కాహళనాదసంఘాతగరిమ
రెండుమూఁకలయందు మెండుగానలరించు
వందిబృందస్తోత్రవైభవంబు

గీ. నొక్కగతి భోరుకలుగుచు నొప్పమిగిలి
సకలభువనంబులందు నిండుకొనె నప్పు
డౌర శబ్దమయబ్రహ్మమనుచు వేడ్కఁ
బురజనంబులు విస్మయస్ఫురణఁదనర. 23

సీ. మగరాలగొడుగుల ధగధగప్రభలు ము
క్తాతపత్రశ్రీల నలముకొనఁగ
నాళీకమణికేతనచ్ఛటాద్యుతులు బం
గరుసిడంబులరుచుల్ గౌగిలింప
శుభతూర్యనాదవిస్ఫురణము ల్బౌకా
స్వనమహార్భటులతో సందడింప
ఘనతరచామరోత్కర కాంతలసనముల్
తెలివన్నె సురటీల దీప్తిఁబెనఁగ

గీ. లలితగతిఁజెంది శుభకుతూహలముమీఱ
నెలమివైదర్భచతురంగబలము లపుడు
గలసి యదువీరసైన్యసంఘములతోడ
నలఘుతరవైభవానోన్యతులఁ జెలంగ. 24

ఉ. కూరిమి మీఱ రుక్మినృపకుంజరుఁ డయ్యదువంశభూషణున్
భూరి యశఃప్రవాహపరిపూరిత పద్మభవాండగర్భు నా
కారగుణాతిరేక జనకప్రతిమాను మహానుభావునిన్
మారునిఁజూచి వేడ్కఁ బహుమానమెలర్పఁగఁ గౌఁగిలింపుచున్.

చ. మనమున వేడ్క లూరబలుమాఱునుజూచుచునాత్మసోదరిన్
వనరుహలోచనుం గుశలవార్తల నారసి బాంధవావళిన్
వినయ మెలర్పఁగానడిగి విస్తృతవైభవ నిర్జితామరేం
ద్ర నగరమైన కుండినపురంబునకుం దగఁదోడి తేఁగన్.

చ. హరితనయాగ్రగణ్య చతురంగబలాళి యనేక భంగులన్
బురవరసీమఁ జొచ్చుగతివొల్చెఁ దపాత్యయనూత నాభి య
త్సరిదవతంస వీచి చయ సమ్మిళితోరు సహస్రవేణికా
స్ఫురణలఁదాల్చి రత్ననిధిఁ జొచ్చినకైవడి దోఁప నత్తఱిన్.

గీ. భద్రదంతావళము నెక్కి భవ్యవిభవ
లీలఁ బురవీధి నరుగు గోపాలదేవ
తనయ వదనాంబుజంబుపైఁ దారసిల్లె
పౌరవనితావలోకన భ్రమరచయము. 28

చ. తరుణులు సౌధజాలకపదస్థగితానన చంద్రబింబలై
సరస నిరీక్షణాభిహితచారుతరోత్పలరాజిచే స్వయం
వరణ శుభంబుఁ జెందుమని వారక సేసలు జల్లుకైవడిన్
హరి తనయావలోకన విహారము సల్పి రతృప్తచిత్తలై. 29

చ. అతనుఁడె కాఁడె యద్ధరణిపాత్మజ నెమ్మది నున్నవాఁడు సం
గతి నితఁ డమ్మనోభవుఁడెకాఁడెజగత్త్రియమోహనాకృతిన్
నుతిగని రుక్మిణీసతి తనూభవుఁడై జనియించె వీని స
మ్మతి వరియింపకన్య నృపమండలిపైఁగనువిచ్చి చూచునే.

ఉ. సుందరభావమెంచగఁ వసుంధర నెవ్వని యంశ మందు లేఁ
పొందుగ నేమనోహరుని ఫూనికచే యువతీ యువాళియం
దందము మీఱు మోహములునట్టిమహాత్ముఁడెమన్మథుండె యిం
పొందఁగ నీతఁడౌట మఱియొక్కరుఁ డీతనిఁ బోలనేర్చునే.

క. అనుచుం దనుఁ గనుఁ గొను న
వ్వనజాక్షుల దృక్చకోరవారమ్ముల నా
ననచంద్రకళాస్ఫురణల
మనుపుచుఁ బ్రద్యుమ్నుఁ డ్రగ మణిమయ వీధిన్. 32

మ. చని జాఁబూనదదివ్యమంచక సమంచద్రాజ కాస్థాన సీ
మను రుక్మిక్షితినాథ దర్పిత లసన్మాణిక్యసింహాసనం
బున భాసిల్లె నుదారమోహన కళాపూరప్రసక్తి న్నిజా
నన చంద్రుండు సమస్తచిత్తనిధురత్నంబుల్ గరంగింపఁగన్.

క. నిరుపమలావణ్య కళా
భరితుండగు మరుని పజ్జఁ బార్థివ తేజ
స్ఫురణలు రహిడించి తగన్
గరదీపముచెంత దీపకళికల భంగిన్. 34

వ. ఇవ్విధంబున ననురూపరూపరేఖావిలాససంపదల నింపు దళుకొత్తు నఖిలమహారాజకుమారరత్నంబులు పతింవరా వరణైక తాత్పర్యంబున వివిధ శృంగారచేష్టా నివిష్టమాన సులగుచు, నిష్ట గోష్ఠీ సంగతి నంగీకరింపుచున్నం గనుం గొని సంతోషతరంగితాంతరంగుండగుచు రుక్మిధరాకాం తుండు సామంతాప్తబాంధవ వర్గంబుతోడం దన హాజా రంబునకుం జని యంతఃపురైకాంత మణిభవంతి కాంతరం బున నున్న రుక్మవతికి స్వయంవర యోగ్యప్రసాధనంబులం దీర్పుఁడని ప్రసాధికల నియోగింపుచు నొక్క ప్రౌఢభామిని ప్రతిభావతియను, యథార్థాభిధానంబున విలసిల్లుచుం దైవ వరంబునం జిరకాలజీవిని యగుట విదిత పురావృత్త స్వయం వరాదిమహోత్సవాగత ప్రకట నానా రాజవంశానుచరిత యగుటం దెలిసి పిలువంబంచి. 35

క. ప్రతిభావతి యన సతతము
నుతి గాంచిన దాన వీ వనూన ప్రౌఢిన్
జతురంభోధిపరీత
క్షితితలమునఁ గలుగు రాజసింహులు వీరల్. 36

క. కుల శీల పౌరుషంబులు
దెలుపుచు మన రుక్మవతికి ధీ చాతుర్యం
బలరఁగ నీ రాజ కుమా
రులఁ జూపుము వేఱువేఱ రూఢి మెఱయఁగన్. 36

వ. అని యానతిచ్చినఁ బ్రసాదంబని సఖీపతంపంబగు ప్రతిభా
వతి యనేక వయస్యాజన పరివృతయగు నక్కన్యకామణిన్
గనక మయ చతురంతయానంబున నిడుకొని రాజమార్గం
బునకుం దోడ్కొని వచ్చిన. 38

గీ. వదనలావణ్య సుధ ధరావర నిరీక్ష
ణామర శ్రేణులకుఁ బంచ నవతరించు
మోహినియుఁ బోలె నారాజముఖ్యతనయ
లీల నరుదెంచె మణిమంచ పాళికపుడు. 39

గీ. రమణి వదనేందుచంద్రికా ప్రసరమునను
రాజమణిసంఘముల మనోరాజమణులు
గరఁగి ప్రవహించి శేషాంగ నిరుపమాన
సరసలావణ్య సాగర సక్తిఁ జెందె. 40

క. ఈలీల రాజవర్యుల
పాలికి గదియించి వేడ్కఁ బ్రతిభావతి యు
ద్వేలతరవచనచాతురి
బాలామణితోడ ననియెఁ బ్రాజ్ఞత మెఱయన్. 41

ఉ. ఓదళితేంద్రనీల నికరోపమి తాలకజాల ! బాల ! యీ
మేదినిభర్తఁ జూచితె సమీహితభోగకళాధురీణు న
త్యాదరకల్పితాధ్వరమహామహవిరంశవిశేషతర్పితేం
ద్రాదిసుపర్వ మాగధు యదార్థ విభాసిఁబరంతపాఖ్యునిన్.

చ. సవనములందు నీతఁడు ప్రసన్నతఁగైకొని వచ్చు దేవతా
ప్రవరులు తత్ఫలంబులిడ భాసురలీల నిరంతరప్రశ
స్తవిభవముల్ సెలంగ వసుధాతల మింద్రపదంబుగా నొన
ర్చువిమలకీర్తి కల్పతరు సూనపరిమళ వాసితంబుగన్. 43

గీ. రమణి! యీరాజమణి నీకు రాజ్యలక్ష్మి
తోడ సాపత్న్య మొనరించి వేడుకలర
ననుపమాకల్ప భోగభాగ్యైక కలన
నేలుఁ గావుత దాక్షిణ్య శాలియగుచు. 44

క. అనవుడు నానరపతి నా
ననసాచీకరణయుక్తి నారీరత్నం
బనను గ్రహ భాజనుఁగా
నొనరించినఁ దెలిసి సతి యనూనప్రౌఢిన్. 45

క. చతురంతయానధూర్వహ
వితతిని గనుసన్నఁ జేసి వేఱొకధరణీ
పతిపాలికి గదియింపుచు
నతివకుఁ దన్మహిమఁ దెలిపె హర్ష మెలర్పన్. 46

శా. అంభోజాత దళాయతేక్షణ! కటాక్షాధారుఁ గాఁ జేయుమీ
గంభీరాహవరంగసంగతరిపుక్ష్మానాథ మూర్ధేభరా
ట్కుంభోత్పాటన కేళిచంక్రమకళాటోపోగ్రపంచాస్య నీ
కాంభోజక్షితిపాల చంద్రుని శుభాకారా పరస్వాంతజున్.

గీ. ఇంతి యావిభుఁ బరిగ్రహించితేని
యుభయభుజపాళులను నిన్ను నుర్విసతిని
సిరి మెఱయఁదాల్చి తనదు దాక్షిణ్యమంతఁ
దెలుపఁగలఁడమ్మ సతతంబు వలపుమీఱి. 48

క. అన విని వనితారత్నము
గొనకొని యవ్విభునిసరకు గొన కవ్వలికిన్
జనుటకు భ్రూవల్లీ వే
ల్లన మొనరింపఁగ సఖీ లలామయు వేడ్కన్. 49

క. ఆరాజువలనుఁ బాపుచు
నారాజీవాస్య నపుడనంతరరాజ
శ్రీరాజమౌన సన్నిధి
నాయూఢిగఁ జేర్చి పలికె నతివాక్ప్రౌఢిన్. 50

శా. గంధేభాధిపయాన సర్వధరణీ కాంతాగ్రకోటీర సం
బంధోదంచితరత్నదీపకళికా భ్రాజత్పదాబ్జున్ యశ
స్సింధూత్తంసజచంద్రికాకువలయ శ్రీనిత్య సంధాయినీ
సింధుత్థారమణీమనోహరుని సు శ్రీనుంగటాక్షింపుమీ.

ఉ. అగణిత రత్నధాతు విహితాంబుజబాంధవసౌధపాళినె
మ్మిగఁ జెలినీవు నీతఁడుఁ దమిన్విహరింపుచు నున్న వేళలన్
గగనతరంగిణీ వికచకాంచన పద్మపరాగసౌరభా
నుగపవమానడింభములనుక్షణముం శ్రమమాపుఁగాపుతన్.

చ. అని చెలి విన్నవించుటః కనాదరణంబుఘటింప భామినీ
వినుతకటాక్ష శాతశర విస్ఫురణంబులు తద్ధరాధిపేం
ద్రునిపయి నాఁటవమ్యె నరురూపమనోహర భావహీనతా
ఖ్యనిబిడ బంధవజ్రకవచావరణంబునఁజేసి యత్తఱిన్. 53

క. కూరిమిఁజెలి యారమణికి
వేఱొక రాకొమరుఁజూపి విశ్రుతవచనో
దారతరరచనచాతురి
మీఱ నిరూపించె నిట్లమిత హర్షమునన్. 54

క. నవనీరద నీలకచా!
భువనాంతరవిదితకీర్తి భూషణుఁ డీ రా
జవరేణ్యుం డుత్తర కురు
కువలయపాలన మొనర్చుఁ గూరిమి మెఱయన్. 55

గీ. అమర యాత్రాను మోదకంబైన యమృత
రస మదెంతంచు రమణి యీరాజచంద్రు
వితతసత్కీర్తి నామకావ్యశసుఘోషు
మఖిల లోకానుమోదకం బగుచుఁ దనరె. 56

చ. సుదతిమనోజ్ఞతా విజిత సూనశరాసనుఁడైన యీమహా
భ్యుదయనృపాలచంద్రుఁడు సమున్నతిమీఱభవత్కుచాద్రులన్
గదిసి కరంబుల న్వితతనవ్యతరోత్పలపత్రశోభలన్
ముదమున దీర్చుఁగాపుత ననూనరసప్రచురాంతరంగతన్.

క. అన విని ముఖచంద్రుని నా
ఘనుఁ వలనను ద్రిప్పియున్న కన్యామణి న
న్య నరాధిప సమ్ముఖమున
కనుపమగతిఁ దోడి తెచ్చి యాదృతిఁబల్కెన్. 59

శా. ఆదిత్యప్రతిమాన తేజుఁడు సముద్యత్కీర్తి ముక్తావిభూ
షాదానాత్మవశీకృతాఖిల ఘనక్ష్మాపాలలక్ష్మీసదా
మోదాపాదిత భోగలంపటిత ధీముద్రానుభద్రుండు నా
చేదిక్ష్మాతలనాథుఁ డీతఁడు ముఖశ్రీధూత పంకేరుహా!

వ. అని పలికి యబ్భూమిపాలునిన్ బరిగ్రహింపనొల్లని యు
ల్లంబున నున్న యల్లలనావతంసకు నాంతరాళిక కతిపయ
దేశాధీశవిశేషకులశీలంబు లుపదేశింపుచు నవిదూరవిభా
సమాన యదువృష్టిభోజాంధక కురుముఖ్యనృపాల సేవితుం
డగుచు, న పుండరీకాక్షతనూభవుండున్న మణిమండన మం
డితమంచకంబున కుపాంతంబుననున్న ధరణీకాంతు నుద్దే
శించి. 60

చ. అతివ భవత్కటాక్ష నిచయాశ్రయుఁగాఁగఁబరిగ్రహింపుసం
గతిని మహేంద్రనామకనగ్రపవరంబున కీశ్వరుండు వీఁ
డతుల మనోజ్ఞరూపవిభవాతిశయంబున దివ్యభామినీ
తతులమనంబులందు సతతస్పృహ నెందఁగఁజేయు నెంతయున్.

గీ. అనిన విని వాని వైవేగు వనజనేత్ర
బోల్చి గదియించు పుంఖానుపుంఖకలిత
నిశితవీక్షణమాలికానికరములకు
గుఱియగుచు నుండె యదువంశకుంజరుండు. 62

క. ఆలీలఁ దెలిసి నెచ్చెలి
బాలిక పాలకి మహేంద్రపాలకువలనన్
లీలాగతి ప్రద్యుమ్నుని
పాలికి గదియింప నిడె నభంగురమహిమన్. 63

మ. మునువిన్నట్లు మనోజ్ఞరూపవిభవంబు ల్దెల్పు నన్యోన్యమో
హనలీలావహవక్త్రపద్మముల నేపారన్ గటాక్షించు చో
వనజాతాక్షకుమారదృగ్వితతితో వైదర్భకన్యావతం
సనిరీక్షల్పెనఁ దూఁగవయ్యె ఘనలజ్జాపారవశ్యంబునన్. 64

క. అత్తఱిఁ బ్రతిభావతియున్
దత్తాదృశరూపవిభవధన్యుని ధీరో
దాత్తగుణాఢ్యుని యదువం
శోత్తము నిం జూపి యువిద కొనరన్ బలికెన్. 65

శా. రామాలోకమనోవిభేదనపటుప్రాంచద్భుజావిక్రమో
ద్దామాత్మప్రభవా పరావతరణోద్యత్కీర్తి సాంద్రుండు సం
గ్రామోత్పాటితశంబరుండు విలసత్ప్రద్యుమ్న విఖ్యాతుఁడౌ
నీమేనత్తకుమారుఁ డితఁ డలివేణీ! వేడ్క వీక్షింపుమా !

క. నీకితఁడె తగును నితనికి
నీకతఁ దగుదీవె లోకహితముగ వేఁడ్కన్
జేకొని వీని వరించినఁ
బ్రాకటమగు భాగ్యకలన రాకేందుముఖీ! 67

వ. అని పలికి సఖీవతంస మవ్వరారోహ నెమ్మనంబు తద్గతం బగుట లజ్జాసంకలిత దరహాసంబునం దెలిసి యానధు ర్యులఁ జతురంతయానము డించ నియోగించిన నక్కన్యా రత్నంబు, సఖీకరావలంబనమొనరంగ రత్నమయమంచక మెక్కె, ఘటించె శోభనాభినవమధూకపుష్పములపేరు యదూద్వహుపేరురమ్మునన్. 68

క. వలపొలయ దండలెత్తుచు
వలపొలయఁగ దండవైచు వారిజముఖి న
వ్వలరాజులు పొగులఁగ న
వ్వలరాజు కరంబుగొనె నవారిత మహిమన్. 68

క. కన్యామణి యదుకుల మూ
ర్ధన్యుని వరియింప నిఖిలధరణిపు లోజన్
సన్యాసమొంది రపుడా
త్మన్యక్కృతరూప విభ్రమస్థితులగుచున్. 70

క. హరితనయుఁ డేగుదెంచిన
ధర నన్యుల కేలగలుగుఁ దరుణీమణి! మున్,
హరిగొని పోవఁడె రుక్మిణి
ధరణీవరకోటిఁ గెలిచి దర్పమెలర్పన్. 71

వ. అనుచు నివ్విధంబున ననన్య సామాన్య రూపవిభవధన్య కన్యాకృతాత్మ పరాభవ ప్రభవ కోపానల సాంద్రీకృత ప్రతాపాగ్నులు మహాబలసాహాయ్యంబునన్ బ్రజ్వలింప సజ్జననాథయూథంబు లాయోధసన్నాహంబున రాజవీథి నిరోధించి శుభకార్యాంతరాయంబుసేయం దలంచుటయు,

గీ. అపుడు ప్రద్యుమ్నుఁ డిరుగడలందునున్న
పార్థివేంద్రుల కుటిలస్వభావమెఱిఁగి
సరకుగాన కింతిఁగైకొని యరదమెక్కి
చతురగతి ద్వారవతికేగు సమయమునను. 73

క. వెనుదవ్వులు రాజలోకము
గని యాదవసైన్య సంఘగర్వోద్రేకం
బున మరలి హరికుమారుఁడు
మొనకట్టెను బాహుబల సమున్నతిమెఱయన్. 74

శా. నానాదేశనృపాలురాత్మ ఘనసైన్యశ్రేణులం దొప్పిగా
నానందాత్మజసూతిపైఁ గదిసి రస్త్రౌఘస్ఫురద్బాణ సం
తానంబు ల్నిగిడింపుచున్ బ్రళయసన్నద్ధాభ్రగర్జాసమ
జ్యానిర్ఘోష మహార్భటుల్ సెలఁగి బ్రహ్మాండంబుభేదింపఁగన్.

ఉ. శంబరభేదనుం డపుడు సంగరకేళి కుతూహలంబునన్
బింబఫలాధరీమణి కభీతిమొసంగుచు బాహువిక్రమా
డంబరమేపుమీఱఁగ గడంక నశేష నృపాలసైన్య చ
క్రంబులతోఁ దలంపడె నఖండసమగ్ర శరాభివర్షియై.

వ. ఇవ్విధంబున నప్పుండరీకాక్ష తనూభవుండు సముద్దండ భుజాదండ మండలీకృత కోదండపాండిత్యంబున నిబిడనిశిత శరధారావర్షంబుల నెల్లెడల నొక్కుమ్మడిఁ గ్రుమ్మరించి విచ్ఛిన్నముఖాంభోజులగు కాంభోజులును, విదళిత లలాటులగు లాటులును, విదారిత వక్షస్థలపాళులగు నేపాళులును, విఖండితకిరీటులగు మరాటులును, విజర్జరితచూళులగుచోళులును, మొదలైన హతావశిష్ట నిఖిలనరపాలక నికరంబులం బ్రకటతరాంగవికారమాత్ర లాభంబులుగాఁజేసి పలాయనంబు నొందింపుచు విజయలక్ష్మీపాణిగ్రహణ సమారంభ సమయసము జ్జృంభమాణ గంభీరభేరీభాంకరణంబుల కనుకరణంబుగ భూనభోంతరాళంబునం జోరుకలుగ శంఖంబు పూరించి సముద్వేలానందరస నిష్యందకందళితహృదయారవిందుండై విదర్భకన్యకానిధానంబుతోడ నిజరాజధానియగు ద్వారకాపురంబున కేతెంచెనంత. 77

క. ఈలీల నిఖిలధరణీ
పాలుర నిరసించి విజయపద్మకుఁ దోడై
బాలామణితో మదనుఁడు
హాళిన్ వచ్చెనని చారణావళి దెలుపన్. 78

చ. పురజనులెల్ల వేడుకను పొంగఁగ నవ్వసుదేవ ముఖ్యులౌ
గురువులు బాంధవుల్ సఖులు కూరిమితో నెదు రేగి వైభవ

స్ఫురణలఁ దోడితెచ్చిరి విభూషిత సౌధచరాంబుజేక్షణ
ల్సరసలతాంతసంతతుల సంభ్రమ మొప్పఁగ సేసచల్లఁగన్.

సీ. పౌరపుణ్యాంగనాపరంపర లొసంగు
రమ్యకర్పూరదీపనీరాజనముల
లీలగైకొంచు మదనుఁ డవ్వేళ వేడ్క
వనజముఖిత్రోత శుద్ధాంతమునకు వచ్చె. 80

క. తన మేనఁగోడలగు న
వ్వనజేక్షణఁజూచి యపుడు వైదర్భి మనం
బున నుప్పొంగుచుఁ దనయుని
యనుపమకళ్యాణగరిమ కతిమోదమునన్. 81

క. వెన్నుని యానతి నప్పుడు
మున్ననచేఁ బిలువనంప మది సంభ్రమ మొ
ప్ప న్నిఖిల బంధు నృప సం
పన్నత నరుదెంచె రుక్మి పార్థివుఁడంతన్.

వ. హరి యెదురేగి రుక్మివసుధాధిపుఁ దోడ్కొనివచ్చి చిత్రభా
స్వరమణి గేహరాజముల వైభవ మొప్పఁగ డించి, వేడ్క న
ద్ధరణిపమౌళితోడ సముదగ్ర శుభగ్రహ సన్ముహూర్తము
న్సరస పురోహితోత్తము వచస్స్ఫురణంబున నిశ్చయింపఁగన్.

క. ఉత్సాహ కలితులగు శ్రీ
వత్సాంకుని హితులు దివ్యవైభవ మలరన్

దత్సమయమున వివాహ మ
హోత్సవ సన్నాహలీల నొనరించుటయున్. 84

క. ము_త్తియపుఁ జప్పరంబులఁ
గ్రొ_త్తమెఱుంగలరు రత్నగుచ్ఛశ్రేణుల్
గు_త్తముగా నొనగూర్చుచు
హ_త్తించిరి తోరణంబు లతిమోదమునన్. 85

గీ. విద్రుమ_స్తంభ విలసిత వితత వజ్ర
బద్ధకౌతుక వేదికోపరితలంబు
నందు మౌ_క్తికమంజరీ బృందకలిత
కనక పట్ట వితానముల్ గట్టి రపుడు. 86

క. ఈ లీలన్ బరిజనులు శు
భాలంకారములు దీర్చి యతికుతుకమునన్
శ్రీలలనేశ! నిఖిల ము
ద్వేలత నాయితమటంచుఁ దెలుపఁగ నంతన్. 87

క. శౌరికుమార తిలకునకు
శ్రీరాజిల మంగళాభిషేక మొనర్పన్
సారతర చాతురీ యుత
సారసముఖులకు నియు_క్తి సలుపఁగ వేడ్కన్. 88

క. హరి సారస లోచనల
మ్మరునికి శుభమజ్జనార్థ మహిత సుగంధ
స్ఫురితద్రవ్యము లాయిత
పఱిపింపఁగ సఖులు చెలఁగిభాసురలీలన్. 89

చ. సితమణివేదిమధ్యమునఁ జెన్నలరంగ సువర్ణపీఠిపై
నతుల విలాసవై ఖరుల నంబుజనేత్రకుమార రత్నమున్
చతురతఁ గూరుచుండ నిడి సంభ్రమ మొప్పఁగ మేనిభూషణ
ప్రతతులనూడ్చి యాదలనురమ్యశుభాక్షతలన్ ఘటింపఁగన్.

క. తరుణీ తరుణ మనోవా
గురలగు నమ్మరుని కురుల క్రొమ్ముడి విడ బం
గరు పట్టు బొందు సడలిచి
కరమణి కంకణరవంబు కరమమరంగన్. 91

క. గుఱుకుచ శిఖరుల మౌక్తిక
సరములు నటియింపఁగాను చలియింప లస
త్సురభీకృత తైలంబున
శిరసంటెన్ జెలియొకర్తు సీకొమరునకున్. 92

గీ. జవ్వనియొకర్తు నునుగోళ్ల దువ్వి దువ్వి
నిగనిగలనీను నిడుదపెన్నెరులగుంపు
గుప్పిళుల కెక్కు వగునట్లు గూడబట్టి
పిడిచి విదళించి జారుక్రొమ్ముడి ఘటించె. 93

ఉ. భామయొకర్తు పాదముల బంగరుపావలు గీలుకొల్ప, ను
ద్దామమనోజ్ఞలీల నొకతామరసేక్షణ గేలొసంగ, స
త్యాముఖ భామినీమణులు హర్షమునం ద్వరపెట్ట, మజ్జన
శ్రీమహిమంబు పూననడచె నతివల్లభుఁ డంబుశాలకున్.

గీ. నెరుల జొంపము విప్పి పన్నీరు చల్లి
వలిచమురునిగ్గు వెడలంగ నలమియలమి
లలితచాతురి గంధామలకముఁ దీర్చె
మదవతియొకర్తు శంబరమర్దనునకు. 95

ఉ. వేడిమి మీఱుతోయముల విస్తృతరత్నశరావసంగతిన్
దోడిపటీరనీరములు దొర్లిచి వేడుక చెంగలింపఁ బూఁ
బోడులు గొందఱందముగ భూరిఘటానుఘటంబుగా నిడన్
జేడెయొకర్తు మారునికి నేరుపునన్ జలకంబులార్చెనన్. 96

గీ. వెలఁది యొక్కర్తె వలిప దువ్వలువ తుదను
మేని తడియార్ప గదియింప మెఱసినప్పు
డింద్రనీలాచలంబుపై నించుకంత
జాలువాఱిన వెన్నెలలీలఁదోఁప. 97

మ. కలకంఠీమణియోర్తు పెన్నెరులు వేడ్కల్ మీఱ నీరార్చి క్రొం
దెలిచేలం గదియించి పెన్నమరుఁ డొందెన్ శోభఁ దాముజ్జగం
బులు సాధించి యధిత్యతం దిగిచి సాభోగాళి మౌర్వీలతా
కలితానూన సితాబ్జకార్ముకము వెన్కం దాల్చె నా నత్తఱిన్.

గీ. ఎలమిఁ బ్రద్యుమ్నుఁ డపుడొక చెలియొసంగు
జిలుగుబంగరువన్నె దువ్వలువఁ దాల్చె
స్థిరవిలసమాన విద్యుద్విశేష మేఘ
పరిణయశ్రీకిఁ బ్రతిభటస్ఫురణఁదోఁప. 99

చ. అతిచతురప్రసాధిక ప్రయత్నమునన్ మకరాంకమూర్ధజ
వ్యతికరబంధమప్పు డలరారెను బంగరుబొందుచాయ సం
గతి గొనుమల్లికావలయకంబులచే జలజాతకాండ సం
వృతఫణిరాజభోగపరివేష్టిత శంకరకంధరాకృతిన్. 100

ఉ. నీరజనాభసూతికొక నెచ్చెలి నిద్దపుటద్దమెత్తఁగా
వారిజనేత్రయోర్తు నిడువాలుగ కస్తురినామమింపునన్
దీరిచె నర్ధచంద్రు సిరి దీకొనజాలు లలాటపట్టికన్
శ్రీరమణీయతా గుణముచే నితఁడేయని వ్రాసినట్లుగన్.

గీ. కుంకుమరసంబు చందనపంకమునను
గలయమెదియించి మఱుమేన నలదుటకును
సాటి యిడవచ్చు నలసరస్వతియు గంగ
యేకతనుజెంది యమునపైఁ బ్రాకెనేని. 202

సీ. మగఱాలఁజెక్కిన మొగలిరేకుల చాలు
బహుచంద్రకళల సంపదలఁ దెలుప
నెలరాతి పనులచే నలరారు నుపరి భా
గములు గంగాప్రవాహములఁదెలుపఁ
భవ్యముక్తా దామ భంగీతరంగముల్
ఫణిరాజవేష్టన ప్రభలఁదెలుప
జలజాత మాణిక్యకలిత ప్రదేశకాం
తులు జటాకార సత్కలనఁదెలుప

గీ. శుభతరాదృష్ట పూర్వ విస్ఫురణమైన
హారకపర్దంబు నాఁగఁ జెన్నలరు వివిధ
రత్నచిత్రిత మకుటంబు రమణియొత్తు
నిలిపె నాదల యదువంశతిలకు నకును. 103

స్రగ్ధర.

శుభవార్తల్ దెల్పు కాంక్షన్ సుముఖతసమసంశోభితక్ష్మాత్త కోద
గ్రభయుల్ కౌండిన్యకర్ణ్యౌఘమురహినిరుచాకంబులై సామ్య
మొప్పం
గ భజించెన్ గర్ణయుగ్మాకలనలసనముక్తాచతుష్కాయత శ్రీ
విభవోద్యత్కుండలంబుల్ వెలిఁగెనపుడు గోవిందజ శ్రోత్రపాళిన్.

చ. త్రిభువన మోహకీర్తి గుణరేఖ లివేయని తెల్పుకై వడిన్
బ్రభగల ముత్తియంబులనుబంతులు మీఱఘటించి వేడ్కఁ జే
శుభకలనా నిధానమగుచు న్వెలుఁగొందు పసిండి బాసికం
బభిరతిఁ గట్టె నొక్క సతియంబుజ బాహు లలాట పట్టికన్.

క. విద్యుద్వలయాకార
ప్రద్యోతిత వర సువర్ణ భాస్వరసరముల్
మాద్య దళివేణి యొక్కతె
ప్రద్యుమ్నుని యఱుతనిడె శుభశ్రీమెఱయన్. 106

చ. ఘనతర పద్మరాగములఁ గైకొని లోక సుదర్శమై రహిన్
దనరు నవార్కమండల మనాఁదగు మేలి పసిండి తాళిమొః
క్కనలిననేత్ర గీల్కొలిపె కంసవిరోధికుమారు పేరుర
మ్మునమహితప్రభానికరముల్ దిశలన్ వెలయించుచుండఁగన్.

క. జయభాగ్యేందిర లతని యు
భయభుజముల వరసువర్ణభాసుర లీలో
దయ లైరన నొక చెలి కువ
లయశరునికి నంగదంబులన్ ఘటియించెన్. 108

మ. మకరాంకానుపమానపాణియుగళిన్ మత్తేభయానావతం
సక మొక్కర్తు ఘటించె వజ్రమణి రాజత్కంకణాకల్పక
ద్వికమాకల్పక మంపఁ దల్లతలు తద్విఖ్యాతదానక్రియా
ధికృతిన్ వేడఁగ వచ్చి హస్తయుగళాప్తిం జెందెనాభాసిలెన్.

క. ఆపగ్వోద్భాసి గుణా
రోపిత రత్నాకరాభి రూప్యములగుచున్
దీపింప రత్నముద్రలు
శ్రీపతి సుతు వ్రేళ్ళ నొక్క చెలిఘటియించెన్. 110

చ. ఘన నవరత్నపాలికలఁ గమ్మని బంగరు జిల్గుటల్లికల్
దనరిన పాలెల స్గదియఁ దాపిన దివ్యనితంబసూత్రమున్
వనిత యొకర్తు గట్టె యదువంశపయోధిసుధాంశుఁడైన మా
రుని కటిశోభఁ గాంచి యది రూఢి దలిర్పఁగఁ గాంచియైతగన్.

చ. ఎలమి సమస్తభూషణము లిట్లుఘటించి తదీయసుప్రభా
కలలకు దీపికావళుల కాంతులకున్ రహిఁదారతమ్య మింప
పలరఁగఁ జూడఁగోరి బలె నాజగదేకమనోజ్ఞుముందటన్
వెలఁదులు ద్రిప్పిరప్పుడు సవిభ్రమలై కపురంపుటారతుల్.

వ. ఇవ్విధంబున వైవాహిక శోభాభిరూప వివిధశృంగారాలంకారంబులందిరు కొమారుందోడ్కొని వసుదేవ బలరామసాత్యకి ప్రముఖాత్మీయులతోడ నిఖిలబంధువసుంధరా ధురంధరసమేతుండై పుండరీకాక్షుం డచిరోపపన్నంబగు శుభముహూర్తంబున కరుగందెంచుసన్నాహం బొనరించుచున్న సమయంబున. 113

చ. ఎలమిని రుక్మిభూమిరమణేశ్వరుఁ డాత్మకుమారికామణిన్
జెలువము మీఱ నర్థిగయిసేయుట కానతిడన్ ప్రభావతీ
కలమృదుభాషిణీప్రముఖకంజదళాక్షులు కల్కిరావమా
చిలుకలకొల్కి నిన్మరుఁడు చేకొనువేళసమీపమయ్యెడున్.

క. అని పలుకుచు మంగళ మ
జ్జన మొనరించుటకు గంధసత్తైలాభ్యం
జన మిడిరి వేడ్కచే న
మ్మనుజాధిపకన్య కపుడు మానితలీలన్. 115

క. వనిత కుటిలాలకము లొక
వనజేక్షణ గడిసి స్నేహవాసన నిడి దు
వ్వినకొలఁది విఱ్ఱవీఁగుచుఁ
దనరెడిఁ దమసాటివారి ధరమఱికనమిన్. 116

గీ. కప్పురపుఁ జూర్ణమును బచ్చి కస్తురియును
జందనపుఁ బంకమునుగూర్చి కుందరదన
మేన నలుగిడిరప్పుడు మానవతులు
కొందఱవితావులటఁ బెట్టి కొంచకరుగ. 117

చ. జలకము లార్చుచో నలకజాతముఁ బల్మఱుఁ బాణి పంకజం
బుల విదళించె నొక్కసతి పొల్పెసగంగను దీనిపెన్నెరుల్
జలదము లౌనొ కావొ యను సందియమందఁ బకున్ మరల్ప ని
చ్చలుజలబిందుమౌక్తికపు సంతతుల న్గురియించు కైవడిన్.

ఉ. హాసజితేందుశోభలు రయంబున మజ్జనమార్చు నయ్యెడన్
భాసురలీల రుక్మవతిపైఁ దనరారు హరిద్రకాంతు ల
న్వాసిగఁబూని యొప్పె జలవారము దామును రుక్మసత్ప్రభ
న్వాసనగల్గు వాని కధివాసబలంబున వన్నెగల్గదే? 119

చ. అలకలు మెల్పుచోఁ దదసి తాభనుజేలము నీలమైతగన్
బొలుపగు భృంగమాలికయొ నూతనవారిదరేఖయో పయిన్
జిలుకులకొల్కి పెన్నెరులఁ జేరిమెలంగె నదల్పుఁడన్న ము
గ్ధలనగు నొక్కసుందరదకన్నియకున్ దడియార్చెనొదలన్.

గీ. కళుకు బంగరుమెఱుఁగు క్రొందళుకుబెళుకు
లీను చీనాంబరము గట్టనిచ్చి రమణు
లెలమి మణిపీఠిగూర్చుండ నిముచు రుక్మ
వతికి శృంగారములుదీర్చు మతిఁజెలంగి. 121

గీ. వీవనల తెమ్మెరల నరవింద నేత్ర
కురులు తడియార్చి నునువాలు గోళ్ళఁదీర్చి
యగరు కర్పూరధూపధూమాళిఁదార్చి
తావులకుఁ దావులుగఁగూర్చెఁ దరుణియొకతె. 122

చ. సిరులలరంగ వీనిరహిఁ జేకొని చిక్కులువాపినన్ నిజ
స్ఫురదురువక్రతన్విడవు పూనికబంధనమందజేసి నే
వరసుమనంబుఁగూర్తునని వారకక్రొమ్ముడిఁ దీర్చెఁగాంతయొ
క్కరుతు వినిర్జితాంబుదనికాయతదీయ శిరోజపాళికిన్. 123

వ. అనంతరం బాజలజాక్షీవతంసంబులు తదీయ దళితేంద్ర నీలనికరోపమిత చూడాకలాపంబను ఘనాఘనమండలంబున భాసిల్లు సూర్యచంద్రు లనఁ దన్నామకానర్ఘ్యకలాపంబులమర్చి సచ్ఛాయాలకచ్ఛాయాగ్రహంబువదనచంద్రమండలంబుపైకొనిరా సంగజజాంగలిక వరేణ్యుండు నియమించి వ్రాసిన మంత్రరేఖలనఁ గురుల మొదల హారవల్లికలొనఁగూర్చి ఫాలతలోపరిప్రదేశంబున సీమంతంబను గగనవీథిని ముత్తియపుఁ జేరులనెడు నిరంతరానుసర త్తారకాపంక్తులతో ముఖరాజును సేవింపవచ్చు గొప్పచుక్క యనం జాలు చేరుచుక్క హత్తించి నెమ్మొగంపుఁదమ్మి పువ్వొటుపట్టునం గ్రీడించు స్వాభావిక లావణ్యేందిర తన సాహచర్యంబున కభ్యాగత యగు వైవాహిక శోభాధిదేవత కభిమతరమణీయంబగు హేమపీఠంబొసంగె నా నిటలమధ్యంబునం గాంచనపట్టంబు మట్టుకొల్పి యాక్రింద సభ్రమభ్రూలతయను సింగిణి మనోభవుండు సంధించిన నీలోత్పలపత్రశరంబన మృగనాభి తిలకంబు దీర్చి కర్ణశ్రీ సువర్ణంబులకు ద్విత్వంబు లొసంగిరన సువర్ణ శ్రీమహనీయ కుండ

లాభరణంబు లిరవుకొల్పి ధగద్ధగిత కనకఫల కోపమాన కపోలతలంబుల భువనైక మోహక మనోభవ శాసన విశేషనంబులన మకరికాపత్రరేఖ లలరించినఁ యనార విందంబులం గ్రందుకొను శృంగార రస మరందంబులఁ దదధిష్ఠానక లక్ష్మి విందొనరింప భుజియించు చంచరీకంబుల బంతులంబోని కజ్జలరేఖలన్ దొంగలిరెప్పలన్గొలుకుల వెడలందీర్చి నాసాగంధఫలి యధరంబను బంధుజీవంబునకు నిజపూర్వమిళంబు సువర్ణఘుటిక నించి యందిచ్చెననం గుందనంపుముంగఱంగఁదురు పఱచి నిఖిల కుంభినీ శిరశ్శ్రీల నేలంజాలు నౌన్నత్యంబు గాంచిన పయోదంబుల మనసిజ మహారాజునకు ననర్ఘళగళశంఖ వినిర్గళిత క్షీర ధారాభిషేకం బొనరించెనన విశదమౌక్తిక హారనిచయంబు నెలవుకొల్పి, భుజహేమలతల నామూలాగ్రంబుగాఁ బల్లవపుటంబెగసె నా నంగద కంకణాంగుళీయక విభూషణంబులం గీలుకొల్పి, వసుగర్భాచక్రంబు మలినతన్ దిగఁద్రోసి సాక్షాత్తదీయ నితంబ బింబంబగుటం దెలిసి తన్మేఖల యగుచో రత్నాకరుండు తామనుజత స్వభావంబు వదలి ప్రకటీకృత యథార్థాభిదానతఁ గాంచె. నామణిమయ కాంచీదామంబు సంఘటించి వీనిపై ననురాగంబు నెరపుమని చరణారుణ కమలంబులకు నపఁగించు లీలన్గెంపుటందియలం దొడిగించి మఱియు నసంఖ్యాక వివిధమణి చిత్రితంబులగు భూషణంబులఁ జందనాలేపం

బులఁ బుష్పమాలికల నలంకరించి, విదర్భరాజపురందరు తోడ నధిప కన్యకారత్నంబునకు శృంగారంబులు దీర్చితి మని విన్నవింప నవ్విభుండును బంధుమిత్రామాత్య పురోహిత పరివార సహితుండై కల్యాణమహోత్సవానుకూల సమస్తవైభవాకలనల మెలంగుచు వరాగమనంబు ప్రతీక్షించుచున్న సమయంబున. 224

క. నీరజమిత్రుం డఁరిగియు
దారతఁ బిలువంగవచ్చె ననఁగ మహోదగ్ర
త్తారాచంద్ర బలాన్విత
మై రాజిలు శుభముహూర్త మభిముఖమయ్యెన్. 125

క. దేవసుముహూర్తసమయము
గావచ్చెను తడయకరుగఁ గావలెననుచున్
దైవజ్ఞవరులు దెలుపఁగ
భావజజనకుండు నాత్మవర్గము తోడన్. 126

క. పెండ్లికొమరునిఁ దోడ్కొని పృథులవైభ
వాంచిత స్ఫూర్తి బంధు మిత్రా ప్తతతులు
హరిగజస్యందనారూఢు లగుచు మెఱయ
నమిత విభవంబున వివాహ యాత్రవెడలె. 127

క. ఆసమయంబున నఖిల
శ్రీ సంతతుల చట మెలఁగెఁ జెన్నలరారన్
శ్రీసతి కొమరుని కరయన్
డాసిన చుట్టము లగుట ననంత స్ఫురణన్. 128

వ. అయ్యవసరంబున నానావిధవాద్యధ్వానంబులు వందిమాగధస్తోత్ర మహిమంబులుం బుణ్యాంగనామంగళ గీతికానంపదలును నంతరాంతరోపక్రాంత నితాంత వారకాంతా జన తౌర్యత్రిక విలాసంబులుం జెలంగఁ గర్పూర గంధతైలప్రదీపితానేకముఖకర దీపికా చంద్రసూర్య జ్యోతిః ప్రభామండలంబులు తారకాచంద్రసూర్యజ్యోతులేకదా సమాకీర్ణంబు లయ్యెనా ననేక కాంతి విశేష నిరీక్షణీయంబులై వెలుంగ, గర్గసంయమీంద్రోపదేశంబున సమస్త మంగళద్రవ్యపాణులై యలివేణులు వెలుంగ నల్లనల్లన రాజవీధి నడిచి పళ్యజ్జన లోచనాద్భుతానంద విధాయక మహావైభవంబున కీమదీయక యెదుర్కొను విదర్భరాజపరమేశ్వరునితోడఁ గస్తూరీ ఘనసార పటవాసకచందన మౌక్తికాక్షత పుష్పవసంతంబు లాడి పరస్పర విహిత బహుమానంబుల నలరి తద్గృహద్వారంబు ప్రవేశించి విమానంబులు డిగ్గి సువర్ణ పాదుకారూఢులై వసుదేవ బలరామ కృష్ణులు కందర్పుని ముందర నడిపించుచు నంతఃపురంబు ప్రవేశించు నంత. 129

ఉ. గర్గమునీంద్రచంద్రుఁడు వికాసవదానన సర్వ బంధురా
డ్వర్గ సమేతులైన యదువంశ విదర్భ కులప్రదీపకుల్
స్వర్గపురీశవైభవులు సంతసమందఁ గుల క్రమాగతా
నర్గళ మంగళాచరణ యాజ్ఞికలీల భజించి వేడుకన్. 130

సీ. కర్పూర దీపికా కలితమౌక్తిక పాత్ర
పాణులై బహుసతీశ్రేణులలర
మంగళద్రవ్య సంభారసంధాయకు
లై పురోహితముఖ్యు లేపుమీఱ
స్వస్తి పుణ్యాహవాచన సంభ్రమోదార
భూసురసంఘముల్ భాసిలంగ
నవవధూవరయోగ్య నానాసువస్తు సం
పదలచే బాంధవు లొప్పదలుచుండ

గీ. వివిధమణిచిత్ర సంశోభి విపులవిమల
కనక కల్యాణవేదికి ననుపమాన
లీల నరుదేర నియమించె గేళినీసు
కలితమోహన శృంగార కలిత వేషు. 131

క. మునివరుని యాజ్ఞచే నపు
డనుపమ శుభలీల మరుఁడు హాళివసించెన్
ఘనతర దుకూల పరివృత
కనదంబు జరాగరత్న కల్పితపీఠిన్. 132

చ. నృపమణియైన రుక్మి ధరణీతలనేత విధిక్రమంబు నొం
ది పరమమానియానతి దధిన్మధువున్ గలపించి వేడ్కచే
నపు డొసగె న్మధువ్రత గుణాంచిత ధర్మని కాత్మకన్యకా
నుపమ గుణాతిరేకమున నొప్పెడు మాధురిఁ దెల్పునై వడిన్.

క. నిలుకడగల మెఱుపోనడ
గలబంగరు బొమ్మొ? చంద్రకళయో? నా నె
చ్చెలు లాకలికిని సిరి సం
ధిల శుభవేదికకుఁ దోడితెచ్చిరి వేడ్కన్. 134

క. సరస చిరంటీజన మపు
డరయఁగఁ దెర యెత్తు సంభ్రమాంకూరములన్
బరగి తెరయెత్తిరి వధూ
వరులనడుమ గురునను(జ్ఞ) వడయుచు వేడ్కన్. 135

క. శుభవిధిమునివరుఁ డెలమిన్
త్రిభువన రక్షక కుమారుని, కరంబున న
య్యిభయాన కరమునందున్
బ్రభలీన సమంత్ర కంకణము లమరించెన్. 136

ఉ. ధన్యుఁడు రుక్మిభూభృదవతంసుఁడు కన్యను శ్రీప్రపంచమా
ర్ధన్యను సర్వమంగళవిరాజిత లీలఘటింప నావసు
వాన్యక కళాధురీణు సుమనశ్శ్యయధర్మునిగా నెఱింగి యు
న్నాన్యమహానురాగము లుదారతమీఱఁగ ధారవోసెనన్.

క. అంతట సుముహూర్తమున
నంతుఁడు తెరమఱుఁగు దీఱఁగాంతామణిపై
సంతస మీమ త్రపయ
భ్యంతరమునఁ గలుగు ప్రేక్షణాళిం జొనిపెన్. 138

ఉ. అంగన లుత్సహించి యరయంగనభంగుర శోభనాంకతా
సంగతి యాజ్ఞికోత్తముఁ డొసంగఁ దిరంబుగ శంబరారి దా
ర్పంగదియించు పాణులమెఱుంగులుసొమ్ములకాంతిపైకొనన్
మంగళసూత్రమంత-మహిమంగళసీమ నమర్చె నింతికిన్.

క. శ్రీముక్తికముల మదనుఁడు
సామోదత సేసలిడియె నపుడు "ప్రజామే
కామ స్సమృధ్యతా"మని
భామామణి యౌదలందుఁ బ్రభ దనరారన్. 140

ఉ. కెంజిగురాకుచాయ దులకించు నిజాంజలిరక్తిఁ బొల్చునా
మంజులముక్తికంబులను మానిని భర్తృశిరంబునందిడన్
రంజిలెఁదెల్పుచాయ నవిరాగము గల్గినచోటు వాయువే
ళంజనదే, విపాండిమ కళన్ ధరియింపఁగ నెట్టివారికిన్. 141

క. ఈవిధమున వేడుకచే
నావధువును వరుఁడుఁ జెలగి యన్యోన్యనిరీ
క్షావహదవి సంభ్రమ రస
భావమున న్మౌక్తికములఁ బ్రాలాడుతఱిన్. 142

క. వినుతాచారక్రమమున
మునివరుఁడు ప్రధానహోమముఖశుభహోమా
ర్చనల హుతాశనుఁ దనుపన్
బనుపంగ వధూవరు లిద్ధభాసితలీలన్. 143

క. పావకునకు నభిముఖులై
శ్రీవెలయఁగఁ దనరి రపుడు శిఖియును దదూ్ర్వా
షావళి కాంతి తిరస్కృతుఁ
డై వడి ధూమచ్ఛలమున శ్యామికఁ జెందెన్. 144

క. వెలుఁగొందె జాతవేదుఁడు
లలనాలాజాహుతియు లలితస్వాహా
కలితపరిగ్రహ లీలో
జ్జ్వలతర శృంగార వేషధారుఁడో నాఁగన్. 145

గీ. శుభతరాచార కలకలసాంపుమీఱు
దంపతులు సేయు నుపచారధర్మములకు
హావిరదన శబ్దపటిమ కీలానుకంప
లీలనెంతయు శ్లాఘించెఁ గీలియపుడు. 146

చ. గురుతముఁడైన గర్గముని కూరిమి మీఱ మహర్షులన్ దడీ
య రమణులన్పురాతన మహాసతులన్ దెలుపంగ వారికా
దరమున వేఱువేఱ నవదంపతులై తగు రుక్మి కన్యకా
సరసిజనేత్రసూను లతిసంభ్రమ మొప్పఁగ మ్రొక్కనయ్యెడన్.

చ. పతి నెడఁబాయ కెప్పుడు నపారముదంబునఁ బొల్చు నాయరుం
ధతిఁ గనుఁగొమ్మ కొమ్మ! తగఁ దాదృశభవ్యసువాసినీత్వసం
గతి లభియించు నీకనుచుఁ గంజదళేక్షణ లెచ్చరింప నా
సతిఁ గని బాలకేలుగవ సమ్మతి గూర్చె లలాటపట్టికన్. 149

క. సాక్షా దాశీర్వాదవ
చోక్షరముల రాపులనఁగ నర్వ్యము లగు నా
ర్ద్రాక్షతములు గైకొనె న
బ్జాక్షసుతుం డుదితోడ హర్షము మీఱన్. 148

సీ. ఆరతులిచ్చు పుణ్యాంగనా జనముల
మంగళ గీతికా మహిమములును
గురుతపోధన మహీసుర సంఘములొనర్చు
శోభితాశీర్వాద వైభవములు
సమధికప్రౌఢి మాశ్రయవందిజనమాగ
ధాయతస్తోత్ర వాచార భటులఁ
దతమహాతూర్యమర్దళకాహళాది మం
గళవాద్యగుంఫనమ్ములును గలసి

గీ. చెలఁగఁ గళ్యాణ లక్ష్మి సత్కళికఁ జెంది
రుక్మవతి యాటఁ బ్రద్యుమ్నరూఢిగనుట
సిరులు మీఱంగ భాగ్యైక గరిమఁ గ్రొత్త
చెలువ మలరారె నాదంపతులకు నపుడు. 150

ఉ. వియ్యము లిద్దఱుంగదిసి వేడుక నాత్మపురోహితేంద్రుల
న్నెయ్యము మీఱ దగ్గఱి వినిర్మలరత్నవిభూషణోజ్జ్వలా
ఢ్యయ్యసువర్ణచేలములఁ గట్నములఁ జదివించి రొప్పఁగా
నయ్యిరువంక చుట్టముల కప్పుడు దారత మీఱుచుండఁగన్.

గీ. వారు వీరికొసఁగు వసుసంపదలుమోసి
వీరు వారి కిడిన విపులరత్న
రాశిఁ దాల్చి యపుడు రాణించె వసుమతి
యనఁగ రత్నగర్భయనఁగ ధరణి. 152

ఉ. నిర్మల హేమరౌప్యమణి నిర్మితపాత్రపటీసహస్రముల్
భర్మనిబద్ధపేటికల భంగురతుంగమతంగజాశ్వముల్
కూర్మి ఘటింప నెచ్చెలులకోరిక కెక్కువలై తలిర్పఁగా
నర్మిలిఁగూతు కిచ్చె నరణంబులు రుక్మినృపాలుఁ డత్తఱిన్. 153

క. నిరవధి ఘనబాడబచయ
పరితోషకరంబులై యభంగత నపు డ
య్యిరువురి భాండాగారము
లరుదుగ రత్నాకరంబు లనఁ జెలువొందెన్. 154

గీ. అతిరసాపూప పాయసాద్యఖిలరుచిర
వస్తుసంపద నిరుదెగ వారు నప్పు
డాప్తబాంధవవర్గ పర్యాప్తిఁ బెండ్లి
బంతి విందు భుజించి రభ్యంతరమున. 155

వ. ఇవ్విధంబున నవ్విదర్భధరాపరమేశ్వరుం డఖిల జగజ్జేగీయ
మానవైభవాభిరామంబుగఁ గల్యాణమహోత్సవంబునలిపి
ద్వారకాపురంబునను్న యాదవజనులను మణిమయభూష
ణకాంచనాంబరవిశేషంబులం బరితోషంబునొందించి యదు
వృష్ణి భోజాంధక కురుముఖ్య నృపాలవర్గంబుల యథా

ర్హాంబుగ సత్కరించి, వసుదేవ బలరామ కృష్ణ సాత్యకి ప్రముఖులగు కూరిమిచుట్టంబుల బహూకరించి, యల్లునకుం గూతునకుం గజతురగ చామర చ్ఛత్త్రాది మహార్హవస్తువు లరణంబులొసంగి, సంతోషతరంగితాంతరంగుండై నిజపరివారసహితుండగుచుఁ గుండినపురంబునకుంజనియెనంత. 156

క. ఇభరాజగమన లందఱు
శుభలగ్నంబరసి యపుడు సుదతీమణికి
న్విభుతోనైక్య మొనర్పఁగ
నభిమత శృంగారలీల లలరించు తఱిన్. 157

చ. తనపతియైనరాజునకుఁ దద్దయు నీతఁడు మేనయల్లుఁ డిం
పొనరనవోఢఁగూడ సుముహూర్తము వేగమె తారసిల్లఁ జే
తునను మనంబుచేఁబలె వధూమణి డెందమునందు నానఁడా
సినగతిడాసె రాత్రి సరసీరుహబాణుఁడు సంతసింపఁగన్. 158

వ. అవ్వేళం బ్రద్యుమ్నుండును నవవధూపభోగఫలప్రదాత్రులగు విద్యుద్గాత్రులని మంత్రణంబున నేకాంతమణి భవంతి కాంతరంబున నితాంతకాంత చంద్రకాంతశిలాకలాప పరికీలితంబును, సమందోద్దీప్యమానారవిందమణిప్రదీప భామాభిరామంబును, చిత్రకారచాతురీపరికల్పితసితవ్యజన పీటికాప్రదానముఖ వివిధోపచారకృత్పరిచారికా జనసమాజ భ్రమకరవిభ్రమయంత్రపాంచాలికా సమంచితంబును, గామకేళీకళోపన్యాసముఖరకీరశారికా విరాజితంబును, ఘన

సార నాభిసార గంధసార ముఖసురభి ద్రవ్యసంభారగుంఫిత శాతకుంభమయపాత్రికా విచిత్రంబును, ప్రతిబింబాపాదన సమస్తవస్తుద్విగుణీభావ ప్రతిపాదనైకసమర్థమహాముకురపాళికాని శాంతప్రాంతంబును, నింద్రనీలమణిజాలక వలయితకుడ్యభాగసుందరంబగు భోగమందిరంబుఁ బ్రవేశించి, హితకుసుమకల్పంబగు హంసతూలికాతల్పంబున నధివసించి, యంచయానల శృంగారోపచారంబు లవధరించుచు విలాసైక నివాసంబై యున్న సమయంబున. 159

గీ. సొగసులన్నియు నొకచోట సూటిఁగూర్చి
నలువ నిర్మించెనాఁ దోఁచు కలికినెలమిఁ
ద్రిభువనంబుల మోహమొందించు విభుని
పడకయింటికిఁ దోడ్తేరఁబని వహించి. 160

క. నెమ్మొగములఁ జిఱునగవులు
గ్రమ్మఁగ నమ్మగువఁ గదిసి ప్రౌఢవయస్య
లొయ్యనమ్మ పతితోడ మాకిటఁ
దమ్ములముల నిడుదుగాని తగరావమ్మా. 161

క. అనిపలికి నెపంబునఁ గే
లొయ్యని విభు పడకింటి కడకుఁ గొంచక తోడ్తే
ర నపుడు జవ్వని మనమున
ఘనలజ్జాభరపయోధి గడలుకొనంగన్. 162

గీ. కరము విడిపించుకొనుచు నక్కంజముఖులఁ
బెనఁగి రాకున్నఁ జెలులార ప్రియుని పైనొ
లేక మనమీఁదనో కోప లీలఁ జూపెఁ
దడవు సేసితి మనుచు నీతలిరుఁ బోఁడి. 163

ఉ. కాక మఱేమి సిగ్గొయది కాంతునిపజ్జకుఁ జేరుదాఁక నే
చేకొని సిగ్గు గిగ్గు విడఁజేసి మనోభవుఁ డివ్వెలందికిన్
దీకొని యాత్మతంత్రములఁ దీరక దీర్చియొసంగుఁగాదె బి
బ్బోకవతీమతల్లులకు బుద్ధులు దిద్దఁగ జాలుప్రోఢిమల్.

క. అలనాఁడు నృపులఁ దెగడుచు
వెలఁది స్వయంవరమునందు విభువలచిన యా
వల పే మూల నిమిడ్చెను
నిలువెల్లను సిగ్గు చూపెనే నేఁడిచటన్. 165

వ. అని పలుకు తమ గేలిపలుకులకు నగు కినుకఁ జూపుచు మొ
గము మాఱువెట్టుచుఁ గనుమూయుచు భయ లజ్జావ్యాకు
లితాంతరంగయై యున్న యక్కన్నియం దమమతంబున
లాలించుచున్ గాంతునివలన మేలెంచుచుఁ దగవున దూలిం
చుచు బుద్ధిమాటలం దేలించుచు దిటముగీలించుచు నల్లనల్లన
మహాప్రయత్నంబున మనోహరు కేళికాగారంబునకుం
దోడ్తెచ్చిన. 166

క. భయ లజ్జ లప్పుడిదియె స
మయమని వలపడఁచి మగువ మదిఁజూరఁగొనన్

రయమున నావలపును ద
త్ప్రియుని మనంబునను చేరి పెల్లువహించెన్. 167

క. నడుము గడగడ వడంకఁగ
దడదడ లాడుచును గుండె తల్లడమందన్
దడబడు నడ నప్పడతి ప
గడపుం గంబంబు మాటుఁగా గొను నంతన్. 168

చ. మదనునితోడ నిట్లనియె మానిని యొక్కతె దేవ! నీవెఱుం
గుదువుగదా సుమాస్త్రములకోమలభావము వానివంటి దీ
సుదతి మిళిందవృత్తిఁదగఁ జూపుదుగాని రసోపభోగసం
పద నుపమర్దలీల నలమన్ దమిచెయ్యవలెఁ జెందఁబోకుమీ.

వ. అని యిట్లు ఛాయాకలితంబులైన ప్రౌఢోక్తుల విన్నవింప
దరహసితసుందరవదనారవిందుఁడై ప్రద్యుమ్నుండు కర్పూర
వీటికాప్రదానంబుల సత్కరించినఁ దదభిమతం బెఱింగి
యక్కురంగలోచన కనుంగవ కెఱుంగరాకుండఁ గురంగటి
మెఱుంగు బంగరు కీలుబొమ్మల సంగతి నున్నట్లు యుండి
సఖీజనంబులందఱుం గ్రమంబునఁ గేళికామందిరంబు వెలు
వడి చనినయంత. 170

గీ. బాలభవదీయ గాత్రసంపర్కసౌఖ్య
లీల విద్రుమ స్తంభంబు పాలుసేయ
నేల ? తడవులనుండి యాశించియున్న
మద్భుజా స్తంభముల కిడి మనుపరాదె? 171

వ. అని చమత్కరింప నచ్చోటుఁగదలి యను గవ్వాలనిను నయ్యో
డం గేలొడిసి పట్టుచో స్వేద నిష్యంద సాహాయ్యంబున
విడిపించికొనం జాఱినపయ్యెద చెఱంగువట్టి సెజ్జకురాఁదిగిచి
నిజాంకగతం జేయుచు. 172

క. నవమతిచేయుచు నాయెడ
నవమతిసేయంగ నీకు నర్హామె నీయం
దవసించె నామనమ్మిఁకఁ
గవ నీవకలంకచంద్ర కమనీయముఖీ! 173

క. అని చాటువచన రచనల
ననునయ మలరించి మోహ మగ్గలిక గొనన్
వనజాక్షుని తనయుఁడు జ
వ్వని మదిఁ గరఁగించి నాన వదలించు మదిన్. 174

గీ. పయ్యెదకులోన నున్నవి బన్నసరులు
బయల నునిచిన సొబగొందు భామయనుచు
నట్లుసేయంగఁ బయ్యెద నపసరించి
కుచములందున్న సిగ్గెల్లఁ గొల్లఁగొనియె. 175

క. వలి గుబ్బచనులఁ గరముల
నలమఁగ మెయిఁదీఁగ కంప మంద నదరి పా
క్కిలి విరిని పీడురజమున
దొలగెన్ దనయంత నీవి తోయజముఖికిన్. 176

చ. వరుఁడది సంధుసేసి కరవారిజమున్ జఘనస్థలంబుపైఁ
బఱపఁగ నెమ్మొమున్ గగురుపాటును జెమ్మటలుప్పతిల్లఁగా
హరిణవిలోచనామణి భయత్రపలన్ బెనగొన్న నెమ్మదిన్
బరవశిఁ గేలఁ దత్కరముఁబట్టు నెడందమిగొన్న చెయ్వులన్.

గీ. వలపెనయు పల్కువలపైచి వారిజాక్షు
తనయుఁ డత్తఱి సిగ్గచు వనములోనఁ
బొదలుసతి డెందమను చిల్కఁబూని రతిర
సాలఫలమాధురి యొకింత చవులు గొలిపె. 178

సీ. సరసాన సాబ్జ మాధురిఁ గ్రోలుచోఁ దన
గొనబైన సారంగ గుణత దెల్పి
రమణీయ కుచభూధరము లాక్రమించుచోఁ
దన ఘనత్వంబు సత్యంబొనర్చి
లలిత లావణ్యౌఘ వళివీచికలఁ దేలు
చోఁ దన మీనాంకశోభఁ జూపి
లీల జఘనచక్రమేలుచోఁ దన సుమ
నో ధర్మశాలిత బోధపఱిచి

గీ. వలచి వలపించు చెయ్వులవలను మీఱి
యపుడభినవోపభోగలీలానురక్తి
మెలఁగెనన మోహనాంగి యా మెలఁత తోడ
వలపు ఱేఁడైన రుక్మిణీవరసుతుండు. 179

క. ముదితా సమాగమసను
భ్యుదితకళారసకలన మపుడు నెమ్మదికిన్
మదన బ్రహ్మానంద
ప్రదమై వేడుకలునించెఁ బ్రద్యుమ్నునకున్. 180

గీ. ఎలమి నీరీతి నాజగదేకమోహ
నకరసౌందర్యనిధియైన నాథుతోడఁ
గాంతతరమైన భావశాంత్యంతసురత
వినుత సుఖపారవశ్యంబు ననుభవించి. 181

శా. విరిశయ్యం డిగి లోల నీలకబరీవేల్లత్ప్రసూనాళియై
కరపాళిన్ జఘనప్రదేశకలిత క్షౌమాంబరంబాని బిం
బరుచిన్బొల్చినమోవి కెంజిగురుపైఁ బల్లొత్తు లింపొదఁగన్
దరళాక్షీమణి సాళువాకురిచి వెన్కన్జేరె లజ్జాగతిన్. 182

గీ. బాలకెమ్మోవి యమృతంబుఁ గ్రోలి చొక్కు
చున్న నాచొక్కులోన నింపొలయ నెనయు
నిరుర సుఖియించుచున్న యమ్మదనుమేలు
కనఁగ జేయంగ వందిమాగధచయంబు. 183

పుష్పమాలికాబంధము.

చ. జయ ప్రియగేయపుష్పశరశర్వశమాపహ బాహమోహకా
జయజయ జేయ చక్రజలజప్రజయిష్ణు పదాపతోషమా
జయభయదాయతాసి సరసప్రసరోత్తిక శ్రీకళాకరా
జయనయభాయనాయ సమసత్వసశంబర సారవారణా. 184

రథపదబంధము.

క. గోదీపద్ధామాఢ్య మ
హోదయ వదహీన రాక్షసౌఘవినాశా
శ్రీదయ మానాఢ్యాత
త్త్వాదృక్సౌందర్యశాలి ధన్యజయుతమా. 185

క. అని నుతియింప నిదుర మే
ల్కని దినముఖయోగ్యకృత్య కలనందగి య
వ్వనరుహ నయనతనయుఁ డిం
పొనరె ఘనైశ్వర్యముల మహోన్నతుఁడగుచున్. 186

గీ. రుక్మి నృపకన్యతో నిట్లు రూఢి మెఱసి
యతుల సరసోపభోగసంగతులఁ దనరు
చుండెఁ బ్రద్యుమ్నుఁడని మునీంద్రుండు వేడు
కలర నరనాథమౌళికిఁ దెలిపెననుచు. 187

క. సూతుండీ శుభచరిత
స్ఫీతామృతరసము చెవులఁ జిలికింపఁగ ని
ర్ధూతాఘమగుచు మౌని
వ్రాతము సంతోషకలన రంజిల్లుటయున్. 188

క. శ్రీమెఱయు నిఖిలవిబుధ
గ్రామాభీష్టధనదాన రాజితమైయు
ద్దామశుచి వర్ణకీర్తిన్
మామకకృతి కల్పవల్లి మహిమదనర్చున్. 189

## రథపదబంధము.

శా. రమ్యశ్రీసరసోత్కరాకలితధారంధర్యలీలాచ్యుతా
పమ్యాగోపసమగ్రమాలలిత రూపాకృత్యసాదృశ్యధీ
నమ్యాపావన నామసమ్మిళిత పుణ్యాతిగ్మశాంతస్థతా
తామ్యద్దైవరగభూషతుష్టనర శ్రీతౌల్యత్యుధీమానితా. 190

## ముక్తపదగ్రస్తము.

క. స్మయనాంచిత శుభనయనా
నయనాయక సరసవిబుధ నవలసదయనా
దయనాంత కళాఢ్యయనా
ధ్యయనాంతః కరణసేవితాహిపశయనా. 191

క. బలవదెకితియార్ఖానో
జ్జ్వలసైనిక నాథరూపు శాహప్రముఖా
ఖిలవజ్జిర యశోహిమ
జలజేశితతేజదాన సౌరమహీజా. 192

## మాలిని.

సదయశుభకటాక్షా సాధులోకైకరక్షా
విదళితరిపుజాలా విశ్వవిఖ్యాతలీలా
మదనలలితరూపా మాన్యవిద్యాకలాపా
సదమలగుణచర్యా సర్వసామ్రాజ్యధుర్యా. 193

## గద్య.

ఇది శ్రీ లకవరసుమనోగిరిధామ రామచంద్రచరణార
వింద మరందాస్వాదన సమాసాదిత నిరవద్య
సాహితీరసవిభావిత కవితాతిరేక రేకపల్లి
సూర్యనారాయణ తనూభవ సకలవిద్వ
త్కవిజనానుగ్రహ సనాథ సోమ
నాథ ప్రణీతంబయిన రుక్మవతీ
పరిణయాభిధాన మహా
ప్రబంధంబునందు
సర్వంబును
పంచమాశ్వాసము.

# ఆంధ్రవిజ్ఞాన సమితి,

## విజయనగరము.

**అధ్యక్షులు, కోశాధిపతులు :**

రావుసాహెబు వేపకొమ్మ గురువేంకట సుబ్బయ్యపంతులుగారు,

బి. ఇ. సి ఇ. యం. ఐ. ఇ.,

చీఫ్ ఇంజనీయరు, శ్రీ విజయనగరం ఎస్టేటు.

**ఉపాధ్యక్షులు :**

అడిదము రామారావు పంతులుగారు,

రిటైర్డు సీనియరు తెలుగు పండిట్, శ్రీ మహారాజావారి కాలేజి.

**కార్యదర్శి :**

గంటి-సూర్యనారాయణశాస్త్రి,

**కృత్యసమాలోచనసమితి :**

మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ

తాతా సుబ్బారాయశాస్త్రిగారు,

శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామిగారు, యం. ఏ.

ప్రిన్సిపాల్, శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల.

శ్రీమాన్ టి. నరసింహాచార్యులుగారు, ఎం. ఏ. యల్. టి.,

లెక్చరర్ భాషాశాఖ శ్రీ మహారాజావారి కాలేజి.

డాక్టరు, బుర్రా శేషగిరిరావు పంతులుగారు,

యం. ఏ., పి హెచ్. డి.,

ఆకుండి వేంకట శాస్త్రిగారు,

పండితులు, శ్రీ మహారాజావారి సంస్కృత కళాశాల,

ఆంధ్ర యూనివర్సిటి సెనెటు, ఎకడమిక్కౌన్సిలు, బోర్డాఫ్ స్టడీసు సభ్యులు.

## సమితియుద్దేశములు.

ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున నింతవర కెన్నియో యుద్గ్రంథములు వెలువడియున్నవి, వెలువడుచున్నవి. అవి యన్నియు ఆంధ్రవిజ్ఞానాభివృద్ధికి సహకారములగుచున్నను, ఆంధ్రవిజ్ఞానస్రవంతిని ఆంధ్రావనిలో సర్వతోముఖముగ ప్రవహింపజేయుదలంచి, మే మీ "ఆంధ్రవిజ్ఞానసమితి" ని నెలకొల్పినారము.

ఇందు ప్రాచీనాధునిక సారస్వత, చారిత్రిక, నైతికాది సంబంధ బంధురములగు హృద్యపద్య గద్య గ్రంథములు, సంవత్సరమునకు నాలుగింటికి తక్కువగాకుండగ బ్రచురించ నిశ్చయించితిమి.

శాస్త్ర సంబంధములగు ప్రాచీనగ్రంథములను, రసభరితములగు ప్రాచీన ప్రబంధరాజములను. అధునాతన కవిపుంగవులు, విద్వాంసులు, కళాభిజ్ఞులుమున్నగువారిచే రచియింపబడిన పరిష్కృతోపయోగములైన గ్రంథరాజములను మాసమితికి పంపిన, వాటిని సవిమర్శనముగ పరిశీలించి, ముద్రణార్హములగునేని వాటిని ముద్రించుటకు ప్రయత్నించెదము. ఇంతియె గాక, ముద్రితగ్రంథములవలన లభించినలాభములో కొంతపాలు తద్గ్రంథాధికారికి కోరినచో లభించగలదు.

సమితి యాదాయమంతయు, గ్రంథప్రచురణకు, గ్రంథకర్తలకు, ప్రాచీన గ్రంథసంపాదనకు వినియోగింపబడగలదు, గాన ఆంధ్ర భాషాభిమానులు, ఆంధ్ర భాషోద్ధారకులు, ఆంధ్ర విజ్ఞాన సంవర్ధకులగు ఆంధ్రమహాశయులు మాయీ సమితిలో పోషకులుగను, చందాదారులుగను, జేరి, మాయుద్యమమునకు చేయూత నొసంగి, మాకుతోడ్పడి భాషాభివృద్ధిని చేయుదురుగాక యని యాశించుచున్నారము.

---

## నిబంధనలు.

పోషకులు:— సంవత్సరమునకు 10- రూపాయిలు తక్కువ గాకుండగ నిచ్చువారు యీసమితికి పోషకులుగ పరిగణింపబడుదురు. సమితినుండి వెలువడిన గ్రంథములన్నియు వినామూల్యముగ పొందగలరు.

చందాదారులు:—సంవత్సరమునకు 4- రూపాయీలు ముందుగా నిచ్చువారు చందాదారులుగా నుండగలరు. సమితివారే తపాలాఖర్చులను భరించి గ్రంథముల నందింపజేయుదురు.

చందా నిచ్చువారు తప్పక రశీదును పొందవలెను. చందాసొమ్ము అధ్యక్షునిపేరిట పంపవలెను.

చందాదారులుగా జేరని యితరులకు తపాలాఖర్చులు గాక గ్రంథమొక రూపాయికి లభించగలదు.

---

ఆంధ్రవిజ్ఞానసమితి ప్రథమ గ్రంథరాజము.

# రాధామాధవసంవాదము

వెలిదిండ్ల వేంకటపతి మహాకవి ప్రణీతము. శృంగార రసభరితము.

(1700 సంవత్సరపు కృతి)

విక్రమ సంవత్సరారంభమున వెలువడినది.

ఇందు, రాధాకృష్ణుల శృంగారలీలలు, రాధామాధవుల ప్రథమానురాగము, రాధావిరహము, శుకసందేశము, రాధామాధవుల సంవాదము, సవతుల సంభావణములు, నెరజాణతనపు నేర్పుతో నిర్వహింపబడినవి. ఈకవిరసవాంచలమున నాంధ్రవాణి యత్యుల్లాసముతో నృత్యమాడినది. పరిమళముగల పలుకు గుత్తులను పద్యరూపమున విరజిమ్మినది. కవిరాధోక్తులను జెప్పునపుడు ఆడుదిగా మారినాడు. ముద్దుపళని రాధికాస్వాంతమున కీకృతి మేలుబంతి. మృదుమధురపదవిలసితము. బాలబాలికలకుకూడ అందుబాటగు సులభశైలిని కలిగియున్నది. చక్కని అచ్చు, చిక్కని కాగితము.

ఆంధ్రవిజ్ఞాన సమితి - ద్వితీయ గ్రంథరాజము.

# విస్మృతకళింగాంధ్రకవులు

## ప్రథమ భాగము.

(మద్రాసు టెక్స్టుబుక్కు కమిటీ వారి యామోదమును బడసినది.)

కృతికర్త: అడిదము రామారావు పంతులుగారు.

ఆంధ్ర సారస్వతాభ్యుదయ కారకులగు మహాకవుల జీవితచారిత్రాదికములను కీ. శే. కం వీరేశలింగం, గు. శ్రీరామమూర్తి పంతులువారలు తమకు లభ్యమైనంతవరకు స్వీకరించి, ముద్రించిరి. వారలకు లభ్యము కానట్టి 15 కవిపుంగవుల జీవితవృత్తాంతములను, వారల గ్రంథములను సంపాదించి, సవిమర్శముగ వారివారి చరిత్రములను వ్రాసి యీ సమితి ద్వితీయగ్రంథముగ ప్రచురించియున్నారము. ఈ గ్రంథము గద్యపద్యాత్మకమై సకల జనానందకరమై వెలయుచున్నది.

ఆంధ్రవిజ్ఞానసమితి తృతీయ గ్రంథరాజము.

# వాల్మీకిచరిత్రము

(మద్రాసు టెక్స్టుబుక్కు కమిటీవారి యామోదమును బడసినది.)

తంజావూరి రఘునాథభూపాల ప్రణీతము.

ఇందు, మహాఋషులతపఃప్రభావములు, నారదసమాగమము, వివిధ క్షేత్రమహిమాభివర్ణనము, వాల్మీకివృత్తాంతము, ఆదికవిపుంగవుని దైవిహికాముష్మిక జ్ఞానసమాలోచనము, రంభోర్వశుల గర్వభంగము, బోయలచర్యలు, మున్నగు విషయములు స్వభావోక్తిగ వర్ణింపబడినవి. రఘునాథభూపాలుని కవిత్వము చమత్కారపదభూయిష్ఠమై, పండితపామర కర్ణరసాయనమై మృదుమధురశైలితోనొప్పి, యౌచిత్యపోషకమై యెంతయో మనోహరముగ నున్నది.

క. చెవులకుఁజవులై చల్లఁగ గవులకుఁ దవులై సమస్తకావ్యకళాబం
ధువులై రససింధువులై యవురాయని కవితలవని నలరఁగవలదా!

5

ఆంధ్రవిజ్ఞానసమితి, నాల్గవగ్రంథము.

# ధర్మజ్ఞచరిత్ర

(మద్రాసు టెక్స్టుబుక్కుకమిటీవారి యామోదమును బడసినది.)

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, తాతా సుబ్బారాయ శాస్త్రులుగారి యుపోద్ఘాత యుత్తము.

కం. గురువేంకటసుబ్బయ్య, తన
తరుణీమణి, ఆదిలక్ష్మి తన కూఁతముగా
విరచించె నీప్రబంధము
గురువిది కబ్బములుగూర్చు గురువుల కెల్లన్.

అని తిరుపతి వేంకటేశ్వరకవులలో నొకరును, శతావధానులును, కళాప్రపూర్ణులును అగు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులుగారు సూత్రప్రాయముగ వచించిన యీప్రబంధమునందు, కైలాసగిరి శిఖరమున సుమామహేశ్వరులు కొలువుదీరియుండ, శ్రీ మహావిష్ణువు, శివభక్తుఁడగు ధర్మజ్ఞుని యుదంతమును పార్వతికి చెప్పుట, గార్హస్థ్యముననుండి ముక్తిని బొందవచ్చుననియును పంచాక్షరీమహామంత్ర ప్రభావము, ప్రాణాయామక్రమము, యోగపద్ధతి, శివస్తుతి మున్నగునవి భక్తిరసముట్టిపడునట్లు వివరింపబడినవనియు, శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ తాతా సుబ్బారాయశాస్త్రులుగారు, కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, కావ్యస్మృతితీర్థ, కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారు, పండిత వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియుండిరి.

ఇది మూఁడు గుచ్ఛములు గలిగి మూలతత్త్వమును బోధించెడి భక్తిరస భరితగ్రంథరాజము. గద్యపద్యాత్మకము.

వెల ౧-౦-౦

ఆంధ్రవిజ్ఞానసమితి, పంచమగ్రంథరాజము.

# రుక్మవతీపరిణయము.

రేకపల్లి సోమప్పకవి ప్రణీతము (1720 సం.)

శ్రీ ఆశ్రితము సూరకవి కడుగడుగునను కవిత్వమున కలుసుకొనిన

కవిపుంగవు డీరేకపల్లి సోమప్పకవియే.

తాటియాకుల గుడిసెల అటకలపై స్థిరనివాసముచేసుకొని, యెలుకలకు, చెదపురుగులకు తన శరీరమును పంచి యిచ్చుచుండిన తాళపత్ర ప్రతులలో నుంచి యీ గ్రంథమును సంపాదించి ముద్రించినారము. ఇంతదనుక నీగ్రంథము ముద్రిణభాగ్యమును పొందియుండలేదు. ఇదియే ప్రథమముద్రణము. ఈతని కవిత్వమును గూర్చి యొక కవి యీవిధముగ చెప్పెను.

కం. అప్పా! రేకపలీ సో
మప్పా! విభుదాళిపాళి మమ్మొలపులప్పా
ఒప్పులు నీకవితలు వె
న్నప్పాలకు సాటివచ్చునా! భళిరుచులన్.

వెల ౧-౦-౦

అధ్యక్షులు,

ఆంధ్ర విజ్ఞానసమితి, విజయనగరము.

కాకినాడముద్రాక్షరశాల, కాకినాడ.

